పెంపుడు జంతువులు



26-4-61

25 నయాపైసలు

ఆంధ్రసచిత్రవారపత్రిక



"కావాలని వచ్చాను - నీకే మనసిచ్చాను"

ఎండలు మండిపోతూ ఉంటే వాడవలసిన పౌడరు—

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్




నవోత్సాహము నిస్తుంది, చెమటను పీలుస్తుంది,

తేలికైన సువాసనను వెదజల్లుతుంది

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ రోజంతా తాజాదనమును యిస్తుంది! ప్రొద్దున్న స్నానముచేయగానే యీ పౌడరును ఒత్తుగా జల్లుకోండి. ఎండ మండే రోజున కూడ మీరు రోజంతా సువాసనతో ఉంటారు!

చాలసేపు తాజాదనముతో ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ ట్యాల్ వాడండి.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఏ. లో స్థాపింపబడినది)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

## ఉత్తరాలు

### కార్టూనులు

12-4-61 తేదీ ఆంధ్ర సచిత్రవార పత్రికలో "ఊమెన్"గారి కార్టూనులు చాలా బాగున్నవి. "గోడునుకు ఇతరులకు పట్టి తడిపిన దామోదరుండు" అన్న కార్టూను బ్రహ్మాండంగా ఉంది.

వి. రాధాకృష్ణ, (కాకినాడ.)

*　　　*　　　*

5-4-61 తేది పత్రికలో ఊమెన్ గారి కార్టూన్ బాగుంది. పార్లమెంటు ఉప నాయకత్వానికి; వైద్యకళాశాలలో స్త్రీలకు వేసిన కార్టూన్స్ నన్ను ఆకర్షించాయి.

కే. వి. స్వామి., (అనంతపురం.)

29-8-61 తేదీ పత్రికలో శంకర్ గారి "ఎప్పుడూ ఇంతే" కార్టూన్ చూడటానికి చాలా బాగుంది. నవ్వు పుట్టిస్తుంది. కాని నా ప్రవానికి? అలాంటి భార్యా భర్తలు ఉంటారా? అని నా అనుమానం.

కె. సీతారామమూర్తి, (కాకినాడ.)

*　　　*　　　*

12-4-61 వ తేదీ పత్రికలో "ఎప్పుడూ ఇంతే (79)" శీర్షికలో శంకర్ గారు వేసిన బొమ్మ చాల అసందర్భం. ఆ బొమ్మలో తలకాయలేని మొండానికి మందమతి ఎక్కడి నుండి వస్తుంది? ఎలా మాట్లాడుతుంది? అసలు తల ఎందుకు తీయవలసి వచ్చిందో అర్థంగావటం లేదు. ఇటువంటి తలలోకలేని బొమ్మలువేసి మీరు (శంకర్ గా
లను నవ్వించా లనుకోవటం శో
కె.డి. భవానీమోహన్, (నర్స

5-4-'61 వారపత్రికలోని కార్టూన్ "... అవుతుందనే గొడుగు నాచేతికి ఇచ్చిన చెప్తే విన్నాగా మరి...?" చాలా బాగుంది. చిత్రకారుడు శ్రీ రంగారావుకు, ప్రచురించిన మీకు హృదయపూర్వక అభినందనలు.

ఎం. వెంకటేశ్వరరావు, (విజయపురి.)

* * *

## 'కవిత'

12-4-61 తేదీన ఆంధ్ర సచిత్ర వార పత్రికలోని 'కవితా కింకిణి' శీర్షిక క్రింద ప్రచురించిన "పగడాలదీవి" చాలా బాగా ఉన్నది.

ఇలాంటివి ఎన్నదగిన రచనలెన్నో ప్రచురించి పాఠకుల మన్ననల నందుకోనగలరని కోరుతున్నాను.

పి. వెంకన్నగౌడ్, (గద్వాల.)

* * *

12-4-61 తేదీ సంచిక చదివి చాల సంతోషించాను. ముఖ్యంగా మీరు ప్రచురించిన పద్య కుసుమాలు చాలా ఆనందాన్నిచ్చాయి.

ఎస్. కబీరుదాసు, (విజయపురం).

* * *

## న్యూఢిల్లీ లేఖ

శ్రీ కృష్ణగారు "అశాంతికి దారితీసిన శాంతి సమావేశం" "ఢిల్లీ అశోక్ హోటల్ తెరచాటుకథ" చాల బాగుగా వ్రాసినారు. ప్రతి విషయం చక్కగా విమర్శించి వ్రాస్తారు, కాబట్టి శ్రీకృష్ణగారు మాకు అభినందనీయులు.

వి. వెంకటేశ్వరరావు
బాపటి వెంకటసుబ్బారావు
(రాజమండ్రి)

* * *

ప్రతివారం శ్రీకృష్ణగారు వ్రాయు "న్యూఢిల్లీ లేఖ", పాఠకులను అభ్యుదయమార్గాన కంటె వక్రమార్గాన పెట్టుననుట నిస్సందేహము. ఆంధ్రపత్రికయందు యిట్టి రచనలకు చోటు కల్పించుట శోచనీయము. శ్రీకృష్ణగారి వినాశకర రచనలను కట్టిపెట్టించమని కోరుతున్నాను.

ఎస్. కె. సుబ్రహ్మణ్యం
(విశాఖపట్నం)

* * *

## కథలు

5-4-'61 తేదీ వారపత్రికలో కుమారి కళ్యాణిగారు వ్రాసిన 'స్మితనయన' చాలా బాగుంది. భార్యాభర్తల మధ్య ఉండే ప్రేమానురాగాలను వారు బాగా చిత్రించారు. కళ్యాణిగారికి నా అభినందనములు.

డి. రామకృష్ణంరాజు
(పాలమూరు)

12-4-61 పత్రికలో "భామిని—బ్రహ్మచారి" అనే కథ చాలా బాగున్నది. రచయిత శ్రీ సింగరాజు రామచంద్రమూర్తిగారికి మీ (మా) ఆంధ్రపత్రికద్వారా నా అభినందనలు అందజేయగోరుతాను.

డా॥ కె. వి. రావు
(వెంకటపాలెం)

* * *

19-4-61 తేదీపత్రికలో పిళ్లైగారు వ్రాసిన "హాలాహలంలో అమృతభాండం" అన్న కథ నన్ను సంతోషపరచినది. హాలాహలంగా అత్తగారిని అమృతభాండంగా నీరజను బాగా పోల్చి చాలా రసవత్తరంగా వ్రాశారు.

వి. ఆర్. శేఖర్
(చేబ్రోలు)

* * *

12-4-61 మా (వీ) ఆంధ్ర సచిత్ర వార పత్రికలో కథలు చాల ఆకర్షణీయంగా ఉన్నవి. "భామిని-బ్రహ్మచారి" అను కథ చదువుతున్నంతసేపు నా హృదయం ఆనందంతో ఉప్పొంగిపోయింది. ముఖ్యంగా శంకరం ఆడిన నాటకం గుర్తుకొస్తే నవ్వు వస్తుంది.

ఎస్. జి. హరిశ్చంద్రరావు
(కలకత్తా)

* * *

'ప్రత్యక్ష దైవం' ఆంధ్రసచిత్ర వార పత్రిక [5.4-'61] లో ప్రచురించుట పత్రికకు ఒక ప్రత్యేక ఆకర్షణ. కేవలము ప్రేమ కథలతోనే పత్రికను నింపకుండా, భక్తిని ముక్తిని కలిగించేటువంటి, కథలను వారమునకు ఒకటైనా ప్రచురిస్తారని ఆశిస్తున్నాము.

గోపరాజు వెంకటభరత్, యజ్ఞన్న
(నర్సాపూర్)

5-4-61 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 'ప్రత్యక్షదైవం' అను కథ చాల బాగున్నది.

ఇప్పుడు వెలువడే కథలవలె కాక క్రొత్త పద్ధతిన వున్నది. రచయితకు పత్రికద్వారా నా అభివందనములు.

పి. సులోచన
(విడవలూరు)

*　　*　　*

29—8—61 పత్రికలోని 'నేరనిరోధం' కథ చాలా బాగుంది. రచయిత శ్రీ పెద్దిభొట్ల సుబ్బ

# ఉత్తరాలు

రామయ్యగారు నేడు సమాజంలో జరుగుతున్న అవినీతి సంఘటనలు కళ్లకు కట్టినట్టు రచించారు. వారికి నా అభివందనములు.

కె. యస్. మూర్తి (రాజమండ్రి)

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారి. "నేర నిరోధం" కథ చాలా సహజంగా ఉంది నిత్య జీవితంలో జరిగే మోసాలను చాల చక్కగా విపులీకరించారు. రచయితకు నా హృదయపూర్వక అభినందనలు.

దువ్వూరి కామేశ్వరి (అమలాపురం)



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపాదకుడు:
శ్రీ [illegible]ధాకృష్ణ

★

సంపుటము 55
సంచిక 33

26-4-61

బుధవారం

ప్లవ సం॥ వైశాఖ శుద్ధ ఏకాదశి

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, సంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం: లలితకళానికేతన్ వారి
'భక్తజయదేవ'లో అంజలీదేవి



## వచ్చేవారం...

భ్రష్టయోగి, ప్రణయావేశం
—కథలు
విడాకులు - వ్యాసం

## రచయితలకు విజ్ఞప్తి

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ప్రతి సంచికను సర్వాంగసుందరంగా అలంకరించి పాఠకులకు అందజేయాలని మా సంకల్పం. ఇందుకు రచయితల సంపూర్ణ సహకారం అర్థిస్తున్నాం. రచయితలు తమ కథానికలను, వ్యాసాలను, ఇతర రచనలను పంపేటప్పుడు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, మద్రాసు-1" అని స్పష్టంగా వ్రాయాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

సంపాదకుడు.

## కార్టూనులు

ఇండియన్ ఇంకుతో వేసిన కార్టూనులు మాత్రమే స్వీకరిస్తాము. అన్ని చిత్రాలూ ప్రచురిస్తే ఏమాత్రం 'సైజు' వస్తాయో సుమారు అంతసైజు వేస్తే బాగుంటుంది. సాధారణంగా 4"×2", 4"×4", లేక 6"×4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటా



మేము గెలిచాం
నెహ్రూ సలహా
నెహ్రూ సలహా
నెహ్రూ సలహా
?
ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుని ఎన్నిక
మంచం క్రింద ఈ గోల ఏమిటి?
మిస్టర్ మాక్ మీరు వెనుక సీటులో కూర్చోండి. కారు నేను నడుపుతాను
పాశ్చాత్య దేశాల కూటమి

శ్రీకృష్ణ

# ప్రభుత్వ వాణిజ్య సంస్థ కార్యకలాపాలు: యంత్రాల తయారీకి సదుపాయాలవృద్ధి

ప్రభుత్వ వాణిజ్య సంస్థ దిగుమతులను మూడు వర్గాల క్రింద పేర్కొనవచ్చు (ఎ) సంస్థ గుత్తగా చేసుకునే దిగుమతులు, (బి) దేశంలో ధర వరలను నిలకడగా ఉంచేందుకు సాధారణ దిగుమతులతో పాటు ప్రభుత్వ వాణిజ్య సంస్థ చేసుకోవలసిన దిగుమతులు, విదేశీ మారకం ఆర్జించేందుకు వస్తు మార్పిడి పద్ధతి క్రింద చేసుకోవలసిన దిగుమతులు, (సి) పరిశ్రమల యజమానులకు, వినియోగదారులకు ముఖ్యంగా కావలసిన ముడి వస్తువులను రూపాయిలలో ఖరీదు చెల్లించే పద్ధతినగాని, వస్తు మార్పిడి పద్ధతినగాని దిగుమతి చేసుకొని తోడ్పడటం

మొదటివర్గం క్రింద ఈ ఏడు కూడా కాస్టిక్ సోడా, సోడా యాష్, ముడిసిల్కు, రసాయనిక ఎరువులు దిగుమతి అయ్యాయి ఈ సరుకులు కావలసిన మేరకు సరఫరా అయినందువల్ల మార్కెట్లో వీటి ధరలస్థాయి పెరుగలేదు పరిశ్రమల యజమానులు ఇతర వినియోగదారులు చాలా లాభం పొందారు

బ్రిటన్, జపాన్ దేశాలనుంచి 33,200 టన్నుల కాస్టిక్‌సోడా, రుమేనియా, బ్రిటన్, బల్గేరియా, పోలెండ్ దేశాలనుంచి 70,500 టన్నుల సోడాయాష్ దిగుమతి చేసుకునేందుకు ఒప్పందాలు కుదిరాయి

నత్రజని ఎరువులకు సంబంధించినంతవరకు రూపాయిలలో ఖరీదు చెల్లించే పద్ధతిన రష్యా, తూర్పు జర్మనీ దేశాలనుంచి 105,000 టన్నుల అమోనియం సల్ఫేట్ దిగుమతి అయింది ఇదికాక బెల్జియం, ఇటలీ దేశాలనుంచి వస్తు మార్పిడి పద్ధతి క్రింద మరో 62,000 టన్నుల అమోనియం సల్ఫేట్ దిగుమతి అయింది సుమారు 20 లక్షల పౌనులు విలువచేసే ఎరువుల దిగుమతికి సాది కంపెనీతో కుదుర్చుకున్న ఒప్పందాన్ని అనుసరించి సుమారు 36,100 టన్నుల ఎరువులు అప్పుడే దిగుమతి అయ్యాయి మిగతా సరుకు విషయమై ఇంకా సంప్రదింపులు జరుగుతున్నాయి. భారత—చిలీ దేశాల మధ్య జరిగిన వాణిజ్య ఒప్పందం క్రింద 25 వేల టన్నుల నైట్రేట్ దిగుమతికి కాంట్రాక్టు కుదిరింది

1961, 1962, 1963 సంవత్సరాలలో ఏటా 60 వేల టన్నుల అమోనియం సల్ఫేట్, 36,000 టన్నుల పొటాష్‌మూరియేట్ దిగుమతి చేసుకునేందుకు తూర్పు జర్మనీతో దీర్ఘకాలిక ఒప్పందం కుదిరింది

పాదరసం దిగుమతులు ప్రభుత్వ వాణిజ్య సంస్థ ద్వారానే జరగాలని, ప్రభుత్వం ఇటీవల ఆదేశించింది మొదటి సారిగా రు 10 లక్షలు విలువ చేసే పాదరసం దిగుమతికి ఏర్పాట్లు జరుగుతున్నాయి

రూపాయిలలో ఖరీదు చెల్లించే పద్ధతిన బర్మాతో చేసుకున్న ఏర్పాట్ల క్రింద ఈ ఏడు కూడా విత్తనాల బంగాళాదుంపలు దిగుమతి చేసుకోవలసిందిగా ప్రభుత్వం, ప్రభుత్వ వాణిజ్య సంస్థకు సూచించింది సుమారు రు 10 లక్షల విలువచేసే విత్తనాల దుంపలను దిగుమతి చేసుకొనటం, వాటిని సహకార సంస్థల ద్వారా రైతులకు సరసమైన ధరలకు అందజేయటం జరిగింది

మూడవవర్గం క్రింద వినియోగదారులకు సహాయంచేసే నిమిత్తం రు 29 54 కోట్లు విలువ చేసే వివిధ రకాల ఇంజనీరింగ్ పరికరాలను దిగుమతి చేసుకునే వసతి కల్పించారు 1959 ఏప్రిల్ 1 వ తేదీనుంచి 1960 మార్చి 31 వ తేదీవరకు గల 12 మాసాలలో వినియోగదారులకు సుమారు రు 20 కోట్లు విలువచేసే దిగుమతులు లభింపజేశారు 1960 ఏప్రిల్ 1 వ తేదీనుంచి నవంబరు 30 వ తేదీవరకుగల ఎనిమిది మాసాలలో రు. 29 కోట్ల వ్యాపారం జరిగింది

రెండవ వర్గం క్రింద దిగుమతి అయిన సరుకులు ఇనుముతో సంబంధంలేని లోహాలు, న్యూస్‌ప్రింట్, కృత్రిమ సిల్కు నూలు, పెద్ద టైర్లు, ఫోటోగ్రాఫిక్ పరికరాలు, వ్రాతకు, అచ్చుకు పనికివచ్చే కాగితం, నూలు

(59-వ పేజీ చూడండి)



భారతదేశంలో అమెరికా రాయబారిగా ఇటీవల నియుక్తులైన డా॥ గాల్ బ్రెయిత్, వారి కుటుంబం.



"బా .. మ్మా!...." అని పిల్చాడు రామం.

ఒక్కసారి వెనక్కి తిరిగి తన రాగరంజిత కువలయారుణవర్ణభాసిత నయనాస్త్రాలు రెండే రెండు విసిరి అదేవేగంతో వెళ్ళిపోసాగింది 'బాపూ బొమ్మ'. ఆ విసురుకు రామం హృదయం గులాబిముళ్ళు గ్రుచ్చుకున్నట్లు చివుక్కుమంది.

"శశీ!... .. శశీ!" అని మళ్ళీ పిలిచాడు. ఆమె పాదాలు ఆగలేదు సరికదా మరింత వేగాన్ని పుంజుకున్నాయి హై హీల్సుషూస్ బాధ తప్పించదని తెల్సుండీ.

ఒక్క నిమిషం ఆమె వెళ్ళినవైపే చూస్తూ నిలబడిపోయాడు రామం—నిర్వీర్యుడై. ఎవరిదో చెయ్యి భుజంమీదపడేసరికి ఉలిక్కిపడి ప్రక్కకు చూసాడు.

మసకవెలుతురయినా అతన్ని చురుగ్గా గుర్తించాయి రామం కళ్ళు. "ఏరా భాస్కర్!" అన్నాడు నిట్టూరుస్తూ.

"ఏం? మీ 'బాపూ బొమ్మ'—పలుకే బంగారమాయెనే అన్నట్లు వెళ్ళిపోయింది. మీ యిద్దరి మధ్య వ్యవహారమేమైనా బెడిసిందేమిట్రా?" అని అడిగాడు భాస్కర్.

ఇద్దరూ శానిటోరియమ్ ప్రక్కనుంచి నడుస్తున్నారు అప్పుడే చంద్రోదయమైంది ప్రియ శశి వియోగంలో రాకాశశి ఆగమనం విరహాగ్నికి వాయువులా తోడైంది—రామం హృదయంలో.

"నాకేమీ అర్థం కావటంలేదు పిల్చినా పలుకలేదామె.. " అన్నాడు రామం నిరుత్సాహంగా.

"పిలిచిన బిగువటనే అని పాడుతూ వెనక పడకపోయావ్? ఒకవేళ చీకటిగావుందని వెనకటిలా మన కాలేజీలోని ఏ పోకిరీ రాక్షసుడైనా పలకరించాడనుకుందేమో?" అని తన సందేహం రాగయుక్తంగా విన్నవించాడు భాస్కర్

"నేను కనపడకపోతే నాగొంతేమైంది?"

"పొరపాటున .. కలహాంతరిత కాలేదుకదా!"

"అంటే! భయంగా చూసాడు రామం.

"ఎట్లాగైనా నీ బాపూబొమ్మ ప్రబంధ నాయిక ఆమె ధర్మమా అని నువ్వు కూడా నాయకుడవైపోయావు ఆ లక్షణా లెక్కడికిపోతాయి అసలు నిప్పులేనిదే పొగ పుట్టదుకదా! ఈ మధ్య అంత అగ్గిపుల్ల గీయవల్సిన అవసరమేమైనా వచ్చిందేమో!— కొంచెం ఆలోచించి చెప్పు. నీ సమస్యా పరిష్కారం నేను కావించెదగాక! ..."

రామం రెండు నిమిషా లాలోచించాడు. "అబ్బే! అటువంటిదేమీలేదురా! అసలగ్గిపెట్టే లేనిదే పుల్ల గీసే ఛాన్సేలేదుగా! రేపటినుండి మన కాలేజీ సెంటెనరీ సెలబ్రేషన్స్ జరుపుతున్నారుకదా! మా మేథమేటిక్స్ ఎగ్జిబిషన్‌కి కావల్సిన సరంజామా తయారు చేసుకోవటంలో, రెండు రోజులనుంచి తీరిక లేకుండా ఉన్నాను. అప్పుడప్పుడు ప్రత్యేకంగా కల్సుకొని మాట్లాడినా శశిముఖంలోని చిరునవ్వు చూడనిదే ఒక్క పూట కూడ ఉండలేనని నీకు తెల్సుగా! ఎటొచ్చీ నిన్న, మొన్న ఆమెకు కనిపించలేదు. ఇంత దానికీ కోపగించుకుంటుందనుకోలేదు "

"మీ యిద్దరికీ, పరిచయమైన నాటినుండి యీ ఆరు నెలల లోపల మీ హృదయాల్లో ప్రేమ తరువులు కల్పతరువుల్లా వృద్ధి అవుతున్నాయేకాని ఎక్కడా శిశిరం తొంగిచూసే అవకాశంమేలేదు నాకామెంట్ నంగీకరిస్తావా?" అన్నాడు భాస్కర్ ప్రఖ్యాత డిటెక్టివ్ పోజులో నిలబడి సిగరెట్టు దమ్ము పీలుస్తూ. రామం అమాయకంగా ముఖం పెట్టి అవునన్నాడు.

"ఆయన కిప్పుడు మనం కన్పిస్తామా," అందిట బామ్మ. కలహాంతరిత అపోహపడ్డదా, లేక—

"శశి మీ బంధువుల అమ్మాయే కనుక తల్లి తండ్రులకు భయపడి నిన్ను విడనాడటానికి ప్రయత్నిస్తుందేమోనన్న సందేహానికిక్కడ తావులేదు. ఎందుకంటే ఆమె తల్లిదండ్రులు, మీ మామయ్య సూర్యనారాయణగారు వగైరా వగైరాలంతా మీ స్నేహం తప్పుపట్టడంలేదు. ఆమె నివాసం వీరభద్రపురం, నీ నివాసం ఇన్నీసుపేటల మధ్య రాకపోకలు మహరంజుగానే సాగుతున్నాయి. కనుక దీనినిబట్టీ......" అని భాస్కర్ ఒక్కక్షణం ఆగాడు షేక్స్పియర్ ముఖంపెట్టి.

" ....ఏం నిర్ణయించవచ్చని నీ భావం?" అని అడిగాడురామం ఆత్రుతగా.

"ఆమాత్రం తెల్సుకోలేవురా! పెద్ద కథకుడివి, ప్రకృతి పరిశీలకుడివి, సంఘ విమర్శకుడివి, జీవిత పరిశోధకుడివి.....డివి......డివి.. అంటావ్?"

"అయితే నీలాంటి స్నేహితులంతా పన్నాను అనిపించుకోటానికా నా ప్రక్కన. బంగారపు వస్తువు కయినా గోడచేరువు కావాలి. ఒక్కొక్కప్పుడు సమస్యలే మన బుద్ధిని మందగింపజేస్తాయి....."

"........అప్పుడే ప్రబంధ నాయకుడికి సలహాలిచ్చే నావంటి చెలికాడొకడుండుట అవశ్యకమంటావ్ . . . అంతేనా? అట్లే చేసెద.......ఆ! నువ్వు బంగారపు వస్తువివి నీకు నేను ఆధారభూతమైన (ఇప్పుడు మాత్రం) గోడని నీ సమస్య ఏమిటి? నీ బా....మ్మ నీ పిలుపు వినకుండా ఎందుకు వెళ్ళిపోయింది?—అంతేకదూ! పైన చెప్పిన కారణాలను బట్టి బంగారపు వస్తువైన నీమీద చింతపండు వంటి పదార్థమేదో ప్రకాశప్రథీకరణమును క్షీణింపచేసి అపోహ యనెడి మలిన పదార్థమును గుర్తించి విరక్తి భావమును పెట్టుకునిన కలహాంతరితయై నీశశి వెడలియుండవచ్చునని నిశ్చయించవచ్చును........"

"అబ్బ! నీ కవిత్వం కట్టిబెట్టరా బాబు! భాషను ఖూనీ చేస్తున్నావ్....."

"నీలాంటి కవులంతా అవని మానుకున్నారు కనుకనే నాలాంటివాళ్ళాపని చేయటం. మనుష్యుల్ని ఖూనీ చేస్తే ప్రభుత్వం వూరుకోదు. కాని భాషను ఖూనీచేస్తే అడిగే నాథుడేలేడు.... ఎవడో నీలాంటి రచయితల చివాట్లు తప్ప. "

"అయితే శశి నామీద అపోహపడిందంటావా? ఏ విషయంలో? ఆమె దూరమైతే నేను జీవించలేనురా! పరీక్షలింక సరిగ్గా నెల్లాళ్ళులేవు. ఈ బి ఎస్ సి గట్టెక్కితేకాని నేను చిల్లిగవ్వకి కూడా పనికిరాను శశికళా హృదయంలో నేను చోటు సంపాదించుకున్నానుకదా అని ఉప్పొంగిపోయాను. ఆ మానసికబలంతో కష్టపడి చదువుతున్నాను. ఇప్పుడీ మనోవైకల్యం నన్ను క్రుంగదీస్తోంది. ఒకవేళ శశి నన్ను నిర్లక్ష్యం చేయటంలేదుకదా! ..."

"ప్రియురాలి వియోగంతో నాయకుడు యిట్లాగే వరివరివిధాల ఆలోచిస్తాడు. ఆమె రోషకషాయితమై తనను తృణీకరించినట్లు బాధ పడతాడు. అందుకనే నన్ను ప్రబంధ నాయకునిగా చేసింది మీ బా(పూ బో)మ్మ అన్నాను ....." అని నవ్వాడు భాస్కర్.

"నేను మనసులో బాధ పడుతుంటే నువ్విట్లా వేళాకోళం చేస్తావేమిట్రా?....." అని ముఖం చిన్న పుచ్చుకున్నాడు రామం.

రామం భుజం తట్టి "భయపడకురా బ్రదర్! ఇంత చిన్న విషయాన్ని అంత పెద్దదిగాచేసి బాధ పడతావేమిటి? అందుకనే నీ హృదయం కుసుమ కోమలమైనదని నేనంటూవుంటాను. శశి నన్ను ప్రేమించటంలేదని నీ వనుకోవటం పొరపాటు. ఆమె నిన్ను తృణీకరించే మాటయితే మాటి మాటికీ నిన్ను కల్సుకోవాలని తాపత్రయపడుతుందా? అసలు ప్రేమికుల అనురాగం సార్థకత చెందాలంటే మధ్య మధ్య అపోహాలనే అవాంతరాలు వస్తేకాని ఆ ప్రేమ కృపాణానికి పదునురాదు. ఇప్పుడటువంటిదే వచ్చి వుంటుందని నా వూహ. ఆలోచించి ప్రవర్తించు. ఎప్పటిలాగునే ఉండు. ఆమెకు నీపైగల అపోహలు యిట్టే నమసిపోతాయి. అనవసరమైన ఆలోచనలతో మనస్సు పాడుచేసుకోకు. దొరికిన అవకాశాలు జారవిడుచుకోకు......." అన్నాడు భాస్కర్.

అప్పటికి వాళ్ళు పోర్టుగేట్ దగ్గరకి చేరుకున్నారు అక్కడినుంచి మిత్రులిద్దరూ విడిపోయారు.

ఆ రాత్రంతా శశికళమీదనే రామం ఆలోచనలు తిష్ఠవేసాయి—శశి తనతో యింతవరకు హృదయం విప్పి తన ప్రేమను వ్యక్తం చేయకపోయినా బాహ్యంగాను, హృదయాంతర్గతంగాను సన్నిహితురాలైపోయింది. తనంతట తానే తనకా అవకాశాలు యిచ్చింది. ఇప్పుడామె తనను నిరసనగా చూడటంలోగల కారణమేమో అంతుపట్టడంలేదు రామానికి—అట్లా వివిధ రకాల ఆలోచనలతో పడుకున్నాడు రామం.

ఇంతలో సినిమాకి వెళ్ళిన అత్తయ్య, మామయ్య సుశీల యింటికి వచ్చారు. సుశీల రామం పెద తల్లి కూతురు. మెట్రిక్ పరీక్షలు వ్రాయడానికి వచ్చింది. పరీక్షలలో తెలియనివిరామం చెపుతాడని సుశీలను పెదతల్లి యిక్కడికే పంపింది. మూడు రోజులైంది సుశీలవచ్చి. అదే మొదలు ఆమె రాజమండ్రి రావటం. మొదటి రెండు రోజులూ రిక్షాలో వూరంతా త్రిప్పి అన్ని చోట్లు చూపించాడు రామం....సుశీల ఎర్రగా పొడుగ్గా చలాకీగా ఉంటుంది పదహారేళ్ళుంటాయి. రామం దగ్గర చాల చనువు ఉంది కూడా. రామం తండ్రిలేని కారణంచేత మేనమామ సూర్యనారాయణ గారింట్లోఉండి చదువుకుంటున్నాడని ఆమెకు సానుభూతి ఉంది

"ఏమిట్రా అన్నయ్యా ఆలోచనలు!" అని సుశీల పలకరించేవరకు రామం వాస్తవిక జగత్తులోకి రాలేదు. అప్పుడు రామం అందరితోపాటు భోజనానికి లేచాడు.

—మరునాడుదయమే ఎనిమిది గంటలకల్లా కాలేజీ చేరుకున్నాడు. తాను సెంటనరీ ఎగ్జిబిషన్ వాలంటీర్‌నని ఉదయమంతా కాలేజీలోనే ఉండవల్సివస్తుందని మధ్యాహ్నం తాను వచ్చి అత్తయ్యను, సుశీలను ఎగ్జిబిషన్ చూపించడానికి తీసుకువెడతానని చెప్పి వెళ్ళిపోయాడు రామం.

సెంటనరీ ఎగ్జిబిషన్‌కు ప్రారంభోత్సవం చేశారు. పది గంటలనుంచి ఎగ్జిబిషన్‌లో ప్రేక్షకుల ప్రవేశం కొనసాగింది... ..బోటనీ ఎగ్జిబిషన్‌లో శశికళ వాలంటీర్‌గా ఉందని తెల్సింది రామానికి. ఆ విషయం భాస్కర్ చెప్పాడు. బోటనీ విద్యార్థులు కూడా చాలమంది ఎగ్జిబిషన్‌లోని అన్ని సెక్షనులు సందర్శించడం గుర్తించాడు రామం. నగరంలోని స్త్రీ పురుషులు అనేకమంది వస్తున్నారు, పోతున్నారు. వాళ్ళల్లో యితర సెక్షనుల వాలంటీర్లు కూడా ఉన్నారు.

మేథమేటిక్స్ సెక్షన్‌లో ఉన్న రామం కళ్ళు ఎక్కడైనా శశి రూప సందర్శనం కలుగుతుందేమోనని వెదుక సాగాడు కాని అతని ఆశ నిరాశయ్యింది. పన్నెండున్నరకి తన డ్యూటీ యింకొకని కప్పగించి బయటకు వచ్చాడు లలిత కళల సెక్షనునుంచి బయటపడిన భాస్కర్ అతన్ని కలుసుకున్నాడు

రామం ముఖకవళికలు చూసి "ఆమె చాలా డల్‌గా కనపడిందిరా! నేను కనిపెడుతూనే ఉన్నాను. ఆమె క్లాస్‌మేటు రమణికి మీ యిద్దరి వ్యవహారం తెల్సుగా! ఆమె నీ విషయం అడుగుతుంటే నేను లంకదొసకాయలు పరికిస్తూ క్రీగంట చూసాను. "మీ తాతగారు రాలేదేమిటే!.... అని అంటోంది రమణి నవ్వుతూ. 'తాత' అని నీకు నిక్‌నేమ్ ఆమె పెట్టిందిగా నువ్వు బా(పూ బో(మ్మ అన్నందుకు. అది నీ విషయమే అని గ్రహించాను. "ఆయన కిప్పుడు మనం కన్పిస్తామా? ఎందుకులే ఆ గొడవలన్నీ!......" అంది నీ బామ్మ ఆ తర్వాత నేను వాళ్ళ మాటలు వినటం గుర్తించారో ఏమో మళ్ళీ మాట్లాడుకోలేదు. నేను తల అటు తిప్పటానికి భయపడి తుర్రున జారుకున్నాను ఆర్ట్సు సెక్షన్‌లోకి.. అక్కడ చూసాక బయటకు వచ్చాను" అన్నాడు భాస్కర్.

"ఆమెను నిర్లక్ష్యం చేసేలా నాకు కళ్ళు నెత్తిమీద కొచ్చాయనేగా ఆమె భావం? అయితే నువ్వన్నట్లు తప్పకుండా అపోహ పడుతోందన్నమాట!" అన్నాడు రామం భాస్కర్ నవ్వాడు.

"నేను యింటికి వెళ్ళాలి శశి నీపైపడే దురూహను పోగొట్టే ఉపాయం తర్వాత ఆలోచిద్దాం లేదా?" అని భాస్కర్ రామానికి ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం రెండు గంటలకి అత్తయ్య, సుశీల

( 60వ పేజీ చూడండి)

# దక్షిణాఫ్రికా

.... ఆ గుర్రపుబండి—తెల్ల అధికారికి నేను కూర్చున్నచోట కూర్చుండవలయునని బుద్ధిపుట్టెను అతడు సిగరెట్ కాల్చుకొనవలెను మరియు అతనికి మంచిగాలి కావలెను అతడు బండితోలువాని కడనుండి ఒక మైల గోనె తీసి దానిని తన పాదముల క్రింద బల్లమీద పరచి 'సామీ! నీవు దీనిమీద కూర్చుండుము. నేను బండి తోలువాని ప్రక్క కూర్చుండగోరుదును'' అనెను ఈ అవమానము భరింప నాకు సామర్థ్యము లేకపోయెను భయపడుచు భయపడుచు నేను 'లోపల గూర్చుండవలసిన నన్ను యిచ్చట గూర్చుండబెట్టితివి. నే నెట్లో సహించితిని నీ విచట గూర్చుండి సిగరెట్టు కాల్చుటకు నీ కాళ్లకడ కూర్చుండమనుచుంటివి నేను కూర్చుండను బండి లోపలికి పోయి కూర్చుండెదను

ఈ మాటలు నానోట వచ్చెనో, లేదో, అతడు నా గూబలు పగులగొట్ట మొదలిడెను. నా చేయి పట్టుకొని కిందికి ఈడ్వనెంచెను

బాటసారు లందరు మమ్ము చూచుచుండిరి అతడు బండుబూతులు తిట్టెను; క్రిందికి పడద్రోయ పాటుపడెను కొట్టెను

(మహాత్మాగాంధీ 'ఆత్మకథ')

"(పాశ్చాత్య నాగరికతలోని) విలువల కోసం మానవజాతి ఎప్పుడూ కృషిచేస్తూనే ఉంది దక్షిణాఫ్రికాలో ఉంటున్న మా నల్లవారు మాత్రం వాటికోసం తక్కువ కృషి చేయవలసిందని ఎందుకు అనుకోవాలి ?''

లూతూలి (1959 ఉపన్యాసం )

## దక్షిణాఫ్రికా: 1652–1961

దక్షిణాఫ్రికా 'చరిత్ర' 1652 సంవత్సరంలో ప్రారంభ మయినదని చెప్పవచ్చు. అంతకు ముమపటినుంచే ' కేప్ ఆవ్ గుడ్‌హోప్ ' చాలామంది నావికులకు, తెలిసినా ఏప్రిల్ 6 వ తేదీన జాన్ ఫాన్ రీబీక్ అనే ఒక నావిక వైద్యుడు డచ్ ఈస్టిండియా కంపెనీకోసం ఒక 'స్టేషన్' ఏర్పరచాడు అప్పటికి ఆ ప్రదేశాలలో ఆఫ్రికన్‌లు అధికంగా లేరు. హాటెన్‌టాట్‌లూ, బంటూలూ రెండు పెద్ద తెగలు ఉత్తరం వైపున జోసాలూ, జోలూలూ ముఖ్యమైన జాతులు డచ్‌వారికీ వీరికీ తరుచు యుద్ధాలు జరుగుతూ ఉండేవి 1779 లో మొదటి కాఫిర్ యుద్ధం' జరిగింది ఆరు యుద్ధా లయ్యేవరకూ డచ్‌వారు—వీరినే 'బూర్'లు అంటారు — విజయం సాధించలేక పోయారు. ('ట్రెక్—బూర్' అంటే స్థిర నివాస మేర్పరచుకొనని కృషికుడని అర్థం) అంటే, డచ్‌వారు ఈ ప్రదేశాలలోని ఆఫ్రికన్‌లను జయించడానికి సుమారు వందా ముప్పై సంవత్సరాలయిందన్నమాట. ('బుష్‌మెన్' అనే తెగవారు తమకు ఉపయోగకరంగా లేరని ఇంచుమించు వారందరినీ డచ్‌వారు హతమార్చారు.)

1795 లో బ్రిటిష్‌వారు 'కేప్' తమకు అవసరమని వశపరుచుకున్నారు. పారిస్ ఒప్పందం (1914) ప్రకారం చివరకు కేప్ బ్రిటిష్‌వారి స్వాధీనంలోకి వచ్చింది అప్పటినుంచీ దక్షిణాఫ్రికాలోని బ్రిటిష్‌వారికీ డచ్‌వారికీ సరిగ్గా ఎప్పుడూ పడలేదు. 1836 లో 'బూర్' లలో ఎక్కువభాగం దేశం లోపలివైపుకు తరలిపోయారు చాలా ప్రదేశాలలో స్థిరపడిపోయారు

ఇక్కడ ముఖ్యంగా గుర్తించవలసిన విషయం, బ్రిటిష్‌వారు 'బానిసవృత్తి' ని (1833 లో) రద్దు చేయుటంవల్ల డచ్‌వారికి నష్టం కలిగింది. ఆ కాలానికే వారు ఆఫ్రికన్‌లను వా రేమి చేసినా ఇతరులు జోక్యం చేసుకొనకూడదనేవారు.

1852 లో 'సౌత్ ఆఫ్రికన్ రిపబ్లిక్' ను డచ్‌వారు స్థాపించారు 1854 లో 'ఆరెంజ్ ఫ్రీ స్టేట్' ను కూడా స్థాపించారు. బంగారం, రత్నాలు విరివిగా దొరకడంవల్ల బ్రిటిష్‌వారు 'బూర్' ల స్వాతంత్ర్యానికి ఇష్టపడలేదు. బ్రిటిష్—బూర్ యుద్ధాలు మొదటినుంచీ జరుగుతూనే ఉండేవి

కాని పెద్ద పెట్టున యుద్ధం 1899 కి గాని జరుగలేదు 1902 లో 'బూర్' లు ఓడిపోయినట్టు ఒప్పుకున్నారు. ఏమైతేనేం 1910 లో దక్షిణాఫ్రికాలోని నాలుగు ప్రదేశాలు నేటి యూనియన్' లోని రాష్ట్రా లయినాయి. ఇవే కేప్, నాటాల్, ట్రాన్స్‌వాల్, ఆరెంజ్ ఫ్రీ స్టేట్ రాష్ట్రాలు 1931 లో అమలులోకి వచ్చిన వెస్ట్ మినిస్టర్ స్టాట్యుయేట్ ప్రకారం దక్షిణాఫ్రికా

## దక్షిణాఫ్రికా: కొన్ని వివరాలు

దక్షిణాఫ్రికా వైశాల్యం 472359 చదరపు మైళ్ళు అంటే భారత దేశపు వైశాల్యంలో (11,43,267 చ మై) సగం కన్నా కొంచెం తక్కువ

దక్షిణాఫ్రికా మొత్తం జనాభా (1957 లో) 14,167,000 ఇందులో 94,69,000 మంది నల్లజాతివారు, 29,57,000 మంది శ్వేతజాతివారు, 13,19,000 మంది మిశ్రమ జాతివారు, 43,1000 మంది ఆసియానుంచి వచ్చి స్థిరపడిపోయిన సంతతివారు

"దక్షిణాఫ్రికాలో 15% భూమికన్నా సాగుబడికి పనికిరాదు

ఆఫ్రికా ఖండ మొత్తంమీద నున్న రైల్వే లైన్లలో సుమారు 66 5% దక్షిణాఫ్రికాలోనే ఉన్నాయి

ఈ క్వేటర్ క్రిందగా ఉండటంచేత అక్కడ చలికాలం జూన్‌నుంచీ, ఎండకాలం డిసెంబర్‌నుంచీ మొదలవుతాయి

దక్షిణాఫ్రికాలో కొరడాతో దెబ్బలు ఒక శిక్ష క్రిందే పరిగణింపబడుతాయి. 1952 లో శ్వేత జాతి నేరస్థులు మొత్తం 760 దెబ్బలు తిన్నారు. ఇండియన్లు 206, ఆఫ్రికన్లు మిశ్ర జాతివారూ కలిపి 49,111 తిన్నారు

ఆఫ్రికన్లకు (నల్లజాతి వారికి) ఇచ్చిన ఒక ప్రదేశంలో నూటికి 65 శిశువులు రెండు సంవత్సరాలు నిండకముందే చనిపోతారు

ప్రపంచము మొత్తంమీద ఉత్పత్తి అయ్యే బంగారంలో దక్షిణాఫ్రికా మాత్రం 41 3% తయారు చేస్తుంది




దక్షిణాఫ్రికా

# దక్షిణాఫ్రికా

సార్వభౌమాధికారకల దేశమయింది. 90 సభ్యులున్న ఒక 'సెనెట్', 163 మందిసభ్యులున్న ఒక శాసనసభ ఏర్పరచారు. శ్వేతజాతి వారికీ, నల్లజాతివారికీ వేరే వేరే 'ఎన్నికల జాబితాలు' తయారు చేశారు. వీరుకాక 'కలకడ్' ప్రజల (మిశ్రమ జాతివారు) జాబితాలు కూడా తయారయినాయి.

దక్షిణాఫ్రికాలో రెండు ముఖ్యమైన పార్టీ లున్నాయి. ఒకటి 'నేషనల్ పార్టీ', రెండవది 'యునైటెడ్ పార్టీ', మొదటి పార్టీకి ఇటీవల జరిగిన ఎన్నికలలో (1958) 103 సీట్లు వచ్చాయి. యునైటెడ్ పార్టీకి 53 లభించాయి. ఇవికాక ప్రక్కనే ఉన్న 'సౌత్ వెస్ట్ ఆఫ్రికా'—ద్వారా మరొక ఆరుసీట్లు తమకు అనుకూలంగా వచ్చేట్లు నేషనల్ పార్టీవారు ఏర్పాటు చేసుకున్నారు.

దక్షిణాఫ్రికా (1910 లో) ఏర్పడిన తర్వాత ఆరుగురు ప్రధాన మంత్రులు మాత్రం ఎన్నికయ్యారు. వీరు, బోటహా, స్మట్స్, హెర్ట్ జోగ్, మలాన్, స్ట్రిడోమ్, ఫెర్వోర్డ్. మలాన్ తర్వాత వచ్చిన స్ట్రిడోమ్‌తోనే దక్షిణాఫ్రికా జాతి విచక్షణ విధానాలు అతి తీవ్రమైనాయి. స్ట్రిడామ్ తరువాత ఫెర్వోర్డ్ ప్రధాని అయ్యాడు ఈయన మొదటినుంచీ అపార్టైట' నూబాగా ప్రచారం చేసినవారిలో ఒకరు.

రెండవ ప్రపంచయుద్ధంలో దక్షిణాఫ్రికా నేషనలిస్టు నాయకులు జర్మనీ పట్ల తమ పక్షపాతాన్ని బాహాటంగా ప్రకటించేవారు. హిట్లర్ విధానాలు వారికి పూర్తిగా నచ్చేవి. యూదులను హింసించకపోయినా వారిని తక్కువగా చూసేవారు. నేడుకూడా దక్షిణాఫ్రికాలో యూదులపైన విరోధభావం ప్రబలంగా ఉన్నట్లు తోస్తుంది

1948 ఎన్నికలలో విజయం పొందిన నేషనలిస్టు పార్టీ ప్రభుత్వం ఏర్పరచేవరకూ దక్షిణాఫ్రికాలో పార్టీలు అంత విభిన్నంగా ఉండేవి కావు. శ్వేతజాతినాయకులు ఒక పార్టీ నుంచి మరొక పార్టీకి మారుతూ ఉండేవారు. 1948 తర్వాతనే పార్టీలు కూడా స్పష్టంగా విడిపోయాయి. యునైటెడ్‌పార్టీ నాయకుడి పేరు సర్ విలియం డిగ్రాఫ్.

ఈ సంవత్సరం మార్చి నెలలో దక్షిణాఫ్రికా కామన్వెల్తును వదిలిన విషయం అందరికీ తెలుసు. దానివల్ల దక్షిణాఫ్రికాకు వచ్చిన పెద్ద నష్టమేమీ లేకపోయినా ఇది ఆ దేశచరిత్రలో ఒక ముఖ్యమైన ఘట్టమని గుర్తించాలి.

## అపార్టైటు

'ఎపార్తైయిడ్' అనే మాట అసలీవిధంగా ఉచ్చరించాలి నల్లజాతివారు తెల్లజాతివారికన్నా తక్కువ గనుక వాళ్ళిద్దరూ ఏవిధంగానూ ఏకమవకూడదనే సిద్ధాంతాన్నే 'ఎపార్తైయిడ్' అంటారు (ఇది అమానుషమైనదనటంలో సందేహం లేదు కాని హిందూ మతంలోని వర్ణాశ్రమ 'ధర్మాలు' కొన్ని దానికి ఏమాత్రం తీసిపోవని గ్రహించాలి) 'ఎపార్తైయిడ్' అనే పేరు ఇటీవలే వాడుకలోకి వచ్చినా మొదటి నుంచీ నల్లవారిని తెల్లవారు హీనంగా చూస్తూ వచ్చారు

డచ్‌బూర్‌లు దక్షిణాఫ్రికాలో స్థిరపడుతున్న కాలంలో అక్కడ హాట్టెన్‌టాట్‌లూ 'బుష్‌మెన్' తప్ప తక్కిన నల్లవారు ఎక్కువగా లేరు వారు కేప్ ప్రాంతంనుంచీ, తీరప్రదేశాలనుంచి లోపలికి చొచ్చుకుని వెళ్ళినప్పుడు జూలూ, బోసూ మొదలైన తెగల వారితో ఘర్షణ పడవలసి వచ్చింది. డచ్‌వారు వ్యవసాయంకోసం పాడి పెంచినప్పుడు వారి పశువులను జూలూ మొదలైన బంటూలు ఎత్తుకుపోతూఉండేవారు. ఇదేకాక డచ్‌వారికి కూలి వారు కావలసివచ్చి బంటూలనేకాక మలయన్లనూ, భారతీయులనూ బ్రిటిష్ వారి ద్వారా దిగుమతి చేసుకున్నారు డచ్ బూర్‌ల తాలూకు వారందరినీ 'ఆఫ్రికానర్లం'టారు. మిగిలిన తెల్లవారిలో ఎక్కువగా బ్రిటిష్, కొంతమటకు ఫ్రెంచి సంబంధ ఎక్కువ. తాము ముందువచ్చి దక్షిణ ఆఫ్రికా దక్షిణ ప్రాంతాలలో స్థిరపడటంవల్లనే బంటూలు తర్వాత వచ్చారు గనుక న్యాయంగా దక్షిణాఫ్రికా దక్షిణ భాగాలన్నీ తమవనీ, నల్లవారైన బంటూలతో కలవటానికి వీలుపడదు గనుక వారికి ఉత్తరం వైపున 'బంటూస్తాన్' ఏర్పరచటానికి 'ఎపార్తైయిడ్' మొదటి 'మెట్టు' అని ఆఫ్రికానర్లు చెప్తారు

దక్షిణాఫ్రికాలో ఆఫ్రికానర్లందరూ 'డచ్ రిఫార్మ్‌డ్ చర్చ్'కి చెందినవారు. ఈ చర్చి ఎపార్తైయిడ్ సిద్ధాంతాన్ని ఆమోదిస్తుంది నీగ్రోలందరూ హీనజాతివారనీ, శ్వేతజాతివారి సౌకర్యంకోసం 'భగవంతుడు' సృష్టించాడని చెప్తుంది (వాటి మొదటి రోజుల్లో బానిసవృత్తిని క్రైస్తవ మత సంస్థలు ఖండించలేదు. క్రైస్తవ మత నాయకులెందరో బానిసలు ఉండటమే మంచిదన్నారు ప్రజాస్వామ్య పద్ధతులను మొదట ప్రతిపాదించిన వారని చెప్పబడే గ్రీకులు కూడా బానిసలను ఉంచుకునేవారు )

మొట్టమొదటి నుంచీ బ్రిటిష్‌వారికీ బూర్‌లకూ పడేదికాదు. 1833 లో బానిసవృత్తిని బ్రిటన్ బహిష్కరించినప్పటినుంచీ బ్రిటిష్ — డచ్‌బూర్‌ల మధ్య ఒక క్రొత్త విభేదం ఏర్పడింది. బూర్‌లు ఎప్పుడూ స్వతంత్ర దేశం కావాలనేవారు. బ్రిటిష్‌వారు, సహజంగా, బ్రిటన్ వలసదేశంగా ఉన్నా ఫరవాలేదనుకునేవారు. ఎపార్తైయిడ్ సిద్ధాంతం ఈ విభేదాలను కొంచెం తీవ్రం చేసిన మాట నిజమే కాని బ్రిటిష్‌వారు కూడా మొత్తానికి నల్లవారిని దూరంగా ఉంచాలని కోరేవారే. స్థూలంగా చెప్పాలంటే బూర్‌లపార్టీ నేషనలిస్ట్‌పార్టీ, తక్కిన శ్వేతజాతి వారిది యునైటెడ్ పార్టీ. 1948 ఎన్నికల ముందు మలాన్ నేషనలిస్ట్‌పార్టీ 'పథకాన్ని' స్పష్టంగా చెప్పాడు ఆఫ్రికన్లు (అంటే నల్లజాతివారు) తెల్లవారు నివసించే ప్రదేశాలలో తాత్కాలికంగా పనులు చేసేందుకు మాత్రం ఉన్నారుకాని క్రమేణా వారిని తమ 'స్వంత' ప్రదేశాలకు పంపించివేయాలి అందుచేత ఈ మధ్యకాలంలో వారికి ఏవిధమైన హక్కులూ ఉండవు 'ఇండియన్లు' మొదలైన ఆసియా ఖండం



షార్ప్‌విల్ కాల్పుల దృశ్యం

వారు క్రమంగా అసలు దేశంవదిలి వెళ్ళిపోవాలి వాటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని 1950 లో 'గ్రూప్ ఏరియాస్ యాక్ట్' అమలులోకి తెచ్చారు ఒక ప్రదేశానికి చెందినవ్యక్తి ఆ ప్రదేశంలో వ్యాపారంచెయ్యాలన్నా, వృత్తి చేసుకోవాలన్నా ప్రభుత్వం అనుమతి పొందాలి 'పాపులేషన్ రిజిస్ట్రేషన్' చట్టం ప్రకారం ప్రతి వ్యక్తి కొన్ని 'పాస్'లను ఎప్పుడూ దగ్గర ఉంచుకుని తీరాలి మరొక చట్టం 'ఇమోరాలిటీ ఎమెండ్‌మెంట్ ఏక్ట్' వివిధ జాతుల మధ్య వివాహాలేకాక, తదితర సంబంధాలను బహిష్కరించింది 'సప్రెషన్ ఆఫ్ కమ్యూనిజమ్ ఏక్ట్' అనే చట్టంలో ప్రతివారినీ కమ్యూనిస్టనే నేరంపైన నిర్బంధించే వీలు కలుగజేసుకున్నారు ఈవిధంగా [illegible] ప్రభుత్వం ప్రజల స్వాతంత్ర్యాన్ని



ఫెర్‌వోర్డ్

జాగ్రత్తగా అణచివేస్తోంది ఆ పైసంవత్సరం అంటే 1951 లో 'ఓటర్ల బిల్లు' ఒకటి అమలులోకి వచ్చింది దాని ద్వారా మిశ్రమ జాతుల వారిని ప్రత్యేకమయిన జాబితాలోకి మారుద్దామని ప్రయత్నించారు కాని కొందరు హైకోర్టులో దావా వేసి ఈ బిల్లును రద్దు చేయించారు ప్రభుత్వం దాని ఎదురు ఎత్తుగా మరొక బిల్లు ఆమోదించినా సుప్రీం కోర్టులో ఇది కూడా ఓడిపోయింది 1953 ఎన్నికలలో నేషనలిస్టుపార్టీ పెద్ద మెజారిటీతో గెలిచింది ఈ సందర్భంలో యునైటెడ్ పార్టీలో కొందరు 'లిబరల్' పార్టీని ఏర్పరచారు రకరకాల చట్టాల ద్వారా 'ఎపార్తెయిడ్'ను తీవ్రపరచాలని ప్రభుత్వంవారు ప్రయత్నించారు పోను పోను వారి సిద్ధాంతాల నిజ స్వరూపం బయటపడిపోయింది బంటూల (నల్లజాతి వాళ్ళ)కోసం అభివృద్ధి చేస్తామన్న ప్రదేశాలు ఏమాత్రం అభివృద్ధి కాకపోగా శ్వేతజాతివారికోసం అన్న పాత చోట్లలోవారి కష్టాలు మరింత అధికమయ్యాయి 1970కిగాని (సుమారు) 70% ఆఫ్రికన్లు 'బంటుస్తాన్' రిజర్వులలో స్థిరపడరని ఒక కమిషన్ (టామ్లిన్‌సన్ కమిషన్) తేల్చింది! ఈ రిపోర్టుపట్ల ప్రభుత్వ పక్షాల వైఖరి వారి నిజ స్వరూపాలను బయట పెట్టింది కేవలం నల్లవారిని అణచివేసేందుకే ఈ చట్టాలన్నిటినీ అమలులోకి తీసుకువస్తున్నారని అందరికీ తెలిసిపోయింది 1956 డిసెంబర్‌లో చాలామంది దేశద్రోహానికీ, చట్ట విరుద్ధాలయిన చర్యలకూ నిర్బంధించారు నల్లవారిపట్ల సానుభూతి చూపిన తెల్లవారిని కూడా 'అరెస్టు' చేశారు

(దక్షిణాఫ్రికాలో ఆఫ్రికన్లకు సరియైన పార్టీలు లేవు ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్, ఆల్ ఆఫ్రికన్ కన్వెన్షన్ అనే రెండు ఉద్యమా లున్నప్పటికీ వీటిని ప్రభుత్వం గుర్తించలేదు 1912 లో పి ఐ సెమె మొదటి పార్టీని సృష్టించారు రెండవ ఉద్యమంలో ఇండియన్లనూ మిశ్రజాతివారినీ కూడా చేర్చుకుంటారు

కాని ఎప్పటిలాగే, మహాత్మా గాంధీని మినహాయిస్తే, అసలు ఆఫ్రికన్లకు మొదట సేవ చేసిన వారు తెల్లవారు మైకేల్ స్కాట్, ఫాదర్ హడుల్‌స్టన్ వంటివారే వీరి తరఫున ప్రచారం చేశారు పాట్రిక్ డంకన్ అనే బ్రిటిష్ నాయకుడు మణిలాల్ గాంధితో కలిసి జైలుకు వెళ్ళారు (

## కొందరు నాయకులు ఆఫ్రికన్‌లు

ఆఫ్రికన్లలో ప్రముఖులు ఆల్బర్ట్ లుతూలీ, డాక్టర్ జామా, డాక్టర్ మొరోకా లుతూలీ జాబూ

(62 పేజీ చూడండి)



స్ట్రిడామ్

# హరివంశము

## సాందీపనిపర్వం - 12

వసుదేవుడు బలరామకృష్ణులకు తిరిగి యిట్లు చెప్పినాడు. "తండ్రీ! రామ! నాయనా శ్రీకృష్ణ! అప్పుడు రుద్రుడు, విష్ణువునకు, బ్రహ్మకు వారు వారు చేయవలసిన పనులను గూర్చి నియోగించినాడు, ఓయి! బ్రహ్మ! మనము ముగ్గురము ఉన్నాముగదా! మనలో మనకు ఎక్కువ తక్కువలు లేవు. ముగ్గురమును బ్రహ్మపదార్థము నుండియే పుట్టినాము. మన ముగ్గురికార్యములు గూడ మనతోడనే పుట్టినవి. ఓయి బ్రహ్మ! నీవు సృష్టికర్తవు విష్ణువు స్థితికరుడు. నేను లయకారకుడను మీరు మీమీ కార్యములయందు నిమగ్నులు కావలయును సుమా!" అనినాడు. బ్రహ్మయు, విష్ణువును అప్పుడు రుద్రుని స్తుతించినారు. వేదములచేత నాయనను స్తోత్రము చేసినారు. వారి స్తోత్రములను వినుచు రుద్రుడు తిరిగి తన తొంటి లింగరూపమును అవధరించినాడు. ఇప్పటికిని కాశిలో స్వయంభువమైన ఆ లింగము జ్యోతిర్లింగమై వెల్గుచున్నది తండ్రి! శ్రీకృష్ణ! నాయనా! బలరామ! పరమేశ్వరీ పరమేశ్వరులకు అది అనిశము అవిముక్తమైన ఉనికి స్థానమైనది. అందుచేతనే దానికి అవిముక్తమని పేరు వచ్చినది. అనర్క గ్రహ తారకానక్షత్రము, అనహోరాత్రము, అనగ్ని భూసలిలమారుతము, అప్రధానము, అశబ్ద స్పర్శము, అగంధము, అరూపము, అదిఙ్ముఖము అయి, భువన ప్రపంచం అంధకారావశేషమై ఉన్నప్పుడు బ్రహ్మాండం నిష్ప్రపంచకమై కేవలత్వాన్ని భజించి ఉన్నప్పుడు, అనామరూప వర్ణము, అస్థూలము, అకృశము, అహ్రస్వము, అదీర్ఘము, అలఘువు, అగురువు, అనపచయము, అనుపచయము, అవాఙ్మనసగోచరము, సత్యజ్ఞానానంద స్వరూపము, అప్రమేయము, అనాధారము, నిరామయము నిరుపద్రవము అయి పరబ్రహ్మము నిరుద్యోగియై, తూష్ణీంభావం కైకొని, నిష్కలంకమై విహరిస్తూ లీలాకైవల్యంచేత లోకమర్యాదను ఆచరించి ఒక్క శక్తిని నిజశరీరంనుండి కల్పించుకొన్నవాడు, ఉండేందుకు చోటు ఎక్కడా లేక, ఈ అవిముక్త మండలాన్ని చేరుకొని, జ్యోతిర్లింగము రూపం ధరించి అక్కడ కాపురం అవధరించినాడయ్యా! శ్రీకృష్ణ! ప్రళయకాలంలో గూడా క్షయం ఎరుగనిది ఈ అవిముక్త క్షేత్రం. నక్షత్రములు, గ్రహములు, తారకములు, అరణ్యములు, నదులు, పర్వతాలు, విశ్వక్షోణీధ్రములు, దిశలు, వసుమతీ చక్రము— ఈ అన్నీ కాలంచేత ప్రక్షీణత్వం పొందినప్పుడు కూడా ఈ క్షేత్రం ఆ ఆది దంపతులకు సుఖం ఉండడానికి సిద్ధి వహించింది కావడంవల్ల గూడా, తండ్రీ! అది అవిముక్తక్షేత్రం అయింది. పరమేశ్వరీ పరమేశ్వరులకు నిత్యము ఆనందవిహారస్థానం అవడంచేత అది ఆనందకాననం అయింది. రుద్రుడైన పరమేశ్వరుడు అక్కడ నివాసం అవధరించినందువల్ల అది రుద్రగేహం అయింది. పరమేశ్వరుడు పరమేశ్వరితో సహా అక్కడ కాపురం పెట్టినాడు పంచక్రోశ విస్తారమైన ఆ భూమి వారికి రాజ్యం అయింది. ఆ అంత ఇంటికి భారకుడు ఒక్కడు కావలయునని పరమేశ్వరుడు చింత చేసినాడు. పరమేశ్వరితో ఆలోచించినాడు. అరకంటితో పరమేశ్వరి ముఖ్యం అవలోకించినాడు. ఆ చూపునబడి పుండరీకేక్షణుడు, పురుషోత్తమాహ్వయుడు, శిఖిపింఛసంఛన్నచికురభారుడు, ఆజానుదీర్ఘ బాహార్గళద్వయుయుగ్ముడు, హరినీల సింహ సంహననకాంతి, గంభీర నతనాభికాసారభవపద్మ్యుడు, శ్యామపిశంగ వాసః కిరీటుడు, శంఖ చక్రగదాసి శార్ఙ్గదివ్యాయుధుడు, కందర్పకోటి రేఖా విలాసుడు, ఒక్కబాలుడు ప్రభావం చెందినాడు. పరమేశ్వరి ఆబాలుణ్ణి దగ్గరకు తీసుకున్నది. "తండ్రీ! నీవు విష్ణుడవుకాదా!" అన్నది. "ఓయి! పుణ్యాత్మ! ఈ అవిముక్తక్షేత్రకుటుంబాన్ని నీవు తత్పరత మీరగా భారకత్వం పూని భరిస్తూవుండు" అన్నది. ఆయన 'సరియే' నన్నాడు అక్కడ ఆ మహాక్షేత్రంలో ఒక తీర్థాన్ని నిర్మించగా ఆయన తలపోసినాడు. చేతిలో చక్రం ఉన్నది కదా! దానితో ఒక పుష్కరిణి ఆయన త్రవ్వించినాడు. దానిని త్రవ్వుతున్న సమయంలో ఆయనకు కల్గిన ఆయాసంవలన పుట్టిన ఘర్మజలంతో ఆ కాసారం నిండిపోయింది. అది అందమైన సరస్సుగా రూపు దాల్చింది. భగవంతుడైన విష్ణువు ఆ తోయాధారం ఒడ్డున తపస్సుకు దిగినాడు. ఆ తపస్సు వేయును ఎనిమిది ఏడులు సాగింది. అప్పుడు కాశికాధిపతి తిరిగి ఆయనకు దర్శనం ఇచ్చినాడు. విష్ణునిర్మిత మహాకాసారాన్ని చూచినాడు. ఆనందాన్ని పొందినాడు. ఆమందాందోళిత మౌళియై శిరోమాల్యావళులు మ్రోయగా విష్ణువును అభినందించాడు వాపీప్రణుతి శ్లాఘాపరంపరలు ఒనరుస్తూ ఉండగా, పరమేశ్వరుని దక్షిణశ్రుతి మణికర్ణిక ఆ సరస్సులో పడింది. పరమేశ్వర శ్రవణ మణికర్ణికా పతన స్థలం అవటంచేత అది మణికర్ణిక అయింది. విష్ణువు తన చక్రంచేత దానిని త్రవ్వినందువలన అది చక్రపుష్కరం అయింది.

అప్పటికి ఇంకా ఇప్పటి కాశీనగరం నిర్మితిని చెందలేదు. తండ్రీ! ఆ వృత్తాంతం గూడా ఇప్పుడు మీకు చెబుతాను. కాశీపట్నాన్ని విశ్వకర్మ నిర్మించినాడయ్యా! అందుకు కారణం ఉంది. వైశ్రవణుడు లంకా పట్నాన్ని రావణునకు వదలిపెట్టి ఉండేందుకు చోటులేక అటమటించి, పరమేశ్వరభక్తుడవటంచేత ఆనందకాననం చేరుకుని అక్కడ ఆ పరమేశ్వరుని గురించి తపస్సు చేసినాడు పరమేశ్వరుడు అతనియందు కరుణ చూపించి ప్రత్యక్షమై 'ఓయి! వైశ్రవణ! నువ్వు యిక్కడ కాపురం ఉండు. ఇక్కడ పట్టణం నిర్మించుకో!" అన్నాడు. వైశ్రవణుడు పరమేశ్వరుని ఆజ్ఞను బడిసి విశ్వకర్మచేత ఈ కాశీ పట్టణాన్ని నిర్మింపజేసినాడయ్యా! ఇప్పుడు ఆ కథ అంతా గూడా మీకు విప్పిస్తాను.

"రామ! శ్రీకృష్ణ! కాంపిల్యం అనే నగరం ఒకటి ఉంది. ఆ నగరంలో యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు ఆయన వేదవేదాంగ విదుడు ఆయన యజ్ఞవిద్యావిశారదుడు. అట్టి ఆయనకు ఒక కుమారుడు కల్గినాడు. అతనికి గుణనిధి అని పేరు పెట్టారు. వాడు మంచి రూపసి సౌందర్యరేఖలో మన్మథునితో సాటి. వాడు ఎనిమిది ఏండ్లవాడు కాగా తల్లిదండ్రులు అతనికి ఉపనయనం చేసినారు. గురువులయొద్ద చదువబెట్టారు. వానికి చదువు అంటలేదు. జూదములు అంటినవి. వాడు ద్యూత క్రీడారతుడైనాడు. కితవులతో అసాయము, అప్రతస్సు, తిరుగగా నేర్చినాడు అపేత విజాచారుడైనాడు. బ్రాహ్మణాచారం అంటే వానికి గిట్టలేదు. ఆ ఆచారాన్ని వాడు పరిహాసం చేయడం మొదలుపెట్టినాడు అగ్నిహోత్ర విధానం అంటే వానికి నచ్చలేదు ఆ విధియందు వానికి అలుక బలిసింది సంధ్యావందనమునందు శ్రద్ధ పోయింది,

హారీత శివశర్మ

గీతవాద్య వినోదకేళియందు తగులము పెరిగింది. పాషండభండ దుర్భాషలలో వాని వేషములు మితిమీరి పోయినవి ద్యూతకారులతో సహవాసం తోరం అగ్గుంది ధాతువాదులమీద తాత్పర్యం హెచ్చింది నాస్తికులతో చెలిమి బలిసింది వాడు తోటి వటువులను మన్నించడంలేదు నటులను, విటులను మన్నిస్తున్నాడు పెద్దలకు పెద్దరికం ఇవ్వడంలేదు. పీఠమర్దులకు పెద్ద పీట వేస్తున్నాడు శిష్టకులదీక్షితుని పట్టికదా వాడు! వాడు కులబ్రాహ్మణులను గౌరవించడంలేదు కొలటేయులను పాటిస్తున్నాడు గౌరవిస్తున్నాడు సజీవనిర్జీవద్యూతములలో వోడిపోయి, తల్లి నగలను అమ్మి తగులములు తీర్చుకుంటున్నాడు తండ్రియేమో గృహకార్యవ్యగ్రుడై కొడుకు వర్తనమును పరామర్శించడు తల్లి యేమో, ఒక్కకాని ఒక్క కొడుకు గదా అని తత్పరత్వమును బోధిస్తుంది. ండ్రి! నువ్వు ధూర్త సంగతిని విడిచిపెట్టు ఘువులతో పరిచయం పెంచుకో. నేను చెప్పినట్లు కొంచెం విను'' అంటుంది వాడు వినడు తండ్రి ఎప్పుడో కొడుకు సంగతి పట్టినప్పుడు భార్యను చూచి "అమ్మి! మన తనూభవుడు ఎచటనె? ఎప్పుడును కన్పించడు!'' అని అడుగుతాడు ఆ భార్య పాపం, పిచ్చితల్లి, సమాధానం ఇస్తుంది "స్వామీ! వాడు ఇప్పటిదాకా నా దగ్గరనే ఉన్నాడు. అది ఏమి పాపమో మీరన్నచో వానికి భయమగుచున్నది. ఇప్పుడే చదువగా గురువుల ఇండ్లకు పోయినాడు'' అంటుంది. "అయితే వాడు ప్రతినిత్యము స్నానం ఆచరిస్తున్నాడా? సంధ్య వారుస్తున్నాడా? కృపీటయోనిని అర్చిస్తున్నాడా?'' అని ప్రశ్నిస్తాడు దీక్షితుడు "స్వామి! వాడు స్నానమాడెను. సంధ్య వార్చెను అగ్నిని అర్చించెను'' అంటుంది దీక్షితాయణి వాడు తనకు లేకలేక పుట్టిన బిడ్డడు గొడ్డు ...ి కన్న బిడ్డడు ఒక్కడు వాడు ధూర్తుడయినాడు ఆ తల్లి ఆ కన్నకొడుకు దుశ్చేష్టితములన్నింటిని కడుపులో దాచుకుంటున్నది. భర్తకు తెలియనీయక అడచివేస్తున్నది.

గుణనిధికి పదునారుసంవత్సరాలు నిండాయి దీక్షితుడు అతనికి పెండ్లి చేసినాడు. వాని జీవితంతో మార్పులేదు. తల్లి యేమో ప్రత్యహము వూహాపోహ సమాహితమతియై, అతి సాహసకృత్యములు మానవలసినదిగా సుతుణ్ని బోధిస్తున్నది "అన్న! మీ తండ్రికి కోపమే రాదు. వచ్చినదా ఆయన ఆగరు. నీవు ఒనరిస్తున్న దుర్వృత్తం ఎంతమాత్రం ఆయన చెవిని బడినా, నా కాపురమే నట్టేటిపాలు అవుతుంది. ఇంతకాలము కల్లతనంచేసి నీ ఎల్లిదములను ఆయన కన్నులకు రాకుండా చేస్తున్నాను. నన్ను చూచి అయినా ఈ దుర్నీతి నడతలు మానుకోరా?'' అని బతిమలాడు కుంటున్నది "నాయనా! మన కులంలో అందరు సచ్ఛ్రోత్రియులు, అనూచానులు, సోమపీథులు. వారిని తలచియైనా నీ వర్తనం సద్వర్తనంగా దిద్దుకో. మీ తండ్రిని చూస్తావా! ఆయన రాజమాన్యుడు. సత్యరతుడు. వినిర్మలాచారవంతుడు. అట్టి తండ్రిని తలచియైనా నీవు మంచి బుద్ధులు నేర్చుకోవచ్చును గదా! భాగ్యసంపదలో పుణ్యపతిదేవతలలో నేను ఎన్నతగిన దానిని నన్ను తలచియైనా, నీవు నీ గుణమును సరిదిద్దుకోవచ్చు మరి నీతోటి బ్రాహ్మణ కుర్రలను చూడు అందరు వేదశాస్త్ర విద్యా నిరూఢులై వాసికెక్కినారు నీవు మాత్రము నా కర్మము నిట్లుగా కాలుస్తున్నావు. వారిని చూచి అయినా నీవు బుద్ధితెచ్చుకోవచ్చు. నీకు ఇప్పుడు ఇరువది అయిదేళ్ళు మీదకు వచ్చాయి పదునారేండ్ల బంగారపుబొమ్మ కొమ్మ ఉంది నీవుమాత్రము నీ గోరతములు మానడంలేదు. ఓయి! కొడుకు కుర్రీ! ఈ అందరిని అవమానంపాలు చేయబోకుమురా!'' అని గోలయై గోలపెట్టింది. "నాయనా! నీవు దుష్టంగా తిరుగుతున్నావు పట్టణం వీధుల్లో వెర్రివాడవై తిరుగుతున్నావు. ధూర్తులతో సహవాసం చేస్తున్నావు ఇది రాజుకు తెలిసింది అనుకో. అప్పుడు ఏమవుతుంది! ఆయన సోమయాజిని వదిలివేస్తాడు మనకు ఇచ్చిన వృత్తులను, మడిమాన్యములను తిరుగ తీసుకుంటాడు. మనం అన్నివిధాలుగా చెడినవాళ్ళం అయిపోతాము. నీవలన కూడు, గుడ్డ లేనివాళ్లం అయిపోతాము. నీ బుద్ధులు మానరా! తండ్రీ!!'' అని బుజ్జగించింది. భయపెట్టింది "తండ్రి! నువ్వు ఇది ఆలోచించు. నీవు నామాట వినవు కొయ్యతనములు చేస్తూనే ఉంటావు. పదిమంది నిన్నుచూచి ఏమంటారు? సోమయాజి గారి అబ్బాయి లక్షణం ఎట్లా ఉన్నదో చూస్తున్నాము గదా అని నవ్వుతారు. మీ తండ్రిని అటు పోనిచ్చి, ఇటు వెనుకగా ఏమి కొడుకుని కన్నాడండి'' అని పగలబడి పోతారు "ఆయన ఏమి చేస్తాడు. ఆ తల్లి పెంపకం ఇట్లా ఉన్నది'' అని నన్ను ఆడిపోస్తారు. "నాయనా! నీ దుర్నయములు వదిలిపెట్టవుగదా!'' అని ఆ తల్లి గొల్లున గోలపెట్టింది.

తల్లి మాటలు వాని చెవికి ఎక్కలేదు. వాడు ఇట్టట్టనక అప్పటికి ఊరుకున్నాడు. మృగయామద్యపై శున్యవేశ్యాచౌర్యదుతోదరవరదారాభిలాష ములనే దోషాలు నవయౌవనారంభంలో సంభవించినట్లయితే, వానిని ఎవ్వరు పరావర్తింపలేరు పెద్దలమాట అతినిర్మలమైనదే అయినా, చెవులలో నిల్పిన నీళ్లవోలె అభవ్యునికి శూలపుట్టిస్తాయి. ఆయథార్థనామధేయుడైన గుణనిధికి ఇప్పుడు తల్లిమాటలు అట్లనే అయినాయి. వాని దుర్వర్తనంలో మార్పు రాలేదు యథాపూర్వంగా వాడు తన దుర్వర్తనాలలో తిరుగుతూనే ఉన్నాడు.

ఇట్లావుండగా ఒక్కరోజున: యజ్ఞదత్త సోమయాజి నగరంలోనికి పనిమీద వెళ్లినవాడు దారిలో, ఒక్క జూదరి వ్రేలికి ఉన్న ఒక్క ఉంగరాన్ని చూచి హఠాత్తుగా ఆగిపోయినాడు. ఆ ఉంగరం ఎవరిది? "అబ్బీ! ఇటు రమ్మురా!'' అని జూదరిని పిలిచి, ఆ ఉంగరమును దీక్షితుడు పరకాయించి చూచినాడు. జూదరి మాటాడలేదు. దీక్షితుడు ఎక్కడిదో, ఎవరిదో తెలిసింది. ఆ ఉంగరము ఆ ఉంగరమునే తదేకదీక్షగా చూచుటచేసి వాడు భయపడను గూడ భయపడలేదు దీక్షితునకు ఆ ఉంగరము తనది ఒక బేహారి రాజదర్శనముకొరకు వచ్చి దానిని ఆయనకు ఉపదగా ఇచ్చినాడు ఆ రాజు తనయందు భక్తిచేత, గౌరవముచేత, స్నేహముచేత పుణ్యకాలమున ధారాపూర్వకముగా తనకు ఇచ్చినాడు. తాను, దానిని, మనఃప్రేమ మలరగా, ధర్మగేహిని యైన సోమిదమ్మకు ఇచ్చినాడు. ఆ ఉంగరము రత్నములు పొదిగినట్టిది. చూడ మోడిన పైడి చుట్టికొనినది. అది యజ్ఞావభృథకర్మసాక్షి ఇప్పుడు నగరంలో ఒకానొక జూదరి వ్రేల మున్నది. దీక్షితునకు కోపమూ వచ్చింది. దుఃఖమూ కల్గింది. ఇది వీని చేతికి ఎట్లా వచ్చింది. దీక్షితుడు జూదరిని ప్రశ్నించినాడు "ఓరి! ఇది నీ దగ్గరకు ఎట్లా వచ్చింది? ఉన్న రూపు ఏమిటో చెప్పు! లేదో రాజ సన్నిధిని పెట్టి నిజం చెప్పిస్తాను'' అన్నాడు జూదరి దీక్షితుణ్ణి చూచి చిన్న నవ్వు నవ్వినాడు ఆ నవ్వులో సానుభూతి ఉన్నది. జాలి ఉన్నది "స్వామి! మీ కుర్రవాడు గుణనిధి జూదరి. జూదంలో నాకు దీనిని వోడిపోయినాడు, మరియు బంగారు భృంగారు కర్కరేకలాచికలు, తలిమలు, పళ్లెరములు, తామ్రపాత్రములు, ఆరకూట ఘటములు అన్నియు తాకట్టుపెట్టి, దురోదర క్రీడా పరాయణుడై చెడినాడు అక్షధూర్తులలో నీ కొడుకువంటి అక్షధూర్తుడు మరి లేడు మరి యాగ దీక్షితులలో నీ వంటి యాగదీక్షితుడును లేడు అందులో ఆయనయు, ఇందులో మీరును దొరలు మేము మరి వట్టి అల్పులము'' అన్నాడు దీక్షితునకు సిగ్గు వేసింది. కొడుకుపై క్రోధం సంబాధమైంది అర్ధముండితమైన మూర్ధమును నీర్కావి దోవతితో కప్పుకొని, మొగం గంటు వెట్టుకొని యజ్ఞదత్త సోమయాజి ఇంటికి తిరిగి వచ్చినాడు సోమిదమ్మకు అట్టి ఆయనను చూడగా భయమైపోయింది. ఆయన ఇంటిలోనికి వచ్చి "ఓసి! ఓసి! సోమిదమ్మ! ఇట్లారా! నీ కొడుకు ఎక్కడకు పోయినాడు? వానిని మరల నా గడప ఎక్కనీయక!'' అన్నాడు.

సోమిదమ్మ భయపడినది. "స్వామి! ఏమి వచ్చి పడినది?'' అన్నది.

సోమయాజి కోపఘూర్ణితుడైనాడు "ఓసే! దీక్షితాయణి! ఏమే సోమిదమ్మ! అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూరములు లోచనాపాంగ ప్రాంతము అందు ఖుర్పగా ఒక సయ్యాటం కల్పించి నా అంగుళ్యాభరణాన్ని పుచ్చుకొన్నావు చూడు! అది ఏది! ఇప్పుడు నేను నా వ్రేలికి శృంగారించుకొని గాని, అగ్నికి హవిర్దానం చేయనే! ఆ అంగుళీయకం ఎక్కడ ఉన్నదో తెచ్చి, నా వ్రేలికి తొడుగు'' అన్నాడు. ★



# సంఘసేవ

ఉన్న వూళ్లో భుక్తిగడిచే ముక్తిమార్గం లేక సూరిపంతులు భార్యాసమేతంగా చక్రధరపురం చేరేడు. చక్రధరపురంలో వున్న తెలుగువాళ్ళు తమకుటుంబాలకి తోడుగా మరో తెలుగు కుటుంబం వచ్చినదికదా అని సానుభూతి ఉపకారం చూపించేరు. వెంటనే అక్కడ సూరిపంతులుకి బాంకులో గుమాస్తా ఉద్యోగం దొరికింది. కొన్నాళ్ళ పోయాక ఇల్లు మొదలయిన ఏర్పాటులు కూడా చేయిస్తామని బాంకు అధికారులు అన్నారుట. ఈ గ్రహస్థితి మారినందుకు సూరిపంతులు అమితానందం పొందేడు

అధికారులు ఇల్లిచ్చేవరకూ ఏదో ఒక చోట తలదాచుకోవాలి కాబట్టి ఎక్కడేనా అద్దెకి ఖాళీ వాటా దొరుకుతుందేమో అని తనతోటి ఉద్యోగి సహాయం తీసుకుని వెదకడానికి బయల్దేరాడు. వూరు వూరల్లా గాలించేడు. దండాకోపా, బొక్కకార్కానా, రాంపీ రోడ్డు, రైల్వే కాలనీ—ఎక్కడా ఇల్లు దొరకలేదు. నిరాశతో తిరుగుముఖం పట్టే సమయానికి జ్ఞాపకం వచ్చింది 'దిబ్బలపాలెం'

దిబ్బలపాలెంనిండా తెలుగువాళ్లే. అక్కడ వీచే గాలి తెలుగు గాలి. ఆఖరికి నేలకు మొలిచే గడ్డి కూడా తెలుగు. అక్కడి కట్టుబొట్టు మాట తీరు బట్టి చూస్తే ఆ ఛాయల్లోకి వెళ్లగానే ఒక చిన్న తెలుగు గ్రామం చేరుకున్నట్లనిపిస్తుంది. దిబ్బలపాలెం అసలు పేరు 'దాండ్ మారి'. నివసిస్తున్న వాళ్ళందరూ సర్కారుజిల్లాల నుంచి వచ్చి ఆంధ్రులవటాన్ని దాండ్ మారిలో ఉంటున్నారనిపించుకోవటం నామోషీగా తోచి విన్నవెంటనే అచ్చతెలుగు ముచ్చట ఒలికిపోయేటట్లు 'దిబ్బలపాలెం' అన్న పేరు పెట్టేరు.

అయితేనేమి—బాంకుగుమాస్తా సూరిపంతులు పాలెంలో ఉంటున్న తక్కువ రకం ఉద్యోగస్తులతో కలిసి మెలిసి వ్యవహరించడానికి ఇష్టపడలేదు. అక్కడి తెలుగు వాళ్లతోనా నివసించడం! అంటూ మనసు పేచీలు పెట్టింది.

సూరిపంతులుకి మట్టుకు దిబ్బలపాలెంలోనే ఇల్లు రాసిపెట్టి ఉంది. ఇంటి యజమానితో మాట్లాడి వసారాలోనే అద్దె నిర్ణయించుకున్నాడు. ఇంటికి సదుపాయా లేమి లేకపోయినా ఉన్నట్టుగానే తృప్తిపడ్డాడు. దూరంగా మయ్యి పెరటివైపు కుళ్ళు నీళ్ళు నిలవలయి దుర్గంధంకొట్టే ఒక చిన్న రకం తటాకం. ఇంటి తలుపులు దిట్టమైనవికావు పెంకుటిల్లే అయినా, గట్టిగా గాలి వీస్తే పైకప్పు ఎగిరిపోతుందేమో అన్నట్టుంది. వసారాలో వచ్చే అద్దె కొంచెం అంతకన్నా బాగుంటాయా అని సరిపుచ్చుకున్నాడు. పిట్టమెంటనిమించిన కారణం కూడా మరొకటి లేకపోలేదు. సూరిపంతులు భార్య కాంతమ్మ చాలా అమాయకురాలు. మాటా మంతీ తెలియనిపోవడాన్ని ఏ పొరుగువాళ్ళమధ్యనో పడేస్తే ఇబ్బందిపడుతుంది. ఇక్కడా—అందరూ తెలుగువాళ్ళే కాబట్టి మగల్లా పూసుపోవడానికి కావలసినంత అవకాశం ఉంది.

ఇల్లు శుభ్రం చేయించింది సెలవురోజు కలిసి వచ్చిన ఒక మంచి ముహూర్తాన్ని భార్యాభర్తలు ఇంట్లో ప్రవేశించారు. పెట్టెలు, బట్టలూ, మిగిలిన సామగ్రి అన్నీ చక్కగా అమర్చుకున్నారు. కిళ్లీ దుకాణం ఇంటికిదగ్గర్లోనే ఉంది. అక్కడకు సుమారొంతెం దూరంలోనే కిరాణాకొట్టు. కావలసిన వంట సామగ్రి తెచ్చుకోవడానికి వీలుగా ఉంది. అరుమైళ్ళలో ఇద్దరో అని ఇంతు పుట్టినా అంగడి వాడు అరువివ్వకపోవడం జొప్పకదితే నొప్పి లేకపోవడం కద్దు! అనుకుని సమాధానపరుచుకున్నాడు సూరిపంతులు. ఇల్లు చక్కదాటులో బాగా క్రమపడి ఉండడాన్ని భార్యను పిలిచి కాఫీ పెట్టమన్నాడు.

“కాఫీ పొడుముందికాని పంచదార లేదండీ” అంది కాంతమ్మ

“అవునుకదూ! ఆ సంగతే మరిచిపోయాను. అసలు పాలు కూడా తేవాలిగ” అంటూ వాటిని తెచ్చే నిమిత్తం వీధులోకి బయల్దేరబోయేడు. ఇంతలో ఎదురింటి సత్తెమ్మ గుమ్మం ఎక్కుతూ ఉండడంచూసి “రండమ్మా! రండి!” అని ఆహ్వానించేడు.

“సదుపాయంగా ఉందా ఇల్లు. అన్నీ చక్కగా సర్దుకున్నారండీ!” అంది.

“ఆ! ఏదో!” అంటూ సూరిపంతులు నవ్వేడు. ఇంతలో కాంతమ్మ కూడా మాటలు వినడానికి క్రొత్త మనిషిని చూడడానికి అక్కడికే వచ్చింది

“మిమ్మల్నెక్కడో చూసినట్టు జ్ఞాపకం. కొత్తకోటలో ఉండేవారా!” అంటూ సూరిపంతులునే చూస్తూ సత్తెమ్మ ప్రశ్న వేసింది

“ఎప్పుడో చిన్నప్పుడు ఉండేవాళ్ళం కొత్తకోట మా తాతగారి వూరు.”

“ఆ! అలా అనండి అందుకే మిమ్మల్ని చూసిన వెంటనే పోల్చుకోగల్గేను. మాది కూడా కొత్తకోట నేను కరణంగారి మనవరాలిని”

అనుకోకుండా సత్తెమ్మతో కలిసిన పరిచయానికి సూరిపంతులు సంతోషించేడు

“మా ఆయనంటే కొత్తకోట వూరంతకీ తెలుసు. ఎలక్ట్రీ ఉద్యోగంచేసి కిందటేడే రిటైరయ్యాడు” అని ఇంకా స్వంత భోగట్టా చెప్తూన్న సత్తెమ్మను చూస్తూ “అయ్యయ్యో! నిలవడే మాట్లాడుతున్నారు. కూర్చోండి. కాంతం! ఆవిడతో మాట్లాడుతూ ఉండు. నేను బజారుకి వెళ్లొస్తాను” అన్నాడు సూరిపంతులు.

“ఇంకా ఇవాళ ఇంట్లో దిగారో లేదో భార్యాగారిని ఒక్కర్తినీ వదిలి ఎక్కడకండీ అంత హడావుడి!” నవ్వుతూనే అంది సత్తెమ్మ. ఎంతసేపూ తన [illegible] మాట్లాడుతూ, కాంతమ్మని పలకరించకుండా [illegible] తెలియని సత్తెమ్మను గూర్చి 'విచిత్రపు [illegible] కున్నాడు సూరిపంతులు.

# కా. కృ. శర్మ

"కాఫీ తాగాలనిపించింది. అందుకు

"పాలు కావాలా ఏమిటి? అంత మాత్రానికే బజారుకెళ్ళాలిటండీ" అని కాంతమ్మ వైపు తిరిగి "అమ్మడూ! నీకేమి కావలసివచ్చినా నన్నడుగు నేనిస్తాను" అంది సత్తెమ్మ.

"మీ కెందుకండీ మా గురించి శ్రమ"

"శ్రమేమిటి శ్రమ! ఒట్టి పుణ్యానికా ఏమిటి డబ్బులకేకదూ!" అంటూ సూరిపంతులు చేతులో పాలకోసరంఉన్న గిన్నె తీసుకుని ఎంత హఠాత్తుగా ప్రవేశించినదో అదేవిధంగా సత్తెమ్మ నిష్క్రమించింది

"పంచదార కూడా కావాలండోయ్" అంటూ గుమ్మంలోంచే సత్మెమ్మకు వినపడేవిధంగా కాంతమ్మ చెప్పింది ఇంట్లో కొస్తూ "ఏమండీ! సత్తెమ్మగారు చాలా కలివిడి మనిషి కదండీ కొత్తవాళ్ళతో ఇట్టే పరిచయం చేసుకోగలదు" అంది

"వాళ్ళా మనం కొట్టక్కవాళ్ళం కదుటే అంచేత కాబోలు అలా అభిమానం చూపించుతున్నాది" బయటకలా అన్నాడుకాని సూరిపంతులు మనసులో తర్జన భర్జన పడుతున్నాడు. అనాహా

> సత్తెమ్మకు బెదుదు శంకరయ్యే. ఇంతకాలం ఈ చిట్కా తెలుసుకోలేకపోయిన సూరిపంతులు తన తెలివి తక్కువతనానికి చింతంచడూ మరి !

చేస్తున్న సత్తెమ్మ తత్వం ఏ విధంగా ఎరణమిస్తుందా—అని. ఆవిడ డబ్బులు కూడా తీసుకోలేదు. 'తర్వాత తీసుకోదా' అని సమాధానపడ్డాడు. క్షణం పట్టలేదు. సత్తెమ్మ పాలూ పంచదార తెచ్చి ఇచ్చింది

"కొంచెం కాఫీ తాగి వెళ్ళరుగాని" అన్న కాంతమ్మ మాటలు వినిపించుకోకుండానే తిరిగి వెళ్ళిపోయింది. గిన్నెలో పాలు చూసుకుని "ఒట్టి నీళ్ళ పాలు. అర్ధశేరు కూడా ఉండవండీ" అంది కాంతమ్మ సూరిపంతులుకి పాలు చూపిస్తూ.

"వూరుకుందూ! ఎన్నో కొన్ని. ఆపత్కాలంలో పరమేశ్వరుడిలాగ పాలూ పంచదారా స్వయంగా తెస్తే తక్కువా ఎక్కువా అంటావు. ఒట్టినే ఇచ్చింది చాలక."

"డబ్బులు పుచ్చుకోదా ఏమిటి!" తప్పకుండా పుచ్చుకుంటుంది అన్నట్లు వాక్యాన్ని పూర్తిచేసింది కాంతమ్మ.

సూరిపంతులూ కాంతమ్మా సందేహాత్మకంగా ఒక్కర అడిస్తూ నవ్వుకున్నారు. కాఫీ తయారయింది. కమ్మగాలేదనుకుంటూ పాలిచ్చిన సత్తెమ్మను విడిచి నిళ్ళపాలన తిట్టుకున్నారు సూరిపంతులు షాపుకి వెళ్ళాడు కాంతమ్మ గుమ్మంలో నిలబడి ఆవీధి ఎదురుగాఉన్న బీడిఫ్యాక్టరీ,మరికొంచెం దూరంగా ఒంటిపిల్లి రాకాసిలాఉన్న ఒక పాడుపడిన మేడ—అన్నీ చూస్తున్నాది. కాంతమ్మతో మాట్లాడడానికే ఎదురు చూస్తున్నట్లుగా సత్తెమ్మ వాళ్ళ వీధి గుమ్మంలోకి హడావుడిగా వస్తూ చిరునవ్వు నవ్వింది

"పాలెలా ఉన్నాయి అమ్మడూ?" అంది సత్తెమ్మ

"బాగానే ఉన్నాయండీ" బాగులేవని మొదటి రోజునుండే అసంతృప్తికరంగా సమాధానం ఇవ్వడం ఎందుకని అలా చెప్పింది కాంతమ్మ అదీకాక డబ్బులు కూడా పుచ్చుకోలేదు.

"అవి మా ఆవు పాలు మా ఆవు చిక్కటి పాలిస్తుంది"

"ఇవాళ్టికయితే మీ పాలు తాగేము కాని రేపటి నుండి ఎలాగా పాడుకవాళ్ళని పెట్టుకోక తప్పదు మీరు అదృష్టవంతులు పాడి ఉన్నది"

"పాలవాడు ఏమీ! కర్మ!! మీాకేమీ అభ్యంతరం లేకపోతే నేనే ప్రతిరోజూ ఇస్తాను ఎన్ని పాలు కావాలి"

"మేము ఇద్దరిమే కదండీ. మూడు పావులు ఎక్కడక్కని అయినా మా ఆయన్ను కనుక్కుని చెప్తాను లెండి."

మాటల్లోనే సూరిపంతులు చేతులో రెండు కిళ్లీలు పెట్టుకొని తిరిగొచ్చేడు కాంతమ్మ ఒక కిళ్లీ తీసుకుని వేసుకుంటూఉంటే, వీధిలోనే నిలబడి ఉన్న సత్తెమ్మ "పంతులుగారికి భార్య అంటే గొప్ప ప్రేమ" అంది కాంతమ్మ సిగ్గుపడింది. సూరిపంతులు మోహమాటంపడ్డాడు అదే అనువైన సమయంగా కనిపెట్టిన సత్తెమ్మ "పంతులు గారూ! మీ ఆవిడ రోజూ పాలు తెచ్చిపెట్టమన్నారు. మాకు పాడి ఉంది కదా అని అలాగే అన్నాను. నాకసలు పాలమ్మడం అంటేనే చికాకు. ఏదో స్వయంగా అడిగేరుకదా అని మాకు సరిపోగా మిగిలినవి మీకు సర్దుబాటు చేస్తాను. సహాయం చెయ్యడం అంటే నాకు సరదా, ఆసక్తిను!"అంది సూరిపంతులు "సరే" నన్నాడు.

కాంతమ్మ భర్త నింట్లోకి పిల్చింది.

"పాలువాడికగా ఇమ్మని నేననలేదండీ. పాల అవసరం రోజూ ఉన్నదే అన్నాను"

"పోనిస్తూ! ఏంపోయింది. పాలుకదా వాడికగా ఇస్తానంది. మన ఎదురుగా పితికి, పాలు కొలుస్తుంది. ఆమాత్రందానికి పెద్ద బ్రహ్మాండం చేస్తున్నావు. ఎక్కడో పితికి సగానికి సగం నీళ్ళుపోసే వాడిక వాడికన్న ఈవిడ నయమేకదూ!"

ఇంటి పనులలోమునిగి కాంతమ్మ మరేమీ మాట్లాడలేదు. భోజనంచేసి ప్రక్కమీద నడ్డివాలుస్తూ ఉంటే వీధిలోంచి 'పంతులుగారూ' అంటూ పిలుపు వినిపించింది.

"ఎవరండీ" అంటూ సూరిపంతులులేచి గుమ్మం



లోకొచ్చేడు. "ఓహో! శంకరయ్యగారా! ఏమిటి పంగతి" అన్నాడు. శంకరయ్య సత్తెమ్మ మగడు. శంకరయ్యకీ సూరిపంతులుకీ పరిచయం కిళ్లీ కొట్టుదగ్గర అయింది.

"మా సత్తి డబ్బు లడిగి పుచ్చుకోమంది. అందు కని"

"ఏం డబ్బులు! నేనేమీ అప్పు పుచ్చుకోలేదే"

"అప్పు కాదయ్యా! పంచదారా పాలూ ఇచ్చింది కదూ. వాటి ఖరీదు"

మాట్లాడుతూఉంటే శంకరయ్య నోట్లోంచి మూర్ఖైన సారా కంపు బయటకొచ్చింది. మత్తుగా తాగాడాన్నో ఏమో తూగిపోతున్నాడు. సూరిపంతులుకి భయం వేసింది ఇంకా ఎక్కువ మాట్లాడితే తంతాడో ఏమో అని డబ్బులు తేవడానికి లోపలికెళ్లేడు. "తాగి నట్లున్నాడే వెధవ!" అని భార్యతో చెప్తూ చిల్లర తన దగ్గర లేకపోవడాన్ని రూపాయి నోటు శంకరయ్య కిచ్చేడు. కాంతమ్మ వూరుకోలేకపోయింది "ఇంత రాత్రప్పుడు తాగుబోతు వెధవని మనమీద కుసికొల్పిందేమిటండీ సత్తెమ్మ!" అంటూ ఆ తాగుబోతు వాడెవడా అని సందేహాన్ని వెలిబుచ్చింది.

"వెధవెవడు వెధవ! దాని మొగుడే నువ్వు మరీను. చిల్లరెక్కడా ఉంచవు పిడికెడు పంచదారకీ, గుక్కెడు నీళ్ళపాలకీ రూపాయి ముడుపు చెల్లించవలసి వచ్చింది"

"నన్నడగలేకపోయారా"

'నిన్నడగడం వాణ్ణడగడం ఇన్ని చెయ్యడానికి టైమేదీ. వీధిలో వాడు తప్ప తాగి ఉన్నాడు అలస్యం అయిందంటూ తిట్లు మొదలు పెడితే నలుగురూ పోగవరూ" సూరిపంతులు చాలా విసుగుకున్నాడు. నిషాలోఉన్న శంకరయ్య మిగులు చిల్లర తెస్తాడన్న నమ్మకం లేకపోయింది

మరే అవాంతరాలూ లేకుండా ఆ రాత్రి గడిచి పోయింది. తెల్లవారుతూనే మళ్ళా సత్తెమ్మ ప్రత్యక్షం!!!

"ఇంత పొద్దెక్కిలేచేరేం? పాలు తీసుకోండి"

బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ కాంతమ్మ పాలు తీసుకుని ఇంట్లోకొచ్చింది. "ఏమండీ! ఇవి పాలో నీళ్లో తెలియడంలేదు" అంటూ సూరిపంతులుని లేపింది.

"నాతో చెప్తే ప్రయోజనం ఏమిటి? నేనేం పాలవాడినా, లేకపోతే సత్తెమ్మ మొగుడినా? కోరి నువ్వే ఆవిడ దగ్గర వాడికగా పాలు పుచ్చుకుంటూ న్నావు. అనుభవించు" అన్నాడు కసురుకుంటూ.

తెల్లవారేసరికి చీవాట్లుతిన్న కాంతమ్మ కంట నీరు పెట్టుకుంటూ కాఫీ పెడుతూంది 'పాల విషయంలో సూరిపంతులే స్వయంగా 'సరే' అన్నాడు. కాంతమ్మ అమాయకురాలే! అన్న స్ఫురణ కలిగి "చ! చ! అదేమిటి కాంతం! వూరుకో. నేను కోపంగా అన్నానా ఏమిటి" అంటూ ఓదార్చేడు

నవ్వుకుంటూ ఇద్దరూ కాఫీ తాగేరు పాలన్నీ నీళ్ళలా ఉండటాన్ని, వేరే నీళ్లుపెట్టి డికాక్షను తియ్యకుండా పాలల్లోనే పొడుంవేసి కాఫీ తయారు చేసింది.

"పాలన్నీ ఇప్పుడే అయిపోయాయి. మధ్యాహ్నానికీ, సాయంత్రానికీ ఎలాగ!" అంటూ సందేహం వెలిబుచ్చింది.

"ఇప్పుడు వెళ్ళి తెస్తానులే అంటూ సూరిపంతులు షర్టు వేసుకుని బయల్దేరబోయేడు. దారిలో కూరలు కూడా కొనుక్కోవచ్చునుకదా అని సంచీ, గిన్నె పట్టుకుని జోడు తొడుక్కుంటూ ఉండగానే సత్తెమ్మ ఎదురుగా వస్తూ "కాంతమ్మా! మీ ఆయన గిన్నె పట్టుకుని బయల్దేరారు. పెరుగుకా ఏమిటి" అంది.

పాలకొరకని చెప్తే మరో ఇన్ని నీళ్ళపాలేకదా ఇచ్చేది, పది గంటల భోజనానికి పెరుగు కూడా లేదు. అని అనుకుంటూ "పెరుగుకే" అని సమాధానం చెప్పింది.

"గిన్నె ఇలా ఇవ్వండి పంతులుగారూ! మీరు పెద్ద ఉద్యోగస్థులై ఉండి గిన్నె పట్టుకుని పెరుగుకోసరం వీధులోకి బయల్దేరడం ఎంత చిన్నతనం" అంటూ

ఒకడు:- రాత్రినుంచి గుండె ఎందుకో విపరీతంగా కొట్టుకుంటున్నదండి.

డాక్టరు:- మీరేమి భయపడకండి. తొందరలోనే ఆగిపోయేటందుకు ఘాటైన మందు యిస్తాను.

—తటవర్తి వీరభద్రరావు
(కాకినాడ)

సూరిపంతులు చేతులో గిన్నె తీసుకుని సత్తెమ్మ చరచరా వెళ్ళిపోయింది.

"పెరుగు కూడా ఆవిడే ఇస్తుంది కాబోలే" అని భార్యతో చెప్తూ, సంచీ ఒక్కటే భుజంమీద వడవేసుకుని బజారు కెళ్లేడు.

'ఇకమీద గిన్నెకాని, గ్లాసుకాని పట్టుకుని వీధిలోకి రానియ్యదు' అని అనుకుంటూ ఉండగానేసత్తెమ్మ తన గుమ్మంలోనే నిలబడి కాంతమ్మని కేక వేసింది, పెరుగు తీసుకుని వెళ్లమని. కాంతమ్మ ఆశ్చర్యపోయింది. తన భర్తని 'పెద్ద ఆఫీసులో ప్రభువివి' అంది అటువంటి ప్రభువుగారి భార్యఐన కాంతమ్మని పాలూ పెరుగూ అమ్ముకుని జీవిస్తూన్న సత్తెమ్మ, నౌకరునిపిల్చి చెప్పినట్లు పెరుగు గిన్నె తీసుకుని వెళ్ళమని చెప్పింది ఎలా తీసుకుని వెళ్ళిందో అలాగనే ఇచ్చెయ్య రాదూ. 'తప్పదు' అనుకుంటూ, రెండణాల పెరుగుకోసరం పది హేను రూపాయలు విలువగల స్టీలుగిన్నె వదులుకోలేక, సత్తెమ్మ గుమ్మంలోంచి తెచ్చింది మరొకచోట పాలు కొని తేవడానికని సూరిపంతులు సిద్ధమవుతూఉంటే, ఆ పనికి నేర్పుగా ఆటంకం కలిగించింది సత్తెమ్మ కూరలుకొని తెచ్చిన తర్వాత టైముండదు. భోజనంచేసి ఆఫీసుకి పోవాలి. పాలవాళ్ళు ఎక్కడుంటారో, వాళ్ళతో ఏ భాషలో మాట్లాడాలో తనకు తెలియదు అంటే మధ్యాహ్నానికి కూడా సత్తెమ్మ నీళ్ళపాలు తప్పవన్నమాట! నేర్పంటే సత్తెమ్మదే అనుకుంది కాంతమ్మ. ఈ భాగవతం ఎన్నాళ్లో చూడాలనుకుంటూ పనిలో పడింది.

సూరిపంతులు కూరలు కొనుక్కొని సత్తెమ్మ ప్రవర్తనని తలంచుకుంటూ ఆశ్చర్యపోయాడు 'మామూలుగా డబ్బు లడిగి పుచ్చుకోకుండా, తాగుబోతు శంకరయ్యని మీదకుసికల్పింది అల్లరి పెడితే శంకరయ్య ద్వారా రచ్చకీడుస్తానని బెదిరింపు కాబోలు' అనుకున్నాడు 'సరిలే! ఇలా ఎన్నాళ్లో చూద్దాం. కాకపోతే ఈలోపుగా మరో ఇల్లు చూసుకోవచ్చు' అని సరిపుచ్చుకున్నాడు.

"ఎలాగుంది పెరుగు" అంటూ గుమ్మం ఎక్కుతూనే కూరల సంచీ అందించుతూ అడిగేడు కాంతమ్మని.

"తినబోతూ రుచెందుకూ" అంటూ విసుక్కుంది కాంతమ్మ "ఇది మరొక దండుగన్న మాట!" ఇద్దరూ నిశ్శబ్దంగా భోజనం చేసేరు. ఇద్దరి మనస్సులూ ఆలోచనలతో సతమతమవుతున్నాయి

ఆఫీసుకి వెళ్ళడానికి బట్టలు వేసుకుని సైకిలు వీధి గుమ్మంలో పెట్టేడు. వెనకాతలే కాంతమ్మ కూడా అనుసరించింది అప్పటికప్పుడే గుమ్మంలో నిలబడి కనిపెడుతూన్న సత్తెమ్మ సూరిపంతులుని చూసి "పంతులుగారూ! డబ్బు లిప్పిస్తారా" అంది.

"పెరుగు డబ్బులు కాబోలు నువ్విచ్చెయ్యవే" అంటూ సత్తెమ్మకు వినబడేటట్లు కాంతమ్మతో చెప్పేడు

"ఒక్క పెరుగుకే కాదండీ నిన్నటి పాలూ పంచదారా కూడా కలుపుకొని మొత్తం రూపాయి పావలా అయింది" అంటూ సత్తెమ్మ సూరిపంతులు అభిప్రాయాన్ని సరిదిద్దింది

"పాలకీ పంచదారకీ నిన్ననే శంకరయ్యగా రడుగుతే రూపాయిచ్చేనండీ"

"ఆయనకెందుకిచ్చేరూ! నాకే ఇవ్వవలసింది"

"మీరే పంపించేరన్నారే ఆయన."

"నేనేమీ పంపించాలేదు డబ్బులడగమనసూలేదు. ఒట్టి తాగుబోతు. తాగడానికే ఖర్చుచేసి ఉంటాడు. వాడికి డబ్బు లిచ్చేముందు నన్నడగవలసింది పోనీలెండి ఇప్పుడేమీ మించిపోయిందిలేదు రాగానే అయన్నడిగి మీ డబ్బు మీ కిప్పిస్తాను ప్రస్తుతానికి ఆవుకి గడ్డిలేదు. మీ రివ్వవలసిన రూపాయి పావలాఇస్తే గడ్డికొంటాను" అంది సత్తెమ్మ. సూరిపంతులుకి ఏమనాలో బోధపడలేదు రాత్రికి రాత్రి శంకరయ్య తాగి ఇంటిమీదపడితే రూపాయి వాడి ముఖాన్న కొట్టవలసి వచ్చింది. ఇప్పుడు సత్తెమ్మ కూడా డబ్బులు గుంజుతూంది కాంతమ్మనుచూసి "ఆవిడ మాటలను నువ్వు కూడా వినడం మంచిదేఅయింది. లేకుంటే నాకు తెలియకుండా నీనుండికూడా మరో రూపాయిపావలా వసూలుచేసి ఉండును" అన్నాడు.

"ఆలోచిస్తున్నారేమిటి పంతులుగారూ. మీ రూపాయకేమీ తకరాలేదు. ఆయన వచ్చిన వెంటనే అడిగి ఇచ్చేస్తాను" అంది సత్తెమ్మ. కాంతమ్మ దగ్గర నుండి తీసుకొమ్మని చెప్తూ సూరిపంతులు సైకిలు ముందుకు పోనిచ్చేడు. సత్తెమ్మ డబ్బులు వసూలు చేసింది.

మధ్యాహ్నం మూడు గంటలయింది. కాంతమ్మ నిప్పు చేసింది. సత్తెమ్మ వీధులోంచి పిల్చుకుంటూ లోపలికొచ్చింది. "అబ్బ! ఏమీ తోచడంలేదు కాంతమ్మా. మరి నీకెలా కాలక్షేపం అవుతున్నాదో ఏమో?" అంటూ కూర్చుంది.

"అదేమిటి ఉప్మా తయారు చేస్తున్నావేమిటి"

"అవునండీ. మధ్యాహ్నం టిఫినుకని"

కాంతమ్మ ఉప్మా తయారుచేసి రుచి చూడమని సత్తెమ్మ క్కూడా కొంచెం ఇచ్చింది.

"చాలా బాగుంది కాంతమ్మా. నీచేతిపాకం చాలా రుచిగా ఉంటుందే" అంటూ కాంతమ్మని ఉబ్బవేసి, మనసులోలేని సంతోషాన్ని వెలిబుచ్చి, సగానికిపైగా చేసిన ఉప్మా తినేసింది. సంతోషిస్తూ తిన్నదికదా అని అడగనిదీ చెప్పదేమో అని రూపాయి విషయం నెమ్మదిగా కోపం రాకుండా అడిగింది. దండువాళ్లని చూస్తే కాంతమ్మకి అసలే భయం.

"అదేమిటి కాంతమ్మా. అలా మాట్లాడుతావు. ఒక వచ్చు రూపాయికోసం పెద్ద బేంకు బాబుగారి పెళ్లానివైఉండి గడియ గడియకీ అడుగుతావు. నీదగ్గర అప్పుపుచ్చుకున్నానా ఏమిటి. తాగేవాడికి డబ్బిస్తే ఆ సొమ్ము తిరిగి వస్తుందనే అనుకున్నావా? అసలు నిజం ఏమిటంటే—మీరు రూపాయి ఇవ్వలేదనే అన్నారు మా ఆయన. ఎప్పుడెవరిమాట నమ్మడం! తగువులాడే మనుష్యులలా ఉన్నారు కాని మీరు మంచివాళ్లలా లేరు. పేచీమనిషివని తెలిస్తే నీ ఉప్మాయే తినకపోదును" అంటూ సత్తెమ్మ త్రేన్చుకుంటూ కోపంగా తిరిగి వెళ్ళింది.

"ఎంత ధారణపు మనిషి. కావలసినంత ఉప్మాతినేసిన తర్వాత నీ ఉప్మాయే తినకపోదును అని కోపం కూడా తెచ్చుకుంది" అనుకుంది కాంతమ్మ. పరధ్యానంగా విచారంగా కూర్చున్న కాంతమ్మనిచూసి గుమ్మంలో అడుగుపెడుతూనే అడిగేడు సూరిపంతులు.

"ఏం అలా ఉన్నావు"

"నేనీ ఇంట్లో ఉండలేనండీ. సత్తెమ్మ గ్రద్దలా పీక్కుతింటుంది"

"మెల్లిగా అను మెల్లిగా. విందిరా అంటే బొడ్డు పట్టుకుని లాగెయ్యగలదు."

"మనం ఈ ఇంట్లోదిగి మూడు రోజులు కూడా కాలేదు. రెండు రూపాయలకుపైగా డబ్బు తీసుకుంది. ముందు ముందు ఇంకా ఎంత ఇబ్బంది పెడుతుందో ఏమిటో!"

"అయితే ఆవిడ రూపాయి ఇవ్వలేదన్నమాట!"

"ఇవ్వలేదు. పైగా మూడు గంటలకొచ్చి పావు మొరుం ఉప్మా కూడా తింది. నాతో దెబ్బలాడి నాకు చీవాట్లుపెట్టి మరీ వెళ్ళింది. శంకరయ్య తనకు రూపాయే ఇవ్వలేదని చెప్పేడుట!

"గడుసుముండ. ఆ డబ్బు కూడా తీసుకునే ఇవ్వలేదని బుకాయిస్తున్నాదేమో"

"నన్ను నానా మాటలూ అంది" అంటూ ఆ విషయం తలంచుకుని కంటనీరు పెట్టుకుంది కాంతమ్మ.

"అదేమిటి కాంతం! చిన్నపిల్లలాగ క్షణ క్షణానికీ ఏడుస్తావు. దాని శని విరగడ అవకుండా ఉంటుందా. మనం ఇంకా ఈ వీధికి, ఈ ఇంటికీ కొత్త కాదూ. అంచేత మనలని జలగలాగ పట్టుకుని వదల కుండా ఉంది."

"ఆ మాటలన్నీ నాతో అనీ కన్న ఆసత్తెమ్మతో అనకూడదుటండి."

"అక్కడే పొరపాటు పడ్డావు. ఆవిడ మాటలకి బెదురుతుందే. మీదు మిక్కిలి తాగుబోతు వెధవలని మనింటిమీదికి సంపిస్తుంది."

"అయితే ఈ ఇల్లు ఖాళీ చేసిపోదాం"

"ఆ అవకాశమేఉంటే ఇంతసేపు ఆలోచనెందుకూ"

"సరిలెండి. పాలు తీసుకురండి"

"మధ్యాహ్నం లేలేదూ?"

"ఎక్కడనుండి లేవడం. వెధవపాలు. సత్తెమ్మే కదూ మళ్ళా ఇవ్వాలి"

"ఊఁ! ఆ గిన్నె ఇలాపడెయ్. పెరట్లోంచి వెళ్ళితెస్తాను. వీధులోంచివెళ్తే ఆముండ మళ్లా పట్టుకుంటుంది.

> 'పొట్టకోసినా అక్షరం ముక్క రాదని' హేళన చేసినందుకు చాలాకాలంగా బాధపడుతున్న షావుకారుగారొకరు ఆపరేషన్ చేసుకోవలసివచ్చింది. ఇదే సమయమనుకుని ఆయన ఒక చిన్న అక్షరం—ప్లాస్టిక్‌తో చేసింది—మింగాడుట.

సత్తెమ్మకంటపడకుండా జాగ్రత్తగా పాలు పట్టుకుని తిరిగొచ్చేడు సూరిపంతులు. అప్పిచ్చినవాళ్ళ కంట పడకుండా తప్పించుకుని తిరిగే అప్పు పుచ్చుకున్నవాళ్లు జ్ఞాపకం వచ్చేరు.

"కర్మ కాకపోతే అందరిలాగే మనలని కూడా హాయిగా వీధులో వెళ్ళనివ్వకుండా దొడ్డితోవ పట్టించింది. సత్తెమ్మని తప్పించుకోవడానికి ఒక్కే ఉపాయం కావాలి. అది అడ్డూ ఆటంకంలేక బలిసిపోయిఉన్న దుష్టిముచ్చు. అప్రమత్తంగా మనం ఉంటూ దానిమీద వల విసరాలి. తప్పిపోయిందో ఆ వలతో సహా మనలని కూడా ఈడ్చుకునిపోతుంది" అనికాఫీ తాగుతూ సత్తెమ్మనిగుర్చి తాను గ్రహించినది కాంతమ్మకు బోధపర్చేడు.

రోజులు గడుస్తున్నాయికాని సత్తెమ్మ పీక్కని వదిలిపెట్టలేదు. ప్రతిరోజూ కావలసివచ్చే చిన్న చిన్న అవసరాలన్నీ సత్తెమ్మే తీర్చేది. ఇంకొకవిధంగా ఆ అవసరం గడుపుకోవాలనుకున్నా ఒప్పుకొనేది కాదు. రెట్టింపు విలువలు కూడా రాబట్టుకొనేది. సత్తెమ్మ చిల్లర వస్తువులు అమ్ముకొని డబ్బు ఆర్జిస్తుందనీ, ఆవిడకి వాడుకవాళ్లు కాంతమ్మలవంటి నరసమ్మలూ, సుబ్బమ్మలూ అని క్రమేణా తెలిసింది. అలుపుడినిమించిన బలువుడు ఎవడేనా దారితప్పి అవసరంపడి వచ్చినా వాడిమీద విరుచుకుపడేది. తాను అంగడి పెట్టలేదనీ, నానా అడ్డమైన వాళ్ళూ వచ్చి తన పరువు తీస్తున్నారనీ ఇంకా ఇంకా ఏమిటేమిటో పేర్చి వర్ణనలు చేసేది.

ఈ విధంగా సత్తెమ్మ చేస్తున్న దోపిడీవలన సూరిపంతులు ఆర్థికంగా ఎక్కువ బాధపడ్డాడు. ఆవిడ ఇచ్చే నీళ్ళపాల వాడిక తప్పలేదు. ఒకనాడు ప్రక్క పల్లెటూరు పాలవాడు రోజూ పాలు నమ్మకంగా కొలుస్తానంటూ సూరిపంతులు గుమ్మం ఎక్కుతూఉంటేనే సత్తెమ్మ మహాభూతంలాగ దారి కాచి వాడిని ఆపింది. "నువ్వెవడివిరా! నా వాడుక వాళ్ళకి పాలివ్వడానికి. నానోట్లో దుమ్ముపోస్తే నీ కేమిటి లాభం. పోతావా పోవా ఒడ్డిముండాకొడుకా" అంటూ పెద్ద కలహం రేపింది. సత్తెమ్మనివాడు, వాడిని సత్తెమ్మ అనరాని మాటలన్నీ అనుకున్నారు. ఇదంతా సూరిపంతులు గుమ్మంలోనే. ఈ సంఘటనవలన సూరిపంతులు సత్తెమ్మతో పేచీ పెట్టుకోవడానికే భయపడ్డాడు. రెండురోజుల కొకసారి మూడు రోజుల కొకసారి సత్తెమ్మ స్వయంగావచ్చి ఏదో ఒక నెపమ్మీద రెండూ మూడూ రూపాయలు అప్పు అంటూ పట్టుకుని వెళ్లేది. ఒకమారు అవుకి గడ్డి లేదని, మరొకసారి తెలకపిండిలేదని ఏదో ఒకసాకు చెప్పేది. పైగా "పంతులుగారూ మీరు మరోక విధంగా భావించకండి. ఎన్నెన్ని రూపాయలు మీరిస్తున్నారో అన్నీ రాస్తూనే ఉన్నాను. పాలకి అయినమొత్తంలోంచి ఈ అప్పు కోసేసుకుందురుగాని" అంటూ సంజాయిషీ చెప్పేది. సూరిపంతులుకి ఏమనడానికీ పాలుపోలేదు! ఏమి చేయడానికీ తోచదు!!

మరొకచోట ఇల్లు చూడమనీ, ఆ ఇల్లు ఖాళీ చెయ్యమనీ కాంతమ్మ రోజూ చెవి కట్టుకుని సూరి పంతులుకి చెప్పింది. సూరిపంతులు తాననుభవిస్తున్న ఇక్కట్లు అన్నీ పూసగుచ్చినట్లు ఆఫీసువాళ్ళతో మొర పెట్టుకుంటూ, తనకు ఎంత వేగంగా ఇల్లు ఇవ్వగల్గితే అంత మంచిదని, ఇల్లు లేకపోవడంవలన మనశ్శాంతి దక్కడంలేదనీ ముగించేవాడు. పరిస్థితులు అనుకూలించినప్పుడు ఎవరితో ఎవరు ఎన్నిచెప్పినా మంచి జరగాలంటే చాలా ఆలస్యమవుతుంది.

నెల గడుస్తే ఒక యుగం గడిచినట్లనిపించింది.

జీతం అందుకుని ఇవ్వవలసిన వాళ్ళందరకూ ఇచ్చి సత్తెమ్మ పాల సొమ్ము కూడా తేల్చుకొనే నిమిత్తం వెళ్లేడు.

"పాల గురించి డబ్బు పద్నాలుగున్నర అయిందండీ"

"లెక్కవేసి మీరేచెప్పాలి పంతులుగారూ! నాకేం తెలుస్తుంది ఆడదాన్ని."

"నేను మీ కిచ్చిన రొక్కం ఇరవై ఆరురూపాయలైంది."

"ఊఁ!"

"మిగిలిన సొమ్ము ఇప్పుడు నాకిస్తే చాల సదుపాయం చేసినవాళ్లవుతారు.

"నా దగ్గర డబ్బేలా వుంటుంది. పంతులుగారూ! మీకు తెలియదా! ప్రస్తుతం మూడు పావులుకదా తీసుకుంటున్నారు. శేరున్నరపాలు తీసుకోండి ఇకటే

## సంఘసేవ

తిరిపోతుంది మీ అప్పు"

"సేరున్నర పాలు మేమేం చేసుకుంటాం. ఇద్దరమే కదా"

"పాలు ఏంచేసుకుంటారో కూడా తెలియదా. ఒట్టి అమాయకులులాగ ఉన్నారే. ఎర్రగా కాగబెట్టుకుని మీగడపాలు త్రాగండి. ఇప్పటికే మీరు సన్నంగా ఎలకలాగున్నారు. కాంతమ్మగారు మీకన్నా మరీ అన్యాయం. డబ్బు దాచుకుని ఏమిటి చేస్తారు. తినడానికి అనుభవంలేనప్పుడు. మా ఆవుపాలు చాలా మంచివి" అని ఒక ఉపన్యాసం ఇచ్చేసరికి నూరిపం తులుకి తల తిరిగినంతపనైంది.

సముద్రతరంగాలలాగ ఆలోచనాపరంపరలు

(51 వ పేజీ చూడండి)

# శిరోనరములు: వాటి వివరాలు

గతవారం కేంద్ర నరాశయంలో అతి ముఖ్య భాగమైన సెరిబ్రమును గురించి అందులో ముఖ్య కేంద్రములను గురించీ తెలుసుకున్నాము. సెరిబ్రము క్రింది వైపున అనేక నిర్మితు లున్నవి. వాటి వివరములు నరాశయమును చర్చించే టప్పుడు చర్చిస్తాను. వాటిలో సెరిబెల్లము క్రిందివైపు నుండి, మెడుల్లా అబ్లాంగేటా ప్రారంభ మవుతుంది ఇది వెన్నుపాము పై భాగము. దీనినే స్పైనల్ బల్బు (Spinal Bulb) అంటారు. ఎలెక్ట్రిక్ బల్బు ఆకారం దీనికి ఉన్నందున ఆ పేరు వచ్చింది. సెరిబ్రము తరువాత, కేంద్ర నరాశయంలో అతిముఖ్యమయిన భాగము మెడుల్లా అబ్లాంగేటాయే ! ఈ ప్రదేశము నుంచి, ఒక్కొక్క ప్రక్క నుండి పన్నెండు నరములు ఏర్పడుతవి. క్రేనియము నుండి ప్రారంభ మయినందున వీటిని క్రేనియల్ నరములు అంటారు మనము "శిరో నరములు" అనుకో వచ్చును. ఇందులో మొదటి జత వాసనకు సంబంధించినది. ఇది నాశికలో ప్రారంభ మవుతుంది. రెండవ జత దృష్టికి సంబంధించినది. మూడవ జత కంటిరెప్పలు, కంటిపాప, కంటి గ్రుడ్డు, కదలడానికి అవసరములయిన కండల చలనమునకు అవసరమైనది. ఇది మోటారు నరము. నాలుగవ జత ఆరవజత కూడా కంటికి సంబంధించిన కండరముల సంకోచ వ్యాకోచములకు సంబంధించినవే.

అయిదవ జత చాలా పెద్దది. చాలా భాగములకు పోయేది. ఇందులో మోటారు భాగము, సెన్సరీ భాగము రెండూ ఉన్నవి. ముఖ్య ప్రదేశములో ఉండే చర్మములో, స్పర్శకు దవడ ఎముకలను ఆడించే కండరముల కదలికకు యీ నరమే కారణము. ఈ నరము మూడు చోట్ల నుండి వచ్చిన పాయలు కలిసి యేర్పడ్డందున, దీనికి ట్రైజెమినల్ నరము అని పేరు. 'ట్రై' అంటే మూడు (త్రి) ఇందులో ఒక భాగము నాలుక ముందు భాగమునకుపోయే సెన్సరీ భాగము. నాలుక ముందు భాగములో తెలిసే రుచి భేదములు ఈ భాగమువల్లనే తెలుస్తవి. ఒక్కొక్క ట్రైజెమినల్ నరములో సెన్సరీ భాగము ముఖంలో ఒక వైపున ఉండే స్పర్శబాధాది అనుభూతులకు సంబంధించినది. ఈ నరంమీద వత్తిడి కానీ దీనికి యిరిటేషను కాని ఏ కారణంచేతనైనా ఏర్పడ్డప్పుడు అతిదుర్భరమయిన పార్శ్వపు నొప్పి ఏర్పడుతుంది.

ఏడవ జత ముఖంలో ఉండే యితర కండరముల సంకోచ వ్యాకోచములకు సంబంధించినది.

ఎనిమిదవ జత వినడానికి సంబంధించినది. ఈ నరములలోను రెండు భాగములు ఉన్నవి. ఒక భాగము సెరిబెల్లములో ఉన్న న్యూరానుల నుండి ప్రారంభ మవుతుంది మరొక భాగము మెడుల్లా అబ్లాంగేటానుండి ప్రారంభమవుతుంది. ఇందులో సెరిబెల్లములో ఉండే భాగము వల్లనే మనం ఏమాదిరిగా నుంచోవాలంటే ఆ మాదిరిగా కళ్లు మూసుకుని దృష్టి సహాయం లేకుండా నిలబడగలుగుతున్నాము. కళ్లు మూసుకుని ఏ శరీర భాగమును తాకాలన్నా తాకుతున్నాము. సెరిబెల్లములో




వ్యాధి ఏర్పడి యీ నరము చెడినప్పుడు కళ్లు మూసుకుని స్థిరంగా నిలబడలేము. ముక్కు పట్టుకోమంటే నోరు తాకుతాము. ప్రక్కన ఉన్న వస్తువు అందుకోలేము. నరముల వ్యాధితో బాధపడేవారు డాక్టర్ల దగ్గరకు పోతే, పాదములు దగ్గరగా ఉంచి కళ్ళు మూసుకు నిలబడ మంటారు. సెరిబెల్లము చెడినవారు నిలబడలేరు. ఆ విషయము మళ్లీ నరాశయమును గురించి చర్చించినప్పుడు చర్చిస్తాను. ఎనిమిదవ శిరోనరంలో రెండవ భాగము శ్రవణేంద్రియానికి సంబంధించినది. మాటలకు, వినడానికి చాలా సంబంధ మున్నది. అందుచేత మాటలాడడం రీత్యా ఇది చాలా ముఖ్యమైనది.

తొమ్మిదవ జతలో సెన్సరీ భాగము. మోటారు భాగము రెండూ ఉన్నవి. ఈ నరములను గ్లాసో ఫెరింజియల్ (Glasso- Pharyngial) నరములు అంటారు. గ్లాసస్ అంటే నాలుక, 'పేరింక్సు' అంటే నోటి వెనుక ఉండే అంగిలి భాగము. ఈ రెండు భాగములలోనూ ఉన్న స్పర్శాది అనుభూతులకు, కండరముల కదలికకు సంబంధించినది గనుక దీనికి యీ పేరు వచ్చింది. ఈ నరమో, ఈ నరమూలమో వ్యాధిగ్రస్థమయినప్పుడు రుచి తెలియదు. నాలుక కదలదు. మింగుడు పడదు. వూపిరి ఆడదు. 5 వ నరం నాలుక ముందు భాగములో అంతమైతే నాలుక వెనుక భాగమునులో చలనస్పర్శలకు తొమ్మిదవ నరం కారణమవుతుంది. అందుచేత మాటల విషయంలో యిదీ అతి ముఖ్యమైనదే. పదవ జతను న్యూమోగేస్ట్రిక్ జతఅంటారు.)(Pnemo-gastric Nerves) నూమో—అంటే వాయు సంబంధమైన అని అర్థము. వూపిరితిత్తులు గాలి పీల్చి విడవడానికి పనికివచ్చే అంగము లయినందున, యీ మాటను వూపిరితిత్తుల విషయం చర్చిస్తున్నప్పుడు వైద్య పరిభాషలో వాడతారు. అందుకనే వూపిరితిత్తుల ఇన్ఫ్లమేషనును నెమోనియా అంటారు. "గేస్ట్రియం" అంటే జీర్ణాశయము (కడుపు). ఈ నరమునే "వేగస్" నరము అని కూడా అంటారు. (Vagus) తక్కిన శిరోనరములు, శిరస్సులో ఉన్న భాగములకు సంబంధించి ఉంటే యీ నరం శిరస్సులో ఆరంభించినా శిరస్సుకు అవతల ఉన్న భాగములలో స్పర్శాదులకు ఈ నరం కారణం. ఈ నరం కంఠస్వరం ఉత్పత్తి అయ్యే 'లేరింగ్సు' (Larynx) (శబ్దపేటిక)కు, వూపిరి తత్తులకు, లివరుకు, కడుపుకు పోతోంది. వేగస్ నరములో కొన్ని భాగములు హృదయానికి పోతవి. వేగస్ నరంలో వ్యాధి గాని దానికి యిరిటేషన్ గాని హృదయ స్పందనాన్ని హృదయస్పందన వేగాన్ని తగ్గిస్తుంది. కంఠానికి ఇరువైపుల ఉన్న గాడిలో ఈ నరం ఉంటుంది. పీక పిసికినప్పుడు, ఉరి వేసినప్పుడు శీఘ్రంగా మరణం సంభవించడానికి యిదే కారణం. ఈ నరము అతి ముఖ్యమైనది. ప్రాణాధారకమైనది. అనేక అవయువములలో కండరముల సంకోచ వ్యాకోచములకు, స్పర్శాది అనుభూతులకు కారణమైనది. ఇటువంటి నరము మెడుల్లా అబ్లాంగేటా నుండి ప్రారంభ మవుతున్నది. జీవితానికి ఆధారభూతము లయిన హృదయస్పందనం ఉచ్ఛ్వాస నిశ్వాసములు, జీర్ణక్రమం యీ నరం ఆరోగ్యం మీదనే ఆధారపడ్డవి. అజీర్ణం చేసినప్పుడు, పొట్ట ఉబ్బినప్పుడు, పైత్యం చేసినప్పుడు వూపిరాడనట్లు, వాంతి వచ్చినట్లు, తల తిరిగినట్లు, మూర్ఛ వచ్చినట్లు ఉండడం చాలా మంది అనుభవించి ఉంటారు. అందుకు కారణం యీ నరం ద్వారా ఇన్ని అవయువములు సంబంధం కలిగివుండడం వల్లనే శరీరానికి పడని పదార్థ తిన్నప్పుడు వూపిరితిత్తులు బిగుసుకుపోయే ఉబ్బసం ఏర్పడడానికి కారణం యిందువల్లనే నని అనుకోడానికి వీలున్నది. ఈమధ్య ఆంధ్రదేశంలో అనేక

మంది ప్రాణాలను కబళించిన పోలియో వ్యాధిలో ఒకరకం యీ మెడుల్లా అబ్లాంగేటాలో వ్యాధి ఏర్పడి యీ నరములు వ్యాధిగ్రస్తము లయినవి. పోలియో మయెలైటిస్‌లో గాని, ఈ ప్రదేశ మును వ్యాధిగ్రస్తము చేసే మరే వ్యాధిలో గాని, అతిశీఘ్రంగా ప్రాణమోసం కలగడం యీ నరం వ్యాధిగ్రస్తమైనందుననే. ముచ్చెలగుంటకు ఎదు రుగా మెడుల్లా అబ్లాంగేటా ఉన్నది. అందుకని అక్కడ దెబ్బ కగిలితే చాలా ప్రమాదం. వేగస్ నరం, ముఖ్యంగా సెన్సరీ నరము.

11 వ జత మెడలో ఉన్న కొన్ని కండరముల కదలికకు సంబంధించినది.

12 వ జతలో నరముల హైపోగ్లాసల్ నర ములు అంటారు. గ్లాసల్ అంటే నాలుకకు

## మనమూ-మనదేహస్థితి

సంబంధించిన అని అర్థము. హైపో అంటే క్రింద వున్న అని అర్థము. నాలుకను కదిలించే కండరము లన్నింటికీ యీ నరంపోతుంది. అందువల్ల మాట లాడడం రీత్యా యీ నరమూ అతి ముఖ్య మైనదే.

పై విషయాలు అర్థం చేసుకుంటే మెదుల్లా అబ్లాంగేటాకు, మాటలకు ఎంత సంబంధ మున్నదో అర్థమవుతుంది.

మెడుల్లా అబ్లాంగేటా క్రిందిభాగం వెన్ను పూసల మధ్య ఏర్పడిన ద్వారం కూడా క్రిందికి పోతుంది. వెన్నుపూసల మధ్య నుండి పోయే భాగ మును వెన్నుపాము (Spinal cord) అంటారు. కాండములో ఉన్న కండరముల సంకోచ వికోచ ముల ఉచ్ఛ్వాస నిశ్వాసములో చాలా సహాకరిస్తవి. శబ్దపేటికలో నుంచి గాలి బయటికి వచ్చినప్పుడు గాని శబ్దోత్పత్తి కాదు. అక్కడ ఉద్భవించిన శబ్దం నాలుక అంగిలి చలనములవల్ల అనేక శబ్ద ములుగా మారి మాటలు ఏర్పడుతున్నవి. అందు వల్ల మాటలనుగురించి తెలుసుకోవాలంటే శబ్ద పేటిక నిర్మితిని గురించి కొద్దిగా, వెన్నుపామును గురించీ తెలుసుకోవాలి. ఆ విషయాలు వచ్చే వారం చర్చిస్తాను. 

# సన్నిహిత బంధువర్గంలో వివాహాలు

సి. అన్నపూర్ణ

ఇంతటి ఆంతరంగికమైన కుటుంబ విషయాన్ని ఇంత బహిరంగంగా ప్రముఖ పత్రికలో చర్చించడం ఇదే మొదటిసారి అనుకొంటాను

అయితే నిత్యజీవితంలో ఎప్పుడో ఒకప్పుడు తీవ్రంగా ఆలోచించి పరిష్కరించుకొనవలసిన ప్రధాన సమస్యలలో సన్నిహిత బంధువర్గంలోని సంబంధమును చేసుకొనడము సమంజసమా ? కాదా ? అనేది ఒకటి సాధారణంగా అనేక కుటుంబములలో మేనరికమో లేక ఇతరత్రా దగ్గర సంబంధమో ఉండడం సంభవిస్తుంది సర్వసాధారణముగా అలాంటప్పుడు జరిగే దేమిటంటే వధూవరుల తల్లిదండ్రులలో ఒకరు "నాకంఠంలో ప్రాణం ఉండగా ఈ సంబంధం జరగడానికి వీలులేదు" అని, రెండవవారు "జరిగి తీరాలి" అని ప్రతిజ్ఞలు పూని గృహ రాజకీయ రంగంలో ప్రచ్ఛన్నయుద్ధాన్ని ఆరంభిస్తారు తరువాత పరిణామాలు మీకు తెలిసినవే.

అందువలన ఎంతటి ఆంతరంగికమైన దైనప్పటికి, ఈ విషమ సమస్యను బహిరంగముగా చర్చించి ఏవో కొన్ని స్థిరమైన అభిప్రాయాలకు వచ్చి అటువంటి పరిణామాలు ఉద్భవించకుండా అరికట్టడం అందరకు శ్రేయోదాయకమే

వివాహ విషయం అత్యంత బాధ్యతాయుతమైనది ఈ బాధ్యతను నిర్వహించడానికి సహనం, విషయ వివేచనాశక్తి, దూరదృష్టి, దృఢ నిశ్చయం అవసరం ఏవో ఆవేశాలకు తాత్కాలిక ఉద్రేకాలకు వశులమై మన విధిని మరచి జీవితాలను దుఃఖమయం చేయరాదు వివాహ విషయమై ఒక నిర్ణయమునకు వచ్చేముందు అనేక అంశాలను ఆలోచించవలసి ఉంటుంది సమగ్రమైన పరిశీలన లేనిదే ఒక నిర్ణయానికి రావడం అభిలషణీయం కాదు.

ఈ దృష్టితో చూస్తే కేవలం సాన్నిహిత్యాన్ని బంధుత్వాన్ని ఆధారం చేసుకొని ఒక సంబంధాని, స్థిరపరచడం అంతగా వివేకవంతం కానేరదు అలాగని పూర్తిగా బాంధవ్యాలను త్రెంచుకోవాలని కాదు బాంధవ్యం తప్పక ఆదరణీయమైనదే బంధువుల యెడల ప్రత్యేక ప్రేమను కలిగి ఉండడం తప్పుకాదు. సన్నిహిత బంధువర్గంలోని సంబంధం చేసుకుంటే అనేక లాభా లున్నాయి వధూవరు లందలి మంచిచెడ్డలు, శీల స్వభావాలు, మనస్తత్వాలు చక్కగా గ్రహించడానికి వీలుపడుతుంది. సహజమైన బంధుప్రేమ, ఒకవిధమైన ఆత్మీయత, బాల్యస్నేహము మనకు లభ్య మవుతాయి. కావలసినవారే కనుక వివాహ విషయంలో కొద్దిగా లోటుపాట్లు సంభవించినా, సర్దుకుపోవడానికి అవకాశం ఉంటుంది ఒకరి స్థితిగతులను గురించి మరొకరికి పూర్తిగా తెలుస్తాయి కనుక వివాహం అయిపోయిన తరువాత పొరపాటు చేసేమే అని విచారించవలసిన అవసరం కలుగదు అందువలన సన్నిహిత బంధువర్గంలోని సంబంధాన్ని గుడ్డిగా త్రోసివేయకూడదు మిగతా విషయాల మాట ఎట్లా ఉన్నా 'దూరపు కొండలు నునుపు' అన్నట్లు ఇంట్లో సంబంధాన్ని త్రెంచుకొని, మనసులు పాడు చేసుకుని ఎండమావులవెంట పడేవారు చాలామంది ఉన్నారు బంధువులలో సంబంధానికి తప్పక ప్రాధాన్యం ఇవ్వాలి కాని నేను చెప్పబోయే దేమంటే కేవలం బంధుత్వాన్నే ఆధారం చేసుకొని వివాహ సంబంధాలపై నిర్ణయాలను రూపొందించుకొనరాదు బంధుత్వానికి తగిన ప్రాధాన్యం ఇస్తూనే, దాని హద్దులను కూడా మనసులో ఉంచుకోవాలి వివాహం ముందు ఆలోచించవలసిన అనేక విషయాలలో బంధుత్వం అనేది కేవలం ఒక అంశం మాత్రమే నని మనము మరచిపోరాదు ఏ అంశానికి ఎంత ప్రాధాన్యం ఇవ్వాలో అంతే ఒసగాలి అయితే మిగిలిన ముఖ్యాంశాలలో ఒకటి రెండింటిని పరిశీలిద్దాం

మన పిల్లల మనస్తత్వాన్ని అర్థం చేసుకొనడం అత్యంత ప్రధానమైన విషయం. అనేకమందికి అనేకవిధములయిన మనస్తత్వాలు ఉంటాయి వివాహంలో వధూవరుల మనస్తత్వాలు విభిన్న ధృవాలైతే వారి వైవాహిక జీవితం సుఖప్రదం కాజాలదు కాని చాలామంది తలిదండ్రులకు తమ పిల్లల మనస్తత్వాన్ని గ్రహించే నేర్పు కాని అభిలాష కాని ఉండవు గ్రహించవలసిన ఆవశ్యకత కూడా కనబడదు నేటి కాలంలో మనస్తత్వ శాస్త్రం బాగా అభివృద్ధి పొందింది. వైవాహిక జీవితం ఆనందదాయక మయేందుకు ఈ మనస్తత్వాలు ఎంత ముఖ్యమైన పాత్రలను ధరిస్తాయో అనేకమంది శాస్త్రజ్ఞులు తమ గ్రంథాలలో తెలియజేసేరు. అయితే మనం అవన్నీ కూలంకషంగా చర్చించడానికి సమర్థులము కామనుకోండి కాబట్టి కనీసం స్థూలంగానైనా పిల్లల నైజ తత్వాలను గ్రహించి వారికి తగిన సంబంధాలను చేయడం మంచిది అధమపక్షం వారి వారి అభిరుచులనైనా తెలిసికొనడం అవసరం ఉదాహరణకు పిల్లవానికి కళాప్రియత్వం అధికంగా ఉంటే, బాలికకు కనీసం కళా విముఖత్వం లేకుండానైనా చూడాలి సంగీతం, నృత్యం, చిత్రకళ మొదలైన వాటియందు అభిరుచి ప్రావీణ్యం కల అమ్మాయిని తీసుకువెళ్లి కళలంటే కళ్లు మూసుకునే అరసికుని కిచ్చి వివాహం చేయరాదు అలాగే సంఘ సంస్కర్త అవుదామనే యువకునికి పూర్వాచార పరాయణురాలైన యువతిని వివాహం చేస్తే ఫలితం అసహజంగా ఉంటుంది కాబట్టి మన పిల్లల అభిరుచులను, మనస్తత్వాలను కనీసం చూచాయగానైనా గ్రహించి, వివాహ నిర్ణయాలలో తదనుగుణంగా వర్తించడము అన్ని విధాలా శ్రేయోదాయక మైనది

మరొక విషయాన్ని కూడ యిక్కడ జ్ఞాపకం పెట్టుకొనవచ్చు యువతీ యువకులలో సహజ మనస్తత్వాన్ని మార్పు చేయడం కష్టమే అయినా వారిలోని లోపాలను, అలవాట్లను సరిదిద్దే విధంగా వ్యవహరించి వివాహాలను చేయవచ్చును ఈవిధంగా పరస్పర సమన్వయత్వం సాధింపబడి గృహస్థ జీవనం ఉదాత్తంగా సాగిపోయేట్లు చేయవచ్చును. ఉదాహరణకు వరుడు బాగా దూబరాగా ఖర్చు చేసేవా డయితే, అతనికి పొదుపరితనంకల వధువునిచ్చి వివాహం చేస్తే కుటుంబం ఆర్థికంగా బాగుపడి, ఒకరి ప్రభావం ఒకరిపై పడి, సమస్థితిని చేకూర్చగలదు అలా కాక ఇద్దరూ కూడా విరివిగా ఖర్చు చేసేవారే అయితే వారి జీవితయాత్ర సుగమం కాజాలదు కొద్దిగా సహన స్వభావం తక్కువైన యువతికి సహనశీలుడైన యువకుణ్ణిచ్చి వివాహం చేయవచ్చును ఈవిధంగా చేస్తే ఒకరి లోపాలు ఒకరు సరిదిద్దుకొన గలుగుతారు

వివాహ నిర్ణయాన్ని చేసేముందు పరిశీలించవలసిన ముఖ్యాంశం మరొకటుంది నిన్న మొన్నటి వరకు పెద్ద వయస్సు రాకుండగనే వివాహాలు చేసేవారు అందువలన వివాహ సంబంధాన్ని గురించి బాధ్యతంతా పూర్తిగా పెద్దలపైనే ఉండేది చిన్నతనంలోనే వివాహం చేయడంవలన నాటినుండి ఒకవిధమైన బాంధవ్యం, స్నేహం ఏర్పడి యౌవనోదయం అయ్యేసరికి వారి నడుమ ప్రగాఢమైన ప్రేమ పరిణతి నంది వారి జీవితాలు శుభప్రద మయేవి అయితే నేడు బాల్య వివాహాలు చాలా అరుదు నేడు వివాహాలు బాల బాలికలకు కాదు యువతీ యువకులకు వారికి వ్యక్తిత్వం ఏర్పడి స్వతంత్రంగా అభిప్రాయాలను రూపొందించుకొనగల వయసు వచ్చిన తరువాతనే వివాహ ప్రసక్తి వస్తోంది కాబట్టి నేటి పరిస్థితుల దృష్ట్యా, వారి ఉద్దేశ్యాలకు కూడా తగిన ప్రాధాన్యత నొసగాలి వారి అభిప్రాయాలు అనుభవశూన్యములైనవి కావచ్చును అయినప్పటికి వాటిని పూర్తిగా విని సమయోచితంగా ప్రవర్తించాలి తమ వ్యక్తిత్వాన్ని నిర్లక్ష్యం చేసినట్లు మన పిల్లలు భావించే విధంగా మనం సంబంధాలను స్థిరపరచరాదు సాధ్యమైనంతవరకు వారి అభిప్రాయాలకు తగిన విలువ నీయాలి

ఈవిధంగా వివాహసంబంధ నిర్ణయ విషయంలో ఏమి చేసినప్పటికి మన పిల్లల భవిష్యత్తును

(54 వ పేజీ చూడండి)

# తారక

్రార్పే కాసేపు యిప్పుడే వస్తా.

కృష్ణమూర్తి నారాయణ సమాధానం వినకుండా చరాచరా వరండాలోకి ్రపోయినాడు

నారాయణ అతను వెళ్లినవేపు కాసేపు చూచి"ఊ!" అని నిట్టూర్చాడు ఆ తర్వాత రుమాలుతో మొహం తుడుచుకున్నాడు చమటలో చొక్కా తా తడిసింది చొక్కా కాలరు పట్టుకుని, దేహానికి అతుక్కున్నషర్టునికాస్త ారంగావుంచి వూదుకున్నాడు

నారాయణకు, ఆ గదిలోవుంటే జన్మాంతరశిక్ష విధించినవాడిలా ఫీలయ్యాడు. ఆ గదికి ఒకే ఒక కిటికీ, అది పాతది రంగూ,రిపేరూ లేక డొక్కుపోయి ్లున్న ఆ కిటికీలోంచిదూరంగా తాటితోపు, వాటి వెనుక పాడుబడ్డ ్లా లీలగా కనుపిస్తున్నయ్ ఆ మిట్టమధ్యాహ్నపు ఎండలో కిటికీకిఆనుకుని, ిరాళ్ళ వాటవతల, సున్నపు గాను గగానుగరాయిమీద క ఒగోరింకదానికెదురు ్ని కృష్ణఇనుకదిబ్బ వున్నాయి మిగతా (గౌండంతా నానా జాతి మొక్కలతో డివుంది యిహ పైకప్పు బెచ్చికలూడి, ఖూజాతో ఏ క్షణాన్నైనానెత్తిమీద ాపడే అవకాశముంది గోడలూ అలాగే వున్నాయి అలాంటి గదిలో ఓ చావదాని ుకుని గదిని రెండుగా విభజించే బీరువాలు,అవతల హెడ్మాస్టరు ఆఫీసుగది, ాయణ కూర్చున్నదేమొ మిగతా టీచర్ల వెయిటింగ్ రూము బీరువామీద ి యిండియన్ మేపులు, గ్లోబ్ యింకాఏవేవో సరంజామా వున్నాయి.

"ఇలాంటిచోట కృష్ణ ఎలా వుంటున్నాడో అన్నఆశ్చర్యం నారాయణ ్తిష్కంలో మెదిలింది దానితోపాటే కృష్ణమూర్తి ఎందుకిక్కడ అజ్ఞాత ం చేస్తున్నాడా, యిప్పుడు తా నొచ్చినపనిఏమిటో జ్ఞప్తికొచ్చే ి ఎలాతనొచ్చినపనిసాధించి, విజయం చంకన పెట్టుకుపోవటమా ) ఆలోచనాకలిగింది.



"నన్ను కాపాడండి మూర్తిగారు... కాపాడండి... మీకు పుణ్యముంటుంది..." అని ఆమె కృష్ణమూర్తి కాళ్ళను చుట్టేసుకుంది. ఆ ఆక్రందనంలో గుండెలుపిండేశక్తి, హృదయాలను ద్రవీభూతమొనర్చే ప్రభావం ఉన్నాయని అతనికితోచి......

గుంటూరులో బయలుదేరింది మొదలు యిక్కడకు చేరేంతవరకూ ఎడతెగకుండా ఆలోచించాడు కానీ యిదమిద్ధంగా ఓనిర్ణయానికి రావటానికి అతనికి శక్తి చాలలేదు. అయినా కొంతలో కొంత నిర్ణయం చేసుకుని, వాణ్ణి చూడంగానే, గంభీరంగా "రూముకు పద మాట్లాడాలి!" అనటం, రూము కెళ్ళింతరువాత ముక్క చివాట్లు వెయ్యటం, అప్పటికీ వినక, దారికి రాకపోతే, ఆఖరి అస్త్రం వుండనే వుంది హెడ్మాష్టరుకు విషయమంతా చెప్పి, ఉద్యోగం వూడగొట్టడం యిదంతా నారాయణకు, కృష్ణమూర్తిమీద ద్వేషంవల్లగాదు, వాడిమీద అభిమానం వల్ల అని సమాధానపరచుకున్న నారాయణకు, హెడ్మాష్టరా వూళ్ళో లేడని, కృష్ణమూర్తి తననుచూసి ఏమీ గాభరా భయం లేకుండా "కూర్చో కాసేపు, యిప్పుడే వస్తా" అని సమాధానం గూడ తీసుకోకుండా చాక్‌పీస్, డస్టరుతో వరండాలోకి వెళ్ళిపొయ్యేసరికి, పామును తొక్కినంత గందరగోళం చెందాడు

చాపమీదనుంచి లేచివెళ్ళి , వాకిలి ప్రక్కగావున్న కూజాలో నీళ్ళు త్రాగేసరికి, మనసు కుదుటపడ్డది దాంతోపాటే అదే క్షణంలో ఆఫీసురూంలోకి ప్రవేశించిన మరో ఉపాధ్యాయుణ్ణి చూసేసరికి ప్రాణం లేచి వచ్చింది

తన్ను తాను ఎరుకపరచుకుని, తనొచ్చిన కార్యాన్ని గురించి, క్లుప్తంగా ఎదటివాడి చెవినవేసి, ఉపాయం తరుణోపాయం చూపమని అడిగాడు నారాయణ

ఎదటాయన సులోచనాల లోచనాలను కప్పుకేసి సారించి, క్షణం యోచించి, నారాయణను పరికించి "చాలా కష్టంసార్! మీ పనిగావటం ఎందుకంటారేమో, కృష్ణమూర్తంటే యిక్కడ స్టాఫ్‌లోనూ, కమిటీలోనూ మంచి పేరుంది అలాంటి వాడిని మీ వ్యక్తిగత కారణాలకోసం వదులుకోరు, ముఖ్యంగా కమిటీవారు అయినా కృష్ణమూర్తిలో అంత చెడ్డగుణం, తనం ఏమిలేవే" అని అన్నాడు

అసలే నీళ్ళు నములుతున్న నారాయణకు, నోరు రాడలేదు ఆయన మాటల వల్ల

"అది సరేననుకోండి, ఆ అమ్మాయి సంగతేమిటి? అది చెప్పండి?"

"ఆ అమ్మాయివాళ్ళ మేనమామ యింట్లో కృష్ణమూర్తి అద్దె కుంటున్నాడు ఆ అమ్మాయి సంవత్సరమైంది యిక్కడి కొచ్చింది

"అది గాదండీ! ఆ అమ్మాయికీ వీడికీ అలా అనుకున్న వాళ్ళ పురుగులు పడి చస్తారు"

మీకు మిత్రుడంటున్నారు అతగాడు అమాత్రం అర్థం చేసుకోలేకపోయినారంటే అతన్ని ఆశ్చర్యమే"

యింక మాట పెగల్లా నారాయణకు యింత కట్టుదిట్టంగా కృష్ణమూర్తి నింద మీదపడకుండా బ్రతుకుతున్నాడంటే క్రొత్తచోట నారాయణకు భయం పుట్టింది తానూ పరాజయం చెందాలేమోనని

అయినా కానియ్ పరిస్థితులెలా ముందుకుసాగుతయ్యో చూద్దాం అని గుండె గట్టిపరచుకున్నాడు

పిరియడ్ అవంగానే వ్యాసుచేత ఎక్సర్‌సైజు పుస్తకాల కట్ట మోయించుకుని, కృష్ణమూర్తి వచ్చాడు

చాపమీద సాగదీసుకు కూర్చున్న నారాయణను చూసి "ఏరా, అలా కూర్చున్నావ్. లే రూంకి వెళ్దాం అనన్నాడు.

వస్తూ వస్తూ ఆ సంచి అక్కడపెట్టెయ్. వ్యాన్ తెస్తాడులే అనన్నాడు కృష్ణమూర్తివెంట నారాయణ గదికి వెళ్ళాడు

కృష్ణమూర్తి నారాయణ రూము కెళ్ళేవరకు మాట్లాడనేలేదు అందుకు కారణమంటూ ఏదీ లేదు

నారాయణ మటుకు, నారాయణ వీలు చూసుకుని మొహం వాచేలా కృష్ణమూర్తిని చివాట్లు పెట్టేద్దామనుకున్నాడు అతగాడు ఆ సమయం కోసమే చూస్తున్నాడు ఇహపోతే కృష్ణకు, నారాయణ ఎందుకొచ్చాడో, ఏంచెప్తాడో అన్నీ క్షుణ్ణంగాగా తెలుసు అందువల్ల అతడెలాగో తానై చర్చను ఆరంభించడు

రూము కెళ్ళంగానే "క్రింద దొడ్లో బావి వుంది వెళ్ళి మొహం కడుక్కు రా నేనీలోపల అన్నం పెడతాను" అని అన్నాడు

నారాయణ మెట్లు దిగి, బావి దగ్గర కెళ్ళాడు మొహం, కాళ్ళూ, చేతులూ కడుక్కుని తలెత్తేసరికి, ఎవరో అమ్మాయి ఆదరా బాదరా చేతిలో బక్కెట్, అలాగే వదిలేసి, యింట్లోకి వెళ్ళిపోయింది బకెట్ క్రింద దణేల్‌మన్న చప్పుడుకు నారాయణ తలెత్తి చూశాడు ఆమె వాలుజడనీ, వంపులు తిరిగి, అందంగావున్న ఆమె దేహం వెనుక భాగాన్ని చూశాడు

"ఫరవాలేదు! మంచిదాన్నే మిగతామాట, ఈర్ష్యతో కలిసిపోయింది కానీ అతనికి అర్థంగాంది, ఆమె ఎందుకంత గాభరాగా వెళ్ళిందా అనే!

తను క్రొత్తమనిషిగా బట్టి, ఎదటకు రావటానికి బిడియపడి, భయపడివుండొచ్చు! కానీ ఆమె వెళ్ళిపోయిన ధోరణిమాత్రం అలా భావించటాని కతనికి, అవకాశమివ్వలా

నేరుగా మెట్లెక్కి గదిలో కెళ్ళాడు

"క్రింద ఎవరో అమ్మాయివుంది ఎవర్రా?"

"ఇంటివాళ్ళ అమ్మాయి" అని కృష్ణమూర్తి నారాయణ మొహాన్నొకసారి తేరిపార చూశాడు

రెండు అరిటాకుల్లో, క్యారేజీ భోజనం వడ్డించాడు కృష్ణమూర్తి రెండు గ్లాసులతో మంచినీళ్ళు, ప్రక్కనే కూజా! అవతలగా క్యారేజీ గిన్నెలూ!

"నేనొస్తున్నానని ముందే తెలిసిందా ఏమిట్రా డబల్ క్యారేజి తెప్పించావ్?" తనముందున్న ఆకును దగ్గరికి లాక్కుంటూ అడిగాడు

"కాదు, రెండు పూటలకు ఒకేసారి తెప్పిస్తా"

కృష్ణమూర్తి ప్రవర్తన, మాటల తీరు, అతని ముభావం బొత్తిగా రుచించలా నారాయణకు కానీ తను సాధించాల్సిన కార్యభారాన్ని తల్చుకుని సహించని కందకూరను స్థైతం గ్లాసెడు మంచినీళ్ళతో సహా మింగేసి "ఈ అవస్థదేనికిరా? శుభ్రంగా కలుమింటికోతిని కట్టుకుని కమ్మగా కూర, నార వండించుకు తినక ఈ హోటలుతిండీ, కాని వూరు నాకేం నచ్చలా" నారాయణ కృష్ణమూర్తి మొహాన్ని అవలోకించాడు, ఏమన్నా వింటున్నాడా లేదా తన మాటలని

"చూడు నారాయణా, ఇప్పుడా ప్రశంస ఆపేస్తే ఏమన్నా ప్రమాదమా! భోజనం చేసేప్పుడు నా కిలాంటివి నచ్చవు సాయంత్రం స్కూలునించి వచ్చాక తీరిగ్గా మాట్లాడుకుందాం ఏం?

వెలక్కాయపడ్డట్లు, గొంతు దిగలా నారాయణకు "అలాగే" అని గొణుక్కున్నాడు

కృష్ణమూర్తి స్కూలుకు వెళ్ళాక, కుర్చీలో కూర్చుని ఏదో ఆలోచిస్తున్నాడు నారాయణ. మొత్తానికి ఈ అమ్మాయి మందో మాకో పెట్టి, వీణ్ణి పూర్తిగా స్వాధీనపరచుకున్నదన్న నిర్ణయానికి, నారాయణ వివిధ విషయాలనూ క్రోడీకరించసాగాడు

మెత్తని అడుగుల చప్పుడు, ఆపైన "అన్నయ్యా!" అన్న తియ్యనిపిలుపు వినపడేసరికి, నారాయణ ఆశ్చర్యపోయి దొన్నుంచి తేరుకుని, వాకిలి దగ్గరకు వెళ్ళేసరికి సరిగ్గా యిందాక చూసిన అమ్మాయే తిరిగి మెట్లుదిగి వెళ్ళటం చూశాడు నారాయణ

"ఎవరు కావాలండీ?" తన్నే పిలిచిందేమోనన్న నమ్మకంతో అడిగాడు నారాయణ సమాధానం రాకపోగా ఆ అమ్మాయి త్వరత్వరగా మెట్లుదిగి వెళ్ళిపోయింది

నారాయణ తలకాయ, మిరాయి పొట్లపు కాయితంలా అయింది

ఆ తర్వాత చాలాసేపు వితర్కించుకున్నాడు. ఆ అమ్మాయిని గురించి కృష్ణమూర్తిని గురించీ.

ఆ అమ్మాయికీ వీడికీ గల అనుబంధ మేమిటి? తను బయలుదేరేప్పుడు తన మేనత్త కృష్ణమూర్తితల్లి అన్నమాటలు యింకా మెదులుతూనే వున్నయి!

"నాయనా! ఆ మహాతల్లి ఎవరోగానీ, ఉన్న ఒక్కగా నొక్కణ్ణి బుట్టలో వేసుకుంది మీ మావయ్యపోతే మాట్లాడనేలేదుట, వాడు సరిగ్గా! నా కంతా అయోమయంగా వుంది అంతా నీదే భారం! అని చెప్పింది

తాను ఎంత ఆత్మధైర్యంతో బయలుదేరాడో, అంతా తేలిపోతున్న దాధైర్యమంతా యిక్కడి వాతావరణం చూసిం తర్వాత! ఏం చెయ్యాలో పాలుపోవటంలేదు నారాయణకు

తిరిగి గదిలోకెళ్ళి ఆలోచిస్తూనే, వళ్ళు విరుచుకుని నిద్రలోకి జారిపోయాడు.

తిరిగి కళ్ళు తెరిచేసరికి, కిటికీలోంచి ఎండ మీద పడుతోంది కృష్ణమూర్తి ఎవరో పాపాయిని ఆడిస్తూ వున్నాడు బయట

నారాయణ లేచివెళ్ళాడు

"ఎవర్రా ఈపాప!"

"క్రిందవాళ్ళ పాప! బావుందిగదూ!"

నారాయణకు మాట పెగల్లా, ఏం సమాధానం చెప్పాలో తోచలా.

"నాకు తెలియక అడుగుతాను నీ వరసేం బాగా లేదు—"

"ఏం?"

పెళ్ళికాకుండానే ప్రేమలూ, పిల్లలూ మనుగుడుపులూ! ఏమిటివన్నీ! ఆ అమ్మాయికీ నీకూ ఏమిటీ సంబంధం ఈ పాప నీ పాపగదూ, కలికాలం లోకం నోరు కప్పలేవు, కృష్ణమూర్తీ. అయినా ఆ పిల్లకుమటుకు సిగ్గు, మానాభిమానా

"నారాయణా!"

ఆ కేకకు అదిరిపోయినాడు నారాయణ క్షణం సేపు నవనాడులూ మెలిచుట్టుకున్నట్లయింది. కోపంతో, కసితో వణికిపోతున్నాడు కృష్ణమూర్తి మొహమంతా ఎర్రబడి, కళ్ళు నిప్పుకణికెల్లా మండుతున్నయ్! కృష్ణమూర్తికేకకు చేతిలోవున్న పాప కెవ్వుమని అరచి, ఏడుపు లంకించుకుంది

కాసేపటికి తేరుకుని నువ్వూ నన్ను అపార్థం చేసుకుంటావనుకోలేదురా! జరిగిందేదో జరిగింది, ఆ ప్రసక్తి ఎప్పుడూ తేకు నా దగ్గర"

దబదబా మెట్లు దిగి, క్రిందకు వెళ్ళాడు కృష్ణమూర్తి

నారాయణకు కృష్ణమూర్తి కోపం చూసేసరికి పరిస్థితులు తాను వూహించిందానికంటే ముందుకు వెళ్ళినయ్యని గ్రహించాడు

వెళ్ళిన కృష్ణమూర్తి చాలాసేపు క్రిందనే వున్నాడు ఎందుకంతసేపుదాకా రాలేదో నారాయణకు అర్థంగాలా! అలాగని అడగదలచుకోలా!

కృష్ణమూర్తి వస్తూనే "అలారా కృష్ణవేపు కెళ్దాం, నీతో మాట్లాడాలి" అనేసరికి, మరీ ఆశ్చర్యపోయినాడు.

ఇద్దరూ కలసి కృష్ణనది ఒడ్డుకు వెళ్ళి, యిసుకలో కూర్చున్నారు.

తనకూ ఆ అమ్మాయికీ ఎలా ప్రేమ ఏర్పడిందీ, తాను చేసిన బాసలూ అన్నీ చెబుతాడనుకున్నాడు నారాయణ ఆఖరికి "నీ చెల్లెల్ని చేసుకోలేదని, బాధపడకు నేనేంచేసేది చెప్పు!" అని అంటాడని అనుకున్నాడు నారాయణ

కాని

"సుగుణ నీకు తెలుసా?" అని కృష్ణమూర్తి అడిగేసరికి, నెత్తిన పిడుగుపడ్డట్లు చలించాడు.

"ఏ సుగుణ?"

"అదే నీవు ప్రేమించి, పెళ్ళిచేసుకుంటావని నమ్మించి, ఆమె మానాన్నీ, గౌరవాన్నీ నాశనం చేశావే ఆ సుగుణ?" అని ఆగి, "ఇప్పటికీ అర్థం గాలేదా ఇంకా వివరాలు కావాలా?" అని ప్రశ్నించాడు, కృష్ణమూర్తి

"ఇవన్నీ నీకెలా తెలుసు?

"నువ్వే అన్నావుగా ఇంతకుముందు, కలికాలం లోకంకళ్ళు కప్పలేమని!"

# సుగుణ

నారాయణ తికమకపడ్డాడు ఊపిరాడలా

"అదంతా పీడకల కృష్ణా! దానికి నేను చాలా పశ్చాత్తాపపడుతున్నా"

"నీ పశ్చాత్తాపమెలాటిదో తెలుస్తూనేవుంది నారాయణ! ఆ అమ్మాయిని ఖర్మకు వదిలేసి, మళ్ళీ ఇంకొక అమ్మాయిని చేసుకోటానికి సిద్ధపడతున్నావ్? అంతేగదూ!"

నారాయణ వింటూ కూర్చున్నాడు అచేతనంగా

"సుగుణ అంతా చెప్పింది, నారాయణా నాకు ఆమెనెలా వంచించిందీ, ఆమె నే పరిస్థితుల్లో వదిలేసిందీ అంతా చెప్పింది చూడు నారాయణా, చదువు, సంస్కారం, లోకజ్ఞానం కలవాళ్ళము మనమే ఇలా అడ్డదారులవెంట నడుస్తుంటే ఎలా చెప్పు"

"కానీ ఆమె నన్ను వంచించింది అదీ తెలుసా నీకు కృష్ణా! ఆ విషయమూ చెప్పిందా?" నారాయణ కంఠం రుద్ధమైంది గుండెల్లో కలవరం బయలుదేరింది

"చెప్పింది నారాయణ చెప్పింది ఆమెతల్లి లేచిపోవటానికీ, పతితకావటానికీ సుగుణదా బాధ్యత"!

"కాకపోవచ్చు వేపచెట్టుకు మంచినీళ్ళుపోస్తే చేదు మారుతుందా?"

"అవు నల్లనైతే, పాలూ నల్లనౌతాయా! పోనీ ఒక్కటి చెప్పు! సుగుణ సాంగత్యంవల్ల! ఆమెలో ఏమైనా పొరపాటు చూశావా! మొదటే ఆమె, తన తల్లిచరిత్ర చెప్పలేదు నిజమే కనీసం నువ్వైనా అడిగావా?"

"మొదట తెలియదుగా!"

"సుగుణకూడ అలాగే అనుకుంది నీ మనస్తత్వం తెలియక ఆమె తప్పుదారి తొక్కింది. నీవింత యిరుకుగా ఆలోచిస్తావని ఆమెకేం తెలుసు?"

కాసేపు ఎవరూ మాట్లాడలేదు నారాయణలో గతస్మృతులు అలలు కదిలినయ్!

కృష్ణమూర్తి దూరాన కనిపించే లంకలవేపు కొద్దిదూరంలో అలలతో సతమతమయ్యే నీలినీళ్ళ వేపు చూస్తూ కూర్చున్నాడు.

నారాయణ కాసేపు ఆలోచించుకుని, "మూర్తీ, ఒక్కమాట అడుగుతా ఏమనుకోకు. మా చెల్లాయిని చేసుకుంటావని అన్నావుట అది తేల్చుకోవటానికే వచ్చింది నేను మీ అమ్మా నాన్న గూడ నీ నిర్ణయంకోసమే ఎదురుచూస్తున్నారు

"నే నెప్పుడో నిర్ణయించుకున్నాను!"

"అదేమిటో చెప్పరాదూ!"

"చెప్పేవాణ్ణే కానీ ఓవిషయం ఆలోచించు నారాయణ! నీ చెల్లెలు భవిష్యత్తుకోసం నీవెంత ఆరాటపడుతున్నావో, నాచెల్లెలు భవిష్యత్తును గురించి నా కంత ఆసక్తి ఆత్రుత వుంటుందిగా!"

నారాయణకు కృష్ణమూర్తిమాటలు అర్థంగాలేదు "కాదని ఎవరన్నారు! . నాకు తెలియనిచెల్లెలు నీ కెవరున్నారు?"

"ఒక కడుపున పుట్టకపోవచ్చు అంతమాత్రాన చెల్లెలుకాకుండా పోదుగా! ఒకనాటి రాత్రి క్రిందనుంచి ఒక స్త్రీ ఆక్రందన వినిపించింది. ఆ ఆక్రందనలో గుండెలు పిండే శక్తీ, హృదయాలను ద్రవీభూతమొనర్చే ప్రభావమూ వున్నాయి. క్రిందకు వెళ్ళాను ఒక స్త్రీ తలుపులు తెరుచుకునివచ్చి నా కాళ్ళను చుట్టేసుకుంది. నాకంతా అయోమయమైంది ఎదురుగా, ఓనర్సు, ఆ అమ్మాయి మేనమామ, అత్తయ్య, భయంగా దొరికిపోయిన దొంగలమొహాలతో వున్నారు

"నన్ను కాపాడండి మూర్తిగారూ కాపాడండి .. మీకు పుణ్యముంటుంది . కాపాడండి!" అంటున్నది ఆమె

ఆమెకు అభయమిచ్చి, గదికి తీసుకొచ్చాను.

ఆ తర్వాత ఆమె చెప్పింది "మూర్తిగారూ నావాళ్ళు ఏం పాపం చెయ్యమంటున్నారో చూశారా! నా కడుపులోవున్న శిశువుకు తండ్రి లేడట అందుకని ఆ పసివాణ్ని భూమ్మీద పడకుండా చెయ్యాలని

---

సతీ సావిత్రి నాటకం చూసినపుడల్లా నా హైస్కూలు రోజులు గుర్తుకొస్తుంటవి. నా హైస్కూలు చదువంతా అనంతపురంలోనే గడిచింది. అవి నేను అయిదోఫారం చదివే రోజులు, స్కూలుడే ఉత్సవాలకు సతీ సావిత్రి డ్రామా వేద్దామని రిహార్సల్సుచేశారు. ఆరోజు రానే వచ్చింది. సావిత్రి నాటకము జోరుగా సాగిపోతోంది. పతి ప్రాణాలకోసం సావిత్రి యముడివెంటబడింది. "పతిప్రాణాలు తప్ప ఏమైనా వరంకోరుకో" అన్నాడు యముడు. వెంటనే సావిత్రి "ఆ దున్నపోతును చూస్తుంటే పొడుస్తుందేమోనని భయంగా ఉంది. దాన్ని నాకళ్లకు కనబడకుండ మాయం చెయ్యి" అంది. అది విని యముడు "అది బొమ్మ దున్నపోతులే నిజంది కాదు. భయపడద్దు" అని జవాబిచ్చాడు. వారి సంభాషణ విన్న సభికులు గొల్లుమని నవ్వారు.

ప్రభల వెంకటరమణ (సికింద్రాబాదు)

---

చూస్తున్నారు నేను, నేను ఎలా ఒప్పుకునేది నాది మటుకు స్త్రీహృదయంగదూ! నే చేసిన పాపానికి ఆ అమాయకుడికా శిక్ష! మీరే చెప్పండి వాడికి తల్లిని నేనున్నానుగా!''

ఆమె మొహంలో మాతృప్రేమ, ఆశ భయం వీళ్ళను చూసి అన్నీ వున్నాయి

ఆనాడే ఆమెకు అభయమిచ్చాను ఆమె జీవితాని కోదారి, చూపించేంతవరకూ, ఎవరెన్ని నిందలు వేసినా భయపడకుండా ఆమెను కాపాడాలని, ఆ తర్వాత ఎందరో ఎన్నో అన్నారు కానీ ఆ తర్వాత నిజా నిజాలు తెలిసి వాళ్ళే నొచ్చుకున్నారు సుగుణ నా చెల్లెలు నారాయణ! ఆమె బాధ్యత నాదే! నాబాధ్యత మరొకరు తీసుకునేవరకు మరొక స్త్రీ నెలా భాగస్వామిగా తెచ్చుకోగలను!''

నారాయణ కృష్ణమూర్తి మొహాన్ని పరీక్షగా నిశితంగా చూస్తూ కూర్చున్నాడింత సేపు

తను తప్పు చేశాడా?

కృష్ణమూర్తి పరోక్షంగా, తన తప్పును తెలియ చేస్తున్నాడా?

నారాయణకు అర్థం గాలేదు

దీపాలుపెట్టేవేళకు గుడికి తిరిగి వెళ్ళారు దారి పొడుగునా ఏవేవో ఆలోచనలు, మెదులు తూనే వున్నయ్

కృష్ణమూర్తిని దారిలో హైస్కూలు ప్యూను కనుపించి హెడ్మాష్టరింటికి పిలుచుకుపోయినాడు

నారాయణ ఒంటిగానే గదికి వెళ్ళాడు గుడ్డలు విప్పకుండానే ఆలోచనలోపడిపోయాడు దూరాన్నున్న శివాలయంలో గంటల మోత నిశ్శబ్దాన్ని చీల్చు కుంటూ, వినపడుతున్నయ్! ఎదురుగావున్న క్యాలెండర మీది పాపాయి బోసినోటితో నవ్వుతున్నాడు ఆ బొమ్మకేసి అలాగే చూస్తూ కూర్చున్నాడు

అలా ఎంతసేపు కూర్చున్నాడో తెలియదు క్రిందనుంచి, పాప ఏడుపు కరరంధ్రాలకుతాకే సరికి ఉలిక్కిపడ్డాడు

సుగుణపాప ఏడుస్తోంది కాసేపు చూశాడు ఎవరన్నా సముదాయిస్తారేమోనని ఊహూఁ పాప ఏడుపు మానలేదు

ఆ వ్యక్తంగానే లేచి క్రిందకు వెళ్ళాడు ఎవరూ వున్న అలికిడి వినపడలేదు తలుపులన్నీ బార్లా తెరిచి వున్నాయి

ఉయ్యాలలో పాప గుక్కపెట్టి ఏడుస్తున్నాడు వెళ్ళి ఎత్తుకున్నాడు ''చ్చో చ్చో చ్చో'' అని సముదాయించాడు కొద్దిగా ఏడుపు మానేడు గోడలకున్న బొమ్మలవేపు, దీపంవేపూ చూపించాడు ముద్దు పెట్టుకున్నాడు పాప బుగ్గల్ని!

పాప తన చిట్టి చేతులతో మొహాన్ని తచ్చాడుతుంటే గిలిగింతలు పెట్టినట్లైంది నవ్వాడు ''వూ వూ'' అంటుంటే పాప ''ఓందిరా!'' అని అన్నాడు

ఇవన్నీ అప్రయత్నంగానే చేశాడు పాప వళ్ళు కళ్ళని ప్రేమగా చూస్తూ, ముద్దెట్టుకున్నాడు.

''ఏడుస్తున్నాడా అన్నయ్యా యిప్పుడే వెళ్ళాను''

సుగుణ జరజరా వచ్చింది నారాయణ దగ్గరకు నారాయణ ఆమెవేపు తిరిగాడు !''

సుగుణ ఆశ్చర్యంగా, భయంగా అదోలా చూసింది నిశ్చేష్టితురాలై

నారాయణా అలాగే చూస్తూ నిలబడ్డాడు సుగుణ అందమైన మొహాన్ని, కళ్ళనీ!

సుగుణ కాసేపటికి తేరుకుంది తొట్రుపడ్తది ''మీరా '' అనంది

''అవును నేనే!''

సుగుణ కేంమాట్లాడాలో అర్థంకాలా తలొంచుకుంది

''కూర్చోండి ''

అని అవతలకు వెళ్ళింది ఆమె వెళ్ళినవేపే చూస్తూనిలబడ్డాడు నారాయణ

సుగుణ అవతలకు వెళ్ళిందిగానీ, ఆలోచనంతా నారాయణనుగురించే ఎందుకొచ్చారో? పాప కోసమా! తన కోసమా? అలా అని సమర్థించుకో లేకపోయింది! మరి?

''సుగుణా!''

ఆ పిలుపు విని ఆశ్చర్యపోయింది! తన్నేనా నిజంగా ఆయినేనా పిలిచింది! నమ్మలేకపోయింది

''సుగుణా!''

వెళ్ళింది

''సుగుణా పాప

''మీ పాపే!''

''మనస్ఫూర్తిగా అంటున్నావా సుగుణా నా తప్పులన్నీ క్షమించి, నిండు మనస్సుతో అంటున్నావా!''

''మీరు నా గురించి ఏం అపకారం చేశారని యిన్నాళ్ళూ! నా దురదృష్టాన్ని నిందించుకున్నానే గానీ, మిమ్మల్ని ఏనాడూ, మనసావాచా నిందించలేదు!''

నారాయణకు గొంతుకలో మాటలు గద్గదికమైనయి!

నన్ను పూర్వంలా ప్రేమించగలవా సుగుణా!''

''అంత అదృష్టం వుందా నాకు!''

''నాది సుగుణా అదృష్టం!''

''కాదు నాది!''

''కాదురా! నాది!

యిద్దరు వాకిలివేపు చూశారు

''యిన్నాళ్ళబట్టీ ఈ హోటలు కూడుతో చచ్చాననుకో యిహనుంచీ ఆ బాధ తప్పుతుంది?''

''ఏం?''

''మా చెల్లాయి బాధ్యత నీ కిచ్చేశాగా! నీ చెల్లాయి బాధ్యత నే తీసుకోవాలి!''

అందరూ నవ్వుకున్నారు!

''బాబుగారూ! క్యారేజీ తెచ్చా! పైనుంచమంటారా?''

''ఏమీ వద్దు అన్నయ్యా! యిహనుంచీ యిక్కడే భోంచెయ్యాలి తెలుసా! ఈ చెల్లాయి మాట కాదనగూడదు! కాదంటే తెలుసుగా . అల్లుడు వాడూరుకోడు!''

అవునన్నట్లు నారాయణ చంకలోని పాప ''వూ! వూ!'' అన్నాడు!

సుగుణ దేవుడిపటంముందుకువెళ్ళి, తన కోరిక నెరవేర్చినందుకు హృదయపూర్వకంగా మ్రొక్కింది. ★

# పెంపుడు జంతువులు - పిల్లులు

[పెంపుడు జంతువుల సరదా లేనివారు తక్కువ. ఏదో ఒక పెంపుడు జంతువు ఇంట్లో ఉంటే సందడిగా ఉంటుంది. కాని జంతువుల అవసరాలు తెలుసుకోనడం తేలిక కాదు, మూగవి కనుక కష్టాలు చెప్పుకోలేవు. సాధారణంగా అందరూ పెంచుకునే జంతువులకు సంబంధించిన విషయాలు కొన్ని వ్యాసాలలో తెలుపాలని మా సంకల్పం. ఒక్కొక్క వ్యాసంలో ఒక జంతువుని గురించి వ్రాయదలుచాము. 'గొప్పకి' కుక్కలు పెంచేవారు-కుక్కలే కాక మరే జంతువైనా సరే-ఇవి చదవక్కరలేదేమో కాని చదివితే తప్పులేదు !]

## పిల్లుల పెంపకం

కుక్కలను చూచినంత జాగ్రత్తగా పిల్లులను చూడనక్కరలేదంటారు పిల్లులు కుక్కలకన్నా స్వతంత్రంగా ఉంటాయనికొందరంటారు ! కాని, పిల్లుల పెంపకంలో కూడా జాగ్రత్త అవసరం పిల్లులను పెంపుడు జంతువులుగా ఉంచుకొనేవారికి ఉపయోగకరంగా ఉండే వివరాలు కొన్ని ఈ వ్యాసంలో ఇవ్వటానికి ప్రయత్నిస్తాము కుక్కలలో 'జాతులు' ఉన్నట్లు పిల్లులలో కూడా ఉన్నాయి కాని గొప్పకి కాకుండా ఇష్టపడి పెంచుకొనేవారి నుద్దేశించే ఈ వ్యాసాలు వ్రాయబడ్డాయి కనుక ఇక్కడ వాటి ప్రస్తావన చేయటంలేదు సామాన్యంగా మనదేశంలో కనుపించే పిల్లులనే దృష్టిలో వుంచుకుని 'ఉపయోగకరంగా ఉండే' వివరాలు మాత్రమే చెప్తాము

## ఆహారం

పిల్లి పాలు దొంగిలిస్తుందంటారు పిల్లికి పాలంటే ఇష్టమేకాని మాంసమంటే ఎక్కువ ఇష్టం వండిన మాంసం కూడా కొంచెం వెచ్చగా ఉంటే పిల్లులు ఆసక్తితో తింటాయి చేపల రుచి పిల్లులకు ఇష్టం, అని వింటాము కాని క్రొవ్వు పదార్థం అధికంగాలేని చేపలే పిల్లులకు 'పడతాయి' పిల్లులకు కూరగాయలు లలవాటు చెయ్యవచ్చు అన్నం పెట్టవచ్చునని వేరే చెప్పనక్కరలేదు మొత్తంమీద జ్ఞాపకం ఉంచుకొనవలసిన వివరాలు —

(1) పెరిగిన పిల్లులకు సరియైన ఆహారాలు (ఎ) మాంసం (బి) చేపలు (సి) పచ్చి కోడిగుడ్లు (డి) పాలు (ఇ) కూరగాయలు (ఎఫ్) పాలతో కలిపిన గోధుమ రవ్వ, నూక (జి) అన్నం ముఖ్యమైనవి పిల్లికూనలకు కావలసినవి మరొకచోట ఇవ్వబడ్డాయి

(2) ఆహారానికి వేళలు —రోజుకి రెండుమాట్లు 'భోజనం' చేయించాలి ప్రొద్దునపూట కొంచెం తక్కువగానూ, మధ్యాహ్నం వేళలు అధికంగానూ తిండిపెడ్తే మంచిది కొందరు రోజుకి మూడు సార్లు తిండి పెడ్తారు ఇందులో తప్పేమీలేదు

(3) నూనె —పిల్లులు అప్పుడప్పుడు జుట్టు పొరపాటున మింగి బాధపడుతూ ఉంటాయి దానికి 'ఆలివ్' నూనె మందుగా వాడవచ్చు వారానికి ఒకసారి వాడితేచాలు

(4) మంచినీరు —పిల్లులకు చాలా అవసరం పాలుత్రాగినంత మాత్రాన చాలదు సాధారణంగా పిల్లులు కొళాయివద్దా, కాలవలలోనూ నీరు త్రాగుతూ ఉంటాయి కావలిస్తే చిన్నడబ్బాలో నీరు పోసి ఉంచవచ్చు దాహం కలిగినప్పుడెల్లా త్రాగుతూ ఉంటాయి

## శుభ్రత

పిల్లులు వాటికవే శుభ్రంగా ఉంటాయన్నడంలో సందేహంలేదు కాని తరచూ వాటిని మనం కూడా శుభ్రం చేస్తూ ఉండటం మంచిది గట్టి 'బ్రష్'తో రోజుకి ఒకసారి దువ్వితే వాటికి సుఖంగా వుంటుంది పిల్లులు కొన్ని సమయాలలో పొట్టమీద 'జుట్టు' ముడిపడి బాధపడుతూ ఉంటాయి. గడ్డంక్రింద 'చెంపలమీదా, వీపుమీదా దువ్వితే పిల్లులకు ఇష్టం

సామాన్యంగా పిల్లులకు స్నానం పడదు! అయినా అవసరమయితే గోరువెచ్చటి నీళ్ళలో స్నానం చేయించి తడి పూర్తిగా ఆరేట్లు చూడాలి

## గోళ్లు

కొన్ని పిల్లుల గోళ్ళు మరీ పొడుగ్గా పెరిగి పాదాలలో గుచ్చుకుంటాయి పుళ్ళు కూడా పడే అవకాశం ఉంది ఇది జరిగితే జాగ్రత్తగా గోళ్ళు కత్తిరించి వెయ్యాలి కత్తిరించిన తర్వాత 'యాంటి సెప్టిక్'తో (antiseptic) తో కడగటం మంచిది

ఇంతేకాక పిల్లులకు గోళ్ళను 'పదును చేసుకొనడం అలవాటు తివాసీలమీదా, కొయ్యస్తంభాలమీదా గోకుతూ ఉంటాయి. కొన్ని పిల్లులు సామాన్లు గోకి పాడుచేస్తాయి అటువంటి సమయాలలో వాటికి గోళ్ళను పదును చేసుకునేందుకు ప్రత్యేకంగా ఏదైనా ఏర్పాటు చేయాలి

(45 వ పేజీ చూడండి)

## 'పృషదంశకము'

పిల్లుల్ని పెంపుడుజంతువులుగా మొట్టమొదట వాడినవారు ఈజిప్టు దేశంవారని ప్రతీతి. పిల్లుల పెంపకం వీరి దగ్గరనుంచి ఫోనీషియన్ల ద్వారా ఇటలీకి, ఇటలీనుంచి యూరోప్‌కూ అలవాటయిందంటారు

ప్రఖ్యాత చారిత్రకుడు, హెరోడోటస్ ఈజిప్షియన్లకు పిల్లులంటే ఇష్టమని వ్రాశాడు. ఇళ్ళు తగలబడిపోతున్నప్పుడు కూడా పిల్లులేమైపోతాయో అని తప్ప ఇళ్ళకోసం లెక్కచేసేవారు కాదన్నాడు. పిల్లులు మంటలను చూడగానే వాటిలోకి దూకుతాయనే నమ్మకం ఉన్నట్లు తెలుస్తుంది పిల్లిని చంపినందుకు ఒక రోమన్ సైనికుణ్ని కొందరు ఈజిప్షియన్లు వెంటనే చిత్రవధ చేసి ప్రాణం తీసివేశారుట. మనుష్యుల శవాలతో వారి పిల్లులను కూడా 'మమ్మీలు' చేసి పాతిపెట్టేవారు.

దేవతలుకూడా మార్జాలస్వరూపాలు కలవారుగా ఉండేవారు బాస్ట్ అనే దేవతకు - ఐసిస్ అవతారం అంటారు—పిల్లితల ఉండేది. ఈ బాస్ట్‌కే పిల్లితల కాయంతోబాటు డేగశరీరం ఉండేది.

యూరోప్‌లో పిల్లులనుగురించి విచిత్రమైన నమ్మకాలున్నాయి ఫ్రాన్సులో పిల్లి 'జొన్న'లతాలూకు దేవత అనుకుంటారని ప్రతీతి. ఐర్లాండ్ దేశం 'కెయిన్ ట్రబ్' మార్జాలదేవత. యూరోప్‌లోనే పిల్లులు చిన్నపిల్లలు నిద్రపోతూ ఉండగా వచ్చి వారి ఊపిరిని పీల్చివేసి చంపుతాయనే నమ్మకం ఉంది

జర్మనీ, స్వీడెన్ మొదలైన దేశాల 'పురాణాల'లో వచ్చే ఫ్రెయాకుకూడా మార్జాలావతారం ఉన్నది ఈ ఫ్రెయా 'ప్రేమ'కు సంబంధించిన దేవత.

పృషదంశక మంటే పిల్లి




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**26-4-1961 బుధవారము మొదలు**
**2-5-1961 మంగళవారము వరకు**

### మేషం :

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం ముఖ్యంగా మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకొనవలసిన అవసరం కనుపిస్తుంది ఆప్త బంధువులతో విరోధ ప్రసంగాలు రావటంవల్ల మీ కార్యకలాపాలకు ఆటంకాలు ఏర్పడుతవి ఆదాయం పెరిగినట్లు కనుపించినా ఎప్పటికప్పుడు కర్పూరం మాదిరి హరించుకునిపోతూ ఉంటుంది మొత్తంమీద పదిమందిలో గౌరవం పొందగలుగుతారు వృత్తి ఉద్యోగాలలో పెద్ద శ్రమ కనుపించదు గాని, సాటివారితో నిస్సందేహంగానూ, ధారాళంగానూ ప్రవర్తించలేకపోతారు మీ నిత్య కృత్యాలలో ఆటంకాలు, ఆలస్యం కనుపిస్తూ ఉంటవి ఈ సమయంలో ఇతరులకు సలహా చెప్పటం కాని, కార్య నిర్వహణ బాధ్యతలు పైన పెట్టుకొనదగిన సమయంగాని కాదు 29, 30 అధికారులతో సమావేశం, బంధువుల వద్దనుంచి శుభవార్తలు, వ్యవహారాలలో అనుకూలత

*  *  *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఇంకా కొంత ఆందోళన, సందేహాలు మిమ్ములను బాధిస్తున్నా ధైర్యంతో మీ ఆలోచనలను కార్యరూపంలో పెట్టగలుగుతారు ఈ సమయంలో జరిగే ఖర్చులకు తగినంత ఉపయోగం కనుపిస్తుంది శుభకార్యలలో పాల్గొంటారు వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవి కొంటారు కాని, ఉత్సాహం తగ్గే అవకాశా లున్నవి వ్యవహార విషయాలలో సాధ్యమైనంతవరకు సంప్రతింపులతో పరిష్కరించుకొనటం మంచిది ముఖ్యమైన వస్తువులు సమయంలో లభించకపోవటంవల్ల కొన్ని పనులు నిలుపుకొనవలసి వస్తుంది రాజకీయాలలో అపవాదులు రాగల అవకాశా లున్నవి. ధర్మకార్యాల నిమిత్తం ధనవ్యయం అవుతుంది వారాంతంలో ఆత్మీయులతో వివాదాలు వస్తవి 1, 2 తేదులలో స్వల్ప ఆదాయము, ఆందోళన కరమైన వార్తలు

*  *  *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

అవతలివారి మనస్సుకు బాధ కులుగకుండా ఉండటం నిమిత్తం కొన్ని సమస్యలను ఎదుర్కొనవలసి వస్తుంది అయితే లప్పులు పెరగకుండా చూచుకొనటం అవసరం వృత్తిలో గౌరవం పెరుగుతుంది ప్రతి పనీ అప్పటికప్పుడు అనుకుని ప్రయత్నిస్తూ ఉండటంవల్ల మనశ్శాంతి లోపిస్తుంది కొంతవరకు ఖర్చులున్నా పెరుగుతవి దైవానుగ్రహం వల్ల పనులు మాత్రం అనుకూలంగా జరుగుతవి వారం రెండవ భాగంలో ప్రయాణ సూచన లున్నవి నౌకరులవల్ల జరుగవలసిన పనులు సకాలంలో జరిగి ఫలితం పొందగలుగుతారు కుటుంబంలోని వారితో స్వల్ప అభిప్రాయభేదాలు వస్తూవుంటవి ప్రతి చిన్న పనిలోను తోటివారికి సమాధానం చెప్పి ముందుకు సాగవలసివస్తుంది 28, 29 బంధువులతో సమావేశం, ధర్మకార్యాలు, శుభవార్తలు

> **గ్రహస్థితి**
>
> మేషంలో సూర్య బుధులు, కర్కాటకంలో అంగారకుడు, సింహంలో రాహువు, మకరంలో గురు శనులు, కుంభంలో కేతువు, మీనంలో శుక్రుడు, సింహ కన్య తులా, వృశ్చికాలలో చంద్రుడు

*  *  *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)**

ప్రస్తుతం మీ పరిస్థితుల ననుసరించి క్రొత్త కార్యక్రమాలయందు ఆసక్తి చూపలేకపోతారు. కాని, దైవికంగా స్నేహితుల ప్రోత్సాహంతో శుభ కార్యప్రయత్నాలు జరిగి అనుకూలిస్తవి వృత్తిలో దేహశ్రమ అధికంగా ఉంటుంది ప్రయాణాలతో కూడిన పనులు ఎక్కువ ఆదాయం బాగా ఉంటుంది సంఘంలో మీ మాటను నిలుపుకొని పేరు ప్రతిష్ఠలు పొందగలుగుతారు ఆరోగ్యమును గురించి శ్రద్ధ, ఆహారవిహారాలలో జాగ్రత్త అవసరం క్రొత్త మనుష్యులతో జరిగే సంప్రదింపులు చక్కగా సాగి సకాలంలో ఫలిస్తవి. కుటుంబంలో సాధారణంగా ఆరంభమైన కలహాలు తీవ్రరూపం పొందకుండా చూచుకొనండి జాగ్రత్తగా పనులు జరుపుకొనవలసి వస్తుంది 1, 2 తేదులలో విలాస వస్తువులు కొంటారు. ఇతరులకు సహాయం చేయవలసి వస్తుంది.

*  *  *

### సింహం

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

తీరుబాటులేని పనులతో సతమత మవుతున్నా ప్రతిఫలం సంతృప్తికరంగా ఉండటంవల్ల విసుగు తోచదు ఈ సమయంలో తొందరపడి బంధుమిత్రులమీద కోపగించుకునే అవకాశా లున్నవి వృత్తిలో గౌరవం, కార్యసిద్ధి బాగానే ఉంటవి అయితే మీరు అనుకున్న సమయంలో డబ్బు చేతికరాక ఆరంభించిన పనులలో కొంత నిలుపుదల కనుపిస్తుంది వారం రెండవభాగంలో ఆప్తులవల్ల శ్రమ, అభిప్రాయ భేదాలు కనిపిస్తున్నా నిష్కర్షగా మాట్లాడలేకపోతారు కుటుంబంలోనివారి ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి 28, 29 లలో అకస్మాద్ధనప్రాప్తి, నమ్మించినవారే మోసం చేస్తారు

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

చాలావరకు శత్రుబాధ తొలగిపోతుంది స్నేహితుల మాటలలో నమ్మకం తోచకపోయినా ధైర్యంతో అనుకున్న పనులను సకాలంలో సాగించగులుగుతారు కుటుంబంలో సుఖ సంతోషాలు లభిస్తవి వృత్తి ఉద్యోగాలలో అనేక రకాల మనుష్యులతో పరిచయం లభిస్తుంది అదృష్టవంతమైన కాలం మీ సలహాకోసము, సహాయం నిమిత్తం ఎదురుచూచేవారుంటారు వారం రెండవ భాగంలో నీచులతో వృధా కలహాలు రాగల అవకాశా లున్నవి ఒకటి రెండు సందర్భాలలో మీ మాటను మీరే తప్పించుకొనవలసిన అవసరం కలుగుతుంది ఉత్తర దిక్కునుంచి శుభ, లాభ వార్తలు తెలుస్తవి అధికారులవల్ల జరుగవలసిన పనులు సులభంగా నెరవేర్చుకో గలుగుతారు

*  *  *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

గతవారంకన్నా పరిస్థితులు మెరుగుగా కనుపిస్తవి పెద్ద మొత్తాలుగా డబ్బు చేతికి వస్తుంది.

కుటుంబంలో సుఖము, కార్య అనుకూలత కనుపిస్తవి మీరు అనవసరంగా ఇతరులను అనుమానించటంవల్ల సకాలంలో మీ పనులు జరుగకుండా నిలిచిపోతవి శుభ కార్య సందర్భాలలో ఖర్చులు పెరుగుతవి మీచేత పనులు జరుపుకుని మిమ్ములను ద్వేషించే మనుష్యులు ఉంటారు బాధ్యతలను తప్పించుకుందామని మీరు చేసే ప్రయత్నాలు అనుకూలించవు బంధువులవల్ల నిష్ఠురాలు రాగల అవకాశా లున్నవి ఇతరులకు వ్రాసే ఉత్తరాలలో గాని, వ్యవహార సంబంధమైన కార్య కలాపాలలో గాని పొరపాట్లు రాకుండా చూచుకొనండి వారాంతంలో అపకీర్తికి భయపడి దుబారా ఖర్చులు భరించవలసి వస్తుంది 30, 1, 2 లలో వ్యవహారరంగంలో అనుకూలత, కుటుంబంలో సుఖ సంతోషాలు

*  *  *

### వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఈ సమయంలో తోటివారికి మేలు చేయబోతారు కాని, గ్రహస్థితి బాగుండక పోవటంవల్ల తప్పు మీమీదకు నెట్టటానికి ప్రయత్నించే వారుంటారు అందబోతున్నట్లు కనిపించిన అదృష్టం దక్కకుండా పోయే సూచన లున్నవి బంధువుల వద్ద నుంచి శుభవార్తలు తెలుస్తవి కుటుంబంలో కార్యభారం చాలవరకు తగ్గుతుంది అయినా లోగడ ఎప్పుడో జరిగిపోయిన సంఘటనలయొక్క సూచనలు యీ సమయంలో మీ మనస్సును చికాకు పరుస్తవి ప్రతిపనిలోను, మిమ్ములను మీరే సందేహించుకొనతగిన వాతావరణం ఏర్పడుతుంది వృత్తి ఉద్యోగాలలో ఇంతకు ముందున్నటువంటి విసుగుదల, అసంతృప్తి చాలవరకు తొలగిపోతవి ప్రయాణాలు సుఖంగా జరుగవు 27, 28 లలో వ్యవహార జయం, ఇష్టవస్తు ప్రాప్తి

*  *  *

### ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

మీ సమ్మతితో గాని, సంతృప్తితో గాని, నిమిత్తం లేకుండా పనులు జరుగుతూ ఉంటవి మనస్సు మాత్రం గాలిలోని దీపం మాదిరి నిశ్చలత లేకుండా కొట్టుకుంటు ఉంటుంది చివరకు ఆలోచిస్తే అనేక సందర్భాలలో సాటివారి కన్నా మీ స్థితి మెరుగ్గానే తోస్తుంది శుభ సంతోషాల నిమిత్తం ధనవ్యయం చేయవలసి వస్తుంది అధికారులతో ఏర్పడిన పరిచయం బెడిసిపోకుండా చూచుకొనండి బంధువుల వద్దనుంచి కష్టవార్తలు తెలియగల సమయం సాధారణంగా కొంతమంది చెప్పే మాటలను నమ్మి వ్యవహార రంగంలో దిగటం మంచిదికాదు క్రొత్తగా ఆరంభించే వ్యాపారాదుల వంటి పనులలో అప్తుల సలహా, సహాయాల మీద ఆధారపడవలసి వస్తుంది పుణ్యకార్యాలు సుఖంగా నెరవేరుతవి 28, 29 తేదులలో మనశ్శాంతి లభిస్తుంది సంఘ కార్యాలు, ధనలాభం

*  *  *

### మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)**

అన్నిటికన్నా గౌరవం దక్కించుకొనటం ఎలాగనే సమస్య మనస్సును వేధిస్తూ ఉంటుంది వృత్తికి సంబంధించిన వార్తలు సకాలంలో అందవు ఆదాయం మామూలుగా ఉన్నా ఖర్చుల తాకిడికి ఇబ్బందిపడవలసి వస్తూ ఉంటుంది దైవికంగా వ్యవహారాలలో అనుకూలత లభిస్తుంది ప్రస్తుతం ధైర్యంతో మీ పనులను సాగించుకొనటం అవసరం మిమ్ములను ఉత్సాహపరచటం నిమిత్తం చెప్పే మిత్రుల మాటలను నమ్మటం వల్ల ఫలితం కనుపించదు బంధుమిత్రుల ఇండ్లకు ప్రయాణం చేయవలసి వస్తుంది మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది హాస్యప్రసంగాలలో తటస్థంగా ఉండండి 28, 29 లలో విలాస సంబంధమైన ఖర్చులు, మిత్రలాభం

*  *  *

### కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ భాద్ర 1, 2, 3 పా.)**

అన్నివిధాలా కాలం కలిసి వస్తుంది అధికారులవల్ల మన్నన లభిస్తుంది ముందు ముందు మీ ప్రయత్నాలకు నిరాటంకమైన మార్గం కనుపిస్తుంది కుటుంబంలోని వారి ఆరోగ్యం ఇంతకు ముందుకన్నా మేలుగా ఉంటుంది ప్రతివిషయంలోను చురుకుగా ఆలోచించి ఒక నిర్ణయానికి రాగలుగుతారు ఎవరిని గురించి మీరు మంచివారుగా భావిస్తున్నారో వారే మిమ్ములను చికాకు పరచటానికి ప్రయత్నిస్తారు మితిమీరిన ఖర్చులతో ఏ ప్రయత్నం చేయుటం మంచిదికాదు కుటుంబంలో నెమ్మదిగా ఉంటుంది అనుకున్న పనులు సకాలంలో జరుగుతవి మిత్రులను గురించి ఆశ్చర్యకరమైన వార్తలు తెలుస్తవి 28, 29 లలో విశ్రాంతిలేని పనులు, ఖర్చులు

## ఈవారము ధరలు

ఈ వారం బంగారు ధరలో నిలకడ ఉండదు తరచు హెచ్చుతగ్గులు వస్తూ ఉంటవి వెండి ధర పెరిగి వారాంతంలో తగ్గుతుంది

పసుపు ధరలో పెరుగుదల ఆరంభం అవుతుంది కాని తిరిగి వెనుకకు తిరిగే అవకాశా లున్నవి నూలు ధర బాగుంటుంది ప్రత్తి ధర కొద్దిగా తగ్గవచ్చు

వేరుశనగపప్పు, నూనె ధరలు కొంతవరకు తగ్గు ముఖంలో ఉంటవి నూవుల ధర నిలకడగా ఉంటుంది. నూవులనూనె ధర కొద్దిగా తగ్గి పెరుగుతుంది

కందులకు గిరాకీ వస్తుంది మినుముల ధరలో తగ్గుదల వస్తుంది చింతపండు, బెల్లం ధరలు కొద్దిగా తగ్గుతవి

### మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

నిష్కర్షగా మాట్లాడుకొనకపోవటంవల్ల కలిగే చిక్కులు అనుభవంలో తెలుస్తవి ఫలితంలేని బాధ్యతలు మీపైన పడగల సమయం వృత్తిలో రాతగిన మార్పులు యింకా కొంచెం ఆలస్యంగా వస్తవి ప్రతి విషయంలోను ధైర్యంతో నిలబడగలుగుతారు పెద్ద మనుష్యులతో సంప్రదింపులు జరిగి మనశ్శాంతి లభిస్తుంది వ్యవహార రంగంలో మీ శక్తి సామర్థ్యాలు బాగా వినియోగించగలుగుతారు కుటుంబ సంబంధమైన కార్యకలాపాలలో ఆలస్యము, ఇతరుల జోక్యం వల్ల కలతలు రాగల అవకాశా లున్నవి వారం రెండవ భాగంలో స్నేహితులకు సహాయం చేయవలసి వస్తుంది చట్టావ్యాపారం వంటి వాటియందు ఆసక్తి కలుగవచ్చు ఫలితం పొందలేకపోతారు. 29, 30 లలో విలువగల వస్తువులు కొంటారు. బంధుమిత్రుల వద్దనుంచి శుభవార్తలు ★



"అది ఎంగిలిచేసిన అన్నము నీవు తినోచ్చా; తప్పుకదూ!

-చిత్రకారుడు: వి. నాగరాజ (ప్రొద్దుటూరు)



# రైల్లో పెళ్ళిచూపులు

"అదేమిటోయ్, ప్రభాకరం పెళ్లి చూపులకు రానంటావు. మీ చెల్లెలికు నచ్చితే తనకు నచ్చినట్టే అంటుంది.. .ఎలాగ వీళ్ల దగ్గరనించి అభిప్రాయాలు రాబట్టడం." అని రమణరావుగారు మూర్తితో నసిగాడు. ఆయన కేం తెలుసు....

మూర్తి రూమ్‌కి రాగానే ప్రభాకరం "అరేయ్ మూర్తి! మళ్లీ ఇవేళ నీకో బేరింగ్ లెటర్ వచ్చింది 20 నయాపైసలు పుచ్చుకున్నాడు పోస్ట్‌మేన్. ఈమాటు యిలా బేరింగ్ లెటర్ వస్తే నే పుచ్చుకునేది లేదు మీ చెల్లెలికి రాసెయ్యి. అయినా అంత పెద్ద ఉత్తరాలు ఏం వ్రాస్తుందిరా ?" అంటూ నవ్వుతూ ఓ వంపుడు బరువు ఉత్తరంఇచ్చాడు మూర్తికి

"థాంక్స్ కావాలంటే 20 నయాపైసలు ఇచ్చేస్తాను అంతేకాని మా చెల్లెలుచేత మాత్రంబేరింగ్ లెటర్స్ వ్రాయకుండా చెయ్యలేను ఏమైనా అంటే స్టాంపులు తక్కువ అంటిస్తే ఉత్తరాలు జాగ్రత్తగా చేరతాయిరా అన్నయ్యా అంటుంది అంచేత ఇకమీదట నాకు వచ్చిన బేరింగ్‌లెటర్స్‌కి అన్నింటికీ డబ్బు యిచ్చేస్తూవుంటాలే" అంటూ ఉత్తరాన్ని తీసుకున్నాడు మూర్తి

త్వరత్వరగా స్నానంచేసి బట్టలు మార్చుకునిఉత్తరం చదువుతూ కూర్చున్నాడు మూర్తి

"మూర్తి! నీకు ఆ ఉత్తరం చదివేటప్పటికి ఓగంట పట్టేటట్టుంది నే పోతున్నా బీచికి"

"అబ్బే! వచ్చేస్తారా! ఒక్క నిముషం"—అంటూ మరో పది పదిహేను నిముషాల తర్వాతబయటపడ్డాడు

మూర్తి, ప్రభాకరం యూనివర్శిటీలో చదువుకుంటున్నప్పుడు క్లాస్‌మేట్స్, రూమ్‌మేట్స్‌కూడాను దీనికి తోడు చదువు పూర్తవ్వగానే ఒకే కంపెనీలో ఇద్దరూ ఎక్జిక్యూటివ్ ట్రైనీస్‌గా సెలెక్టు అవ్వటంతో మరింత దగ్గరికి వచ్చారువాళ్లిద్దరూ

మొదటి ఆరు నెలలూ కంపెనీ మద్రాసుబ్రాంచిలో ట్రైనింగ్ అవుతున్నారు వాళ్లుంటున్న లాయిడ్స్‌రోడ్ నుంచి మెరీనా వరకూనడిచివెళ్లిరావడం వాళ్లకు అలవాటు

మామూలుగా ఆరోజు కూడా మెరీనాలో ఓకప్పు కాఫీ తాగి బీచిలో కూర్చున్నారు, మూర్తి, ప్రభాకరం

"మా నాన్నగారు మళ్లీ ఉత్తరం వ్రాసార్రా నాకు ఉద్యోగం వచ్చిన తర్వాత అప్పుడే యిది ఐదో ఉత్తరం ఎవరో వచ్చారుట పిల్లనిస్తామని అయినా ఏమిటో మా నాన్నగారిచాదస్తం పెళ్లిచూపు లేమిటి చెప్పు అనవ్వాంగాను ఇదేమైనా వంకాయల బేరమా ? ఎక్కడో పరిచయంచేసి కాస్సేపు మాట్లాడేలా చూసి తరువాత అభిప్రాయం అడుగుతే ఎంత బావుంటుంది? పాపం ఆ అమ్మాయిలు మాత్రం [illegible] డెలికేట్‌గా ఫీల్ అవుతారు! ఎవరో పరాయివాళ్లు ప్రత్యేకంగా రెప్పవాల్చకుండా ఆమెవైపే చూస్తుంటే ఆ అమ్మాయికి ఎలా ఉంటుంది. ఆలోచించరా మువాళ్ళు" అన్నాడు ప్రభాకరం.

## రైల్లో పెళ్ళిచూపులు

జవాబుగా నవ్వేసి వూరుకున్నాడు మూర్తి. "అందుకనే వ్రాసేశాను మా నాన్నగారికి మరో సంవత్సరం వరకూ పెళ్ళిమాట ఎత్తొద్దని."

"మంచిపని చేశావురా."

*   *   *

మూర్తి ఓమాటు వారం రోజులు సెలవు మీద రాజమండ్రి వచ్చాడు.

"మూర్తి మన నిర్మలకి సంబంధం కోసం ప్రయత్నిస్తున్నాంరా. మీ చిన్నాన్న ఏదో ఉత్తరం వ్రాశాడు. కుర్రాడు ఇంజనీరింగ్ ప్యాసయ్యాడుట. ఎక్కడో ఇంజనీరుగా పని చేస్తున్నాడుట" అన్నారు మూర్తి నాన్నగారు సీతారామయ్యగారు.

సీతారామయ్యగారు కోర్టుకి వెళ్ళిపోయారు. "చూడరా అన్నయ్యా. నాన్నగారు ఎంత చెప్పినా వినకుండా ఏమిట్రా పెళ్ళిచూపులూ అవీను. ముక్కూ మొహం తెలీనివా డెవడో రావడం, చూసి ఏ పదివేలో అడగడం .... చూసే ముందరే ఎన్ని వేలు యిస్తారని అడిగేస్తే వదలిపోతుందిగా. వాళ్ళకి అంత డబ్బే కావాలంటే .... పోనీ ఏదో పార్టీకి పిలిచి పరిచయం చేస్తే ఎంత బావుంటుంది ? పోనీ నేనేం నోట్లో నాలుక లేనిదాన్నా ? చదువురానిదాన్నా" మెల్లిగా తన బాధ చెప్పుకుంది నిర్మల అన్నయ్యతో.

"నీకు నోట్లో నాలుక లేకపోవడ మేమిటి ? నీ నోరు చూస్తే ఆ వచ్చేవాడికి నోటంపట మాట రాదు అసలు ......

"పోనీలేవే. అంత పెళ్ళిచూపులు నీకు ఇష్టం లేకపోతే సినిమా హాల్లోనో, రైల్వే స్టేషన్లోనో పరిచయం చేస్తాలే ఆ పెళ్ళికొడుకుని !"

"ఫో ! నువ్వు మరీనూ ...."

*   *   *

మూర్తి మద్రాసు తిరిగి వచ్చినప్పటినుంచీ ప్రభాకరాన్ని అంత క్రితం ఎప్పుడూ పరీక్ష చెయ్యనంతగా పరీక్ష చెయ్యడం మొదలుపెట్టాడు .... ప్రభాకరం అభిరుచులు, ఆదర్శాలూ, వాళ్ళ వంశ వివరాలూ .... ఒకటేమిటి ! ప్రభాకరం ఆట్టే అంత పొడుగరి కాకపోయినా పొట్టి మాత్రం కాదు. ఆం ! తన చెల్లెలు నిర్మల మాత్రం అంత పొడుగేంకాదుగా. ప్రభాకరం ఎదుటి వాడిని ఎప్పుడూ నవ్విస్తూ, తను నవ్వుతూ ఉంటాడు. కనీసం సిగరెట్టైనా కాల్చనంత బుద్ధిమంతుడు ....

*   *   *

మద్రాస్‌లో ట్రైనింగ్ పూర్తయ్యింది. మరో కొన్ని నెలల ట్రైనింగ్‌కోసం కలకత్తా పోతారు. ఆరోజు సాయంత్రం మూర్తీ, ప్రభాకరం షాపింగ్‌కి బయలుదేరారు.

హాండ్‌లూమ్ హవుస్‌లో చీరలు చూస్తున్నారు.

ప్రభాకరానికి మూర్తి కంటె కొంచెం ఎక్కువే తెలుసు చీరెల విషయంలో. మూర్తి ప్రభాకరాన్ని అడిగాడు ఏ చీర కొంటే బాగుంటుందని.

"మీ చెల్లెలు ఏ రంగులో ఉంటుందో తెలియకుండా నేను రంగు ఎలా సెలెక్టు చెయ్యనురా?" అన్నాడు ప్రభాకరం.

"చామనచాయ .... "

వెంటనే ఓ లేత ఆకుపచ్చ సిల్కుచీర కొనిపించాడు. ప్రభాకరం సలహామీద బట్టలన్నీ కొన్నాడు మూర్తి. అక్కడనుంచి కార్పొరేషన్ బజారుకిపోయి ద్రాక్షలూ అవీ కొన్నారు. ఓ బుట్టెడు దవనం కొన్నాడు మూర్తి.

"అంత దవనం ఏంచేసుకుంటావురా" అని ప్రభాకరం అడుగుతే.

"నీకు తెలీదులేరా ! మా చెల్లెలికి కొంచెం స్నేహితులు ఎక్కువేలే !"

*   *   *

రైలు గోదావరి స్టేషన్‌కి చేరుతోం దనగానే మూర్తి గుమ్మంలో నుంచున్నాడు నిర్మలకి కనిపించేలా. ఆ పెట్టిలో ప్రభాకరం, మూర్తి ఇద్దరే ఉన్నారు. ప్లాట్‌ఫారంమీద పుస్తకాలషాపు దగ్గర తమ్ముడితో సహా నిర్మల నించుంది. చెల్లెల్ని చూడగానే చెయ్యి వూపాడు మూర్తి.

నిర్మల తమ్ముడితో సహా ఓ క్యారియర్ పుచ్చుకుని కంపార్ట్‌మెంట్ దగ్గరికి వచ్చింది.

"ఏమిటే క్యారియర్ పట్టుకొచ్చావ్ ! నాన్నగారు రాలేదా ?"

"నాన్నగారు నిన్ననే కాకినాడ వెళ్ళారు. చాలా అనుకున్నారు .... కాని ఏదో అర్జంటు పనిట. వీలయితే యిక్కడ జర్నీబ్రేక్ చెయ్యమన్నారు నిన్ను" అంటూ కంపార్టుమెంట్‌లోకి ఎక్కింది.

"మా చెల్లెలు నిర్మలరా ! బియ్యేస్సీ ప్యాసయింది. చూశావా ఎప్పుడూ పోస్ట్‌మేన్ మన దగ్గర ఎక్సెస్ వసూలుచేస్తూ వుండేవాడు. దీని ఉత్తరాలేరా. వాడు మా తమ్ముడు క్రిష్ణ. ప్రీ యూనివర్శిటీ చదువుతున్నాడు" అని ప్రభాకరంతో అని;

"వీడు నా స్నేహితుడే. ప్రభాకరం. నాకు యూనివర్శిటీలో క్లాస్‌మేట్—రూమ్ మేట్. ఇప్పుడు నాతోపాటే మా కంపెనీలోనే ట్రైనింగ్ అవుతున్నాడు .... నువ్వు వ్రాసిన ఉత్తరాల్లో సగానికి పైగా ఎక్సెస్ వీడే యిచ్చేవాడు ...." అని నిర్మలకి ప్రభాకరానికి పరిచయం చేశాడు.

"నమస్కారమండీ" అని ప్రభాకరంతో అనేసి "అయితే ఆ ఉత్తరాలకి ఎక్సెస్ నువ్వు ఇవ్వటం లేదా ?"

"లేదే. వాడికి నేను ఇస్తానా—ఇస్తే వాడు పుచ్చుకుంటాడా ? నీ ధర్మమా అని ఓ పది రూపాయల దాకా దండుగ అయ్యుంటుంది."

"అరే ....... "

"పరవాలేదులెండి. అయినా స్టాంప్‌లు తక్కువ అంటిస్తేనే నయం. ఉత్తరాలు చాలి జాగ్రత్తగా జేరతాయి" అనేశాడు ప్రభాకరం నవ్వుతూ.

నిర్మలకి ప్రభాకరం అలా ఎందుకు అన్నాడో అర్థం కాకపోయినా "అవునండీ" అంటూ నవ్వేసింది.

"కూర్చోండీ ఎంతసేపు నించుంటారు ?" నిర్మలా తమ్ముడూ కూడా కూర్చున్నారు. రైలు

బయలుదేరింది. మూర్తి పెట్టె తెరచి చీరలు బయటికి తీసి చెల్లెలికి ఇచ్చాడు. నిర్మల వాటిని తీసుకుని పరీక్షగా చూసి "చాలా బావున్నాయిరా! చాలా థాంక్స్ .... నీ సెలక్షన్ ఈమాటు ఇంత బాగుందేమిటి ? .... షాపింగ్‌కి వచ్చిన వాళ్ళని ఎవర్నయినా అడిగావేమిటి ?" అంది నవ్వుతూ.

"లేదే 'షాప్' కి వచ్చినవాళ్ళెవర్నీ అడుగలేదు. వెళ్లేటప్పుడే నా కూడానే తీసుకెళ్లాను"

"ఎవర్నిరోయ్! ఏమిటి సంగతి .... నాన్నగారితో చెప్పమంటావా ?"

"అబ్బే ఎవరు కాదే బాబూ. నువ్వు ఎవరను కుంటున్నావో ఏమో!? నాతో షాపింగ్‌కి ప్రభాకరాన్ని తీసుకెళ్ళాను. నువ్వు చెప్పిన థాంక్స్ వాడికి పోతుంది. సెలక్షన్ వాడిదే."

నిర్మల ఒక్కమాటు కొంచెం సిగ్గుపడింది. వెంటనే "థాంక్సండీ .... మా అన్నయ్య ఓమాటు బెనారస్ పోయి ఓ సిల్కుచీర పట్టుకొచ్చాడు నాకోసం. కాషాయరంగు. ఇదేమిట్రా అంటే 'నీ మొహం నీకు అది చాలా బావుంటుంది' అంటాడు. పాపం ఏదో అన్నయ్య ఆపేక్షగా తెచ్చిచ్చాడు కదా అని కట్టుకుంటున్నాను .... "

రైలు రాజమండ్రి స్టేషన్ జేరింది.

"అన్నయ్యా చేతులు కడుక్కునిరారా భోజనం చేద్దువుగాని .... "

"అరేయ్ ప్రభాకరం నువ్వు చేతులు కడుక్కోరా. మనిద్దరం కలిసి భోజనం చేద్దాం."

"ఫరవాలేదులేరా ! నేను సామర్లకోట స్టేషనులో తింటారే !"

"క్యారియర్‌లో అన్నం సరిపోదేమో అని మొహమాటపడుతున్నావేమిటి .... మా అమ్మ ఒకరికి క్యారియర్ సద్దిందంటే ఇద్దరు తినగా ఇంకా మిగిలిపోతుంది."

"క్యారియర్‌లో అన్నం యిద్దరికీ సరిపోతుంది. కాని క్యారియర్ సద్దింది అమ్మ కాదు. నేనే. అమ్మకి కొంచెం నీరసంగా ఉంది. అమ్మ అందు కనే స్టేషన్‌కి కూడా రాలేదు. క్యారియర్ నేనే సర్దాను."

"అయితే మనిద్దరికీ, సగం భోజనమే .... " అనేసి మూర్తి, ప్రభాకరంతో సహా చేతులు కడుక్కొని వచ్చాడు. ఇద్దరూ భోజనం చేస్తున్నారు. బయట చక్రకేళి పళ్ళు అమ్ముతుంటే వాడిని పిలిచి ఓ డజను పుచ్చుకుని వా డడిగిన రూపాయి పావలా ఇచ్చేశాడు.

వెంటనే "అంతా డబ్బు దండుగ పనులు. బజార్లో డజను పన్నెండణాలు. నిన్ననే కృష్ణ పట్టుకొచ్చాడు. మాకు వ్రాసిఉంటే మేం కూడా పట్టుకొచ్చేవాళ్ళం .... " అంది నిర్మల.

"మీరు చాలా బిజనెస్‌మైండెడ్. అసలు కామర్స్ చదివి వుండవలసింది."

నవ్వేసింది ప్రభాకరం కామెంట్ విని నిర్మల. మూర్తికి ఏమనాలో తెలిక "అర్థం లేకపోతే సరి. అరటిపళ్ళు బజార్లో నించి పట్టావాలేమిటి .... దానిమాట కేమిటి కాని .... మీ ఆకాశవాణి ఏమంటోందే ... "

"అదేం పేరురా ?" అర్థంకాక అడిగాడు ప్రభాకరం.

"నిజంపేరు కాదులేరా. ఓమా చెల్లెలికి స్నేహితురాలు ఉందిలే. ఆ అమ్మాయికి ఇవేళ సాయంత్రం ఓ వార్త చెబితే రేప్పొద్దున్నకి ఆకాశవాణికంటే బాగా ప్రసారం చేస్తుందిలే అందుచేత మా నిర్మల ఆ అమ్మాయిని ఆకాశవాణి అని రిఫర్ చేస్తుందిలే. కాని ఆ అమ్మాయికి మాత్రం తెలీదు ఈ విషయం .... "

"ఆ అమ్మాయికి పెళ్లి సెటిల్ అయ్యిందిరా... అన్ని కబుర్లు చెప్పేదా ? బుద్ధిగా కూర్చుంది పెళ్లిచూపుల రోజున.

"నువ్వూ కబుర్లు చెబుతావుగా. ఏం చేస్తావో చూద్దాంగా.

"అంతేలే చదువుకున్నావు! ఎందుకు. ఆ పూర్వాచారాలు పట్టుకుని వెళ్ళాడు. ఎవరొస్తుందో కాని ఆవిడ నిన్ను చూడటానికి వచ్చేటంత దయితే కాని నీకు తెలీదు" అనేసింది నిర్మల.

"బాగా చెప్పేరండీ .... నేనూ అలాగే అంటూ ఉంటాను మూర్తిని" ప్రభాకరం అన్న ఈమాట

> ఒక కవిగారు తన ప్రియురాలితో, తన్ను వెంట నే వివాహం చేసుకొనకపోతే బ్రతుకలేనని వాపోయాడు. ఆవిడ జాగ్రత్తగానే ఆలోచించి అది అసంభవమని చెప్పడానికి చింతిస్తున్నానని చెప్పేసింది. పాపం, కవిగారు మరణించారు. ఏభై సంవత్సరాల తర్వాత.

వినగానే మూర్తి ఇంక పూరుకుంటే వాళ్లిద్దరూ కలిసి తనకు తాటాకులు కడతారేమో అన్పించింది.

"టైం అవుతోందే! ముందర పళ్ల బుట్టలు కిందకి దింపుదాం" అని తొందర చేశాడు మూర్తి.

నిర్మలా, కృష్ణా ప్లాట్‌ఫారంమీద నుంచున్నారు.

"ఇదేమిటిరా ! బుట్టెడు దవనం, మరువం పట్టుకొచ్చావ్. ఏం చేసుకుంటాం."

"ఏం ఫరవాలేదులే. మీ స్నేహితులకి కూడా కొంచెం ఇయ్యి. వాళ్ళకి ఇవ్వడం దండుగ అని అంతా నువ్వే పెట్టుకుంటే మేకలు వెంట పడతాయి."

ఇంతలో గార్డు విజిల్ ఇవ్వడంతో ఆ కెనేడియన్ ఇంజన్ చెవులు మారుమోగేలా కూస్తూ బయలుదేరింది. ఆ కెనేడియన్ ఇంజన్ కూతలో "వెడతాంరా అన్నయ్యా ! వెడతామండీ" అన్న నిర్మల మాటలు సన్నగా కలిసిపోయాయి.

ప్లాటుఫారంమీద నించుని రైలు తలుపు దగ్గర నుంచున్న అన్నయ్య కన్పిస్తున్నంతసేపు అటు వైపే చూస్తూ వెనుదిరిగింది నిర్మల.

కంపార్టుమెంట్‌లో కూర్చున్నారు ప్రభాకరం, మూర్తి రైలు రాజమండ్రి స్టేషన్ ప్లాట్‌ఫారం దాటగానే.

"మీ చెల్లెలు బాగా చెబుతుందిరా ఖబుర్లు..."

"అది అంతేరా ! నేను ఆ వూళ్లో ఉన్నన్ని రోజులు బయటికికూడా పోనివ్వదురా."

*　　*　　*

రైలు సామర్లకోట స్టేషన్‌లో ఆగింది. తండ్రి రమణారావుగారిని చూసి ప్రభాకరం క్రిందకు దిగాడు

ఆయన కూడా ప్రభాకరంతోపాటు కంపార్టుమెంటులోకి వచ్చారు. మూర్తిని పరిచయం చేశాడు. తన ప్రాణస్నేహితుడిగా ప్రభాకరం తండ్రికి.

"అహం! అలాగా. నీకు తెలిదు కాని నాయనా మీ తాతగారి పేరు తెలీనివాడుండడు ఈ పరిసర ప్రాంతాల్లో బహుశా ! ఆయన పోయేటప్పటికి నువ్వు చాలా చిన్నవాడివి అయ్యుంటావు...." అంటూ పలుకరించారు మూర్తిని.

"కనీసం రెండు రోజులపాటు కాకినాడలో దిగడానికి వీలుగా పెట్టుకోవలసింది ప్రయాణం."

"ట్రైనింగ్ పీరియడ్" లో సెలవు దొరకడం కష్టం అనీ, అయినా మరో రెండు నెలల్లో వో పది రోజులు సెలవు దొరుకుతుందని చెప్పాడు ప్రభాకరం.

*　　*　　*

కలకత్తా జేరిన కొద్ది రోజులకి మూర్తి చెల్లెలికి ఉత్తరం వ్రాశాడు. ప్రభాకరాన్ని గురించి వ్రాస్తూ ప్రభాకరానికి వో అమ్మాయిని చూస్తే ఆ అమ్మాయే ప్రభాకరాన్ని చేసుకోవాలని వ్రాశాడు.

జవాబులో నిర్మల ఆ విషయం తను నమ్మలేనని ఒకవేళ ఆ విషయమే కనుక నిజం అయితే ఆ అమ్మాయి ఉత్త ఫూల్ అయ్యిఉండాలి అని వ్రాసింది.

మూర్తికి ఆశించిన జవాబు వచ్చింది చెల్లెలు నిర్మల దగ్గరనుంచి.

తర్వాత కొద్ది రోజులకి ప్రభాకరానికి తండ్రి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం వచ్చిన రోజు ప్రభాకరం మూర్తికి ఆ ఉత్తరం చూపించి,

"మా నాన్నగారు ఉత్తరం వ్రాశారురా. పైగా నేను రాజమండ్రి వెళ్లి చూడాలిట. అయినా నిర్మల నాకు తెలియంది కనుకనా—అయినా మీ చెల్లెలు అభిప్రాయం నువ్వు కనుక్కుంటే మంచిదేమో ! .... ఏమయినా మా నాన్నగారికి ఇవేళ వ్రాస్తున్నా. మీరు చూస్తే నేను చూసినట్టేనని .... "

మూర్తి నవ్వు నవ్వేసి పూరుకున్నాడు. "భాయి .... ఇది మన ప్రపోసల్. ఎదురుండదు తెలుసా."

*　　*　　*

"చూడండి ! మీతో సంబంధానికి నా కేం అభ్యంతరంలేదు. మీ మూర్తితోపాటే మా అబ్బాయి పది రోజుల సెలవుమీద ఇక్కడకు వచ్చాడు. వస్తే తీసుకువెళ్లండి .... "

"పెళ్లిచూపులంటే నాకు అట్టే యిష్టం లేదండీ. కావాలంటే మా నాన్నగారు, అమ్మ వస్తారు తీసుకెళ్లండి. వాళ్లకు నచ్చుతే నాకు

(50-వ పేజీ చూడుడు)



## జూల్స్ వెర్న్ నవల

# ౮౦ రోజులలో భూప్రదక్షిణం

రకరకాల రంగుల దుస్తులు ధరించి కలకల లాడుతూ సందడిగా తిరుగుతున్న ఈ జనం మధ్య సరదుగా రకరకాల వస్తువులతో, తినుబండారాలతో నిండుగా, కంటికి సరదుగా ఉన్న దుకాణాలు చూస్తూ పాస్పార్తూ వీధులలో గంటల తరబడి తిరిగాడు. పెద్ద హోటళ్ళు, ఫలహారశాలలు కనిపించాయి గాని వాటిలోకి పోవడానికి అనుమతి దొరకలేదు. ప్రపంచ ప్రసిద్ధమైన 'టీహౌస్' లు (తేనీటి పానశాలలు) చాల కనబడ్డాయి. అక్కడ తేనీరు చాలా విశిష్టంగా ఉంటుంది. స్వచ్ఛమైన తెయాకుతో కలిపిన వెచ్చటి 'టీ' లో బియ్యపు సారా లాటిది కలిపి కప్పులకొద్దీ సేవిస్తూ ఉంటారు. ధూమపానశాలలు వేరే ఉన్నాయి. అక్కడ చాలా మేలైన పొగాకును కాలుస్తారు. అయితే చైనాలో ఉన్నట్టు 'నల్లమందు' తాగడం ఉండదు. ఆ పద్ధతి ఇక్కడివారికి దాదాపు తెలీదనే చెప్పాలి.

విపణివీధులలో విహారం అయ్యాక పాస్పార్తూ నెమ్మదిగా పూరు వాడ దాటి పొలాలలోకి వచ్చాడు. కనుచూపుమేర వరకూ వ్యాపించి, దిగంతాల వరకు ఉన్నాయనిపించేటంత విశాలమైన వరి పొలాలు, పెద్ద పెద్ద పూలచెట్లు, రకరకాల ఫల వృక్షాలు కనిపించాయి. వాటి చుట్టూ వెదురు బొంగులతో కంచె వేసిఉంది. అక్కడ జనం పళ్ల చెట్లను పళ్లకోసం కన్నా పూలకోసం పెంచుతారు. పువ్వులమీదే ఎక్కువ శ్రద్ధ, మోజూను. పిట్టలూ, పిచికలూ వచ్చి పళ్ళు కొట్టెయ్యకుండా మాత్రం దిష్టిబొమ్మలు చాలా వేశారు. అయినా చెట్టు చెట్టుకీ పిట్టగూళ్ళూ, పిట్టలూ దండిగా ఉండనే ఉన్నాయి డేగలూ, బాతులూ, పిచ్చికలూ, కాకులూ, గువ్వలూ అన్నీ ఉన్నాయి. అన్నిటినీ మించి కొంగలున్నాయి. కొంగలంటే జపానువారికి ప్రీతి. వాటిని రాజులంటారు. దీర్ఘాయుషుకూ, సిరిసంపదలకూ కొంగలు చిహ్నం.

పాస్పార్తూకి ఒకచోట గడ్డిలో వయిలెట్ పూలమొక్కలు కనిపించాయి. "భేష్. ఈ పూటకి సాపాటు" అనుకున్నాడు ఉత్సాహంగా.

దగ్గరకు వెళ్లి వాసన చూశాడు. అవి పరిమళంగా గుబాళించలేదు.

'కర్నాటిక్' స్టీమరు దిగేముందు, ఎందుకేనా మంచిదని దూరం ఆలోచించి పొట్ట బట్టినంత వరకూ తిండి దట్టించే మరీ దిగిన మాట నిజమే కాని, పగలంతా కాళ్లరిగేలా, తింటే, గింటే రాళ్లరిగేలా తిరిగాక పొద్దు వాలేసరికి మార్గాయాసం పెరగడంతోపాటు భుక్తాయాసం పూర్తిగా పోయింది.

అనువాదం:

**ఎస్. పార్థసారథి**

పాస్పార్తూ పుర విహారంలో స్థానికుల కసాయి దుకాణాలు కూడా చూశాడు. కాని అతని కెక్కడా గొర్రెలు, మేకలు, పందులు కనబడలేదు. పోతే అవన్నీ ఎద్దుల్నీ చంపడం అక్కడ మహాపచారం అని తెలుసు. అవి వ్యవసాయాదికాలకే, ఈ దేశంలో మాంసం దొరకదన్నమాట అని తేల్చుకున్నాడు. అదేం అపోహ కాదు. అయితే ఆ మాంసాలు దొరక్కపోయినా లేడి మాంసం, లేదా పక్షులది దొరికినా, కనీసం చేపలు దొరికినా చాలనిపించింది అతని ప్రాణానికి. అవి బాగానే దొరుకుతాయి. జపానీయులు తినేది అవే. వరి అన్నానికి ఇవే ధరువులు. మొత్తంమీద జపానులో, జనులకు భోజనాలు ఏవయినా, ఏవి కాకపోయినా అక్కడ ఏది దొరికినా, మానినా పాస్పార్తూకి ఆ పూటకి దొరికేదేదీ ఉన్నట్టు తోచలేదు. మర్నాడు స్థిమితంగా ప్రయత్నించి చూడవలసిందే.

చీకటిపడింది. పాస్పార్తూ తిరిగి జపానీయుల వాడలోకి వచ్చాడు. రాత్రి రకరకాల రంగు హంగుల దీపాలతో కన్నుల పండువుగా ఉంది. అవన్నీ చూస్తూ, అక్కడి సామూహిక నృత్యాలు వారి శిల్పం చూసి మురిసిపోతూ తిరిగాడు పాస్పార్తూ. దారి పక్కన కొందరు దూరదర్శిని యంత్రాల పెట్టుకొని జనాన్ని పోగుచేసి కిరాయికి వాటిని చూపిస్తున్నారు.

పాస్పార్తూ రేవువేపు వెళ్ళాడు. సముద్రం కూడా దీపాలతో వెలుగుతోంది. అవి అలంకారాలు కావు. జాలరుల కాగడాలు వేసుకు మరీ చేపలు పడుతున్నారు.

నెమ్మదిగా సందడి తగ్గింది. జనం పలచబడ్డారు. పురజనులు విశ్రమించారు. పౌరభటులు గస్తీకి బయలుదేరారు. ఒక్కొక్క పోలీసు రాజోచిత మనిపించే దుస్తులలో హుందాగా ఉన్నాడు. రాజులా కాపోతే, రాయబారిలా ఉన్నాడు. ఒక్కొక్క అధికారిని చూచినప్పుడల్లా పాస్పార్తూ పొంగిపోయి, "భేష్, భేష్ .... యూరోప్‌కి మరో జపాను రాయబారి" అనుకుంటూ అంటూ ముందుకు సాగుతూ వచ్చాడు.

*　　*　　*

తెల్లవారేసరికి పాస్పార్తూ అపురాపురుమంటూ నిద్ర లేచాడు. ఆకలితో ప్రాణం చావచ్చింది. ఈ పూట ఎలాగేనా సరే ఏదో కాస్త తిని తీరాలి. ఎంత చప్పున ఆ పని చేస్తే అంత మంచిది. చప్పున తినాలంటే, చటుక్కున తన గడియారం అమ్మేసి డబ్బు తెచ్చుకోవచ్చు. కాని అందుకు మనసొప్పలేదు. అది అమ్మడం కన్నా ఆకలితో చచ్చిపోవడం మెరుగు. అతని దగ్గర ఉన్న ఆస్తి ఇదొక్కటే—పుట్టుకతో అబ్బిన శ్రావ్యమైన కంఠస్వరం సంగీతం. దాన్ని ప్రయోగించడానికి

ఇంతకన్నా గొప్ప సమయం లేదు. ఇంతకుమించిన సందర్భము ఉండదు.

అతనికి కాసిని ఫ్రెంచి పదాలు, కాసిని ఇంగ్లీషు పాటలూ వచ్చును. అవి ఎలాగైనా ఈ పూట ప్రయోగించి చూడాలి. జపానువాళ్ళకి సంగీతం అంటే చాలా అభిమానం ఉన్నట్టుంది. వాళ్ళు ఏపని చేసినా, లయబద్ధంగా, శ్రుతి యుతంగా చేస్తూన్నట్లు కనబడింది. ఎక్కడికి వెళ్ళినా సింబల్, టాం టాం, డ్రమ్ము వాద్యము వినిపిస్తున్నాయి మరి. యూరప్ నుంచి ఒక ఔత్సాహిక నాయకుడు వచ్చి గానసభ చేస్తే హర్షించితీరుతారు.

కాని మరీ తెల్లవారురూమునే, ఇంత పెంద్రాళే గానసభలు చేయడం సబబుకాదు. జనం అంత హఠాత్తుగా మేలుకుని విని పొంగిపోయి డబ్బు కురిపించడం కష్టం. మహా అయితే మూడిటిలో మొదటి పని చేస్తారు.

అందువల్ల కొంతసేపు ఆగడం మంచిదని, అంత వరకూ కూర్చోలేక షికారు బయల్దేరాడు పాస్పొరూ. హఠాత్తుగా అతనికో అనుమానం వచ్చింది. తను ఇప్పుడు కళాకారుడు. దేశాలు ద్రిమ్మరుతున్న గాయకుడు. అలాటివాడికి, ఇపుడు తను వేసు కున్నంత గొప్ప దుస్తులు ఉండడం ఏమంతు అదుచితంగా కనపడదు. శ్రుతి శుద్ధంగా ఉండదు. తన స్థితికి తగిన వేషం ఉండాలి. పనిలో పని, ఇప్పుడున్న దుస్తులు అమ్మేసి ఇంతకన్నా చౌక రకం తీసుకుంటే .... నాలుగు రాళ్ళు చేతికి రావచ్చు కూడా .... వస్తే ఆకలి శాంతించడానికి తక్షణం ఏదో కొని, తిని ....

ఇంకేం. వెంటనే ఆ పని చెయ్యాలని నిశ్చ యించుకున్నాడు పాస్పొర్తూ. అనుకున్నంత సుల భంగా తెమలలేదు. చాలాసేపు వెతగ్గా వెతగ్గా, తిరగ్గా తిరగ్గా ఈ రకం సరుకులు కొనే దుకాణం దొరికింది. దుకాణదారుడికి ఈ యూరోపియన్ దుస్తులు నచ్చినట్లున్నాయి .... పది నిముషాల తరువాత పాస్పొర్తూ వాటిలోంచి ఇవతల పడి ఒక జపానీస్ అంగరఖాలాటి దాంట్లో దూరబడి ఇవతలికి వచ్చాడు. నెత్తికి ఓ టోపీ కూడా వచ్చింది. పాగాలా ఉంది. ఒక పెడకే అమరింది. రంగు మరీ కళ్ళు మిరుమిట్లు గొలపటంలేదు. గాలికీ, ఎండకీ కాబోలు బాగా వెరిసిపోయింది. ఈ దుస్తుల మాట ఎలా ఉన్నా జేబులో కాసిని జాపనీస్ నాణాలు గలగల మంటున్నాయి శ్రావ్యంగా.

జపాను దుస్తులు వేసుకుని "జపానీయుడు" అయిపోగానే, పాస్పొర్తూ తిన్నగా 'టీహౌస్'లో ఉన్నవాడికి వెళ్ళి, తన వేషంలాగే కాస్త సాదాగా తనకు తగినట్టున్న దాంట్లో దూరబడి రెండు పిడికిళ్ళ అన్నం, ఏదో పక్షి తాలూకు దనిపించే మాంసం తీసుకుని ఆప్యాయంగా, శ్రద్ధాసక్తులతో మళ్ళీ మధ్యాహ్నం భోజనం సంగతి కట్టుదిట్టం చేసుకొని వాడి ధోరణలో ఆరగించాడు. కడుపు చల్లబడ్డాక బుర్ర స్థిమితపడింది.

'ఈ స్థిమితం చెడగొట్టుకోకూడదు' అను కున్నాడు. తను యూరపియన్ సూటు అమ్మి జపానీ దుస్తులు కొన్నాడు. ఇవే జపానీ దుస్తులు. వీటిని అమ్మి ఇంకా చౌకలో "ఇంతకన్న జపానీస్ దుస్తులు" కొని, డబ్బు మిగలేసుకోవడం కష్టం. అందువల్ల పెందరాళే ఈ 'ఇనమండలం' నించి దయచేయాలి.

"కాంతివంతమైన ఈ సీమను తలుచు కున్నప్పుడల్లా ఈ అనుభవాలు, విషాద మేఘాలు ఆవరిస్తాయి" అనుకున్నాడు పాస్పొర్తూ విచారంగా.

అమెరికా వెళ్ళే ఓడ లేమిటో, వాటి సంగ తేమిటో చూస్తే మంచిదని తోచింది. వూహ కలిగితే దాన్ని పూరపెట్టడం పాస్పొర్తూకు చేత కాదు. చేతినిండా రాచకార్యాలు కూడా లేవు కాబట్టి వెంటనే యోకహామా రేవుకు తిరిగి వెళ్ళాడు. తీరా వెళ్ళి అక్కడి హడావుడి, రద్దీ ఆ స్టీమర్లూ చూశాక అతని ఉత్సాహం చల్లారిపోయింది. వూహ పోయినపుడు ఎంత సులువనిపించిందో ఇప్పుడు చూడగా చూడగా అంత కష్టం, అసాధ్యం అనిపి స్తోంది. అమెరికా స్టీమర్ల దగ్గరకు వెళ్ళి, మీకే మేనా నౌకరు గాని, వంటవాడు గాని కావాలా అని అడగా లనుకున్నాడు. 'నాకు జీతభత్యా లేమీ అక్కరలేదు. అమెరికా తీసుకెళ్ళి దింపడం, అంత వరకూ తిండి పెట్టడం, అది చాలు' అని చెప్పా లనుకున్నాడు. తీరా ఇపుడు వచ్చాక, అసలు అమెరి కన్ ఓడల వాళ్ళకి నౌకర్ల అవసరం ఎందుకుండాలి అనిపిస్తోంది. అవసరం ఉన్నా, వాళ్ళు తన బట్టలూ వాలకం చూసి ముచ్చటపడి తీసుకోవడం కష్టం. సిఫార్సు లేవైనా దొరికితే బాగుండునేమో ? ఎవరు ఇవ్వాలి ? ఎవరు ఇస్తారు ? తను లోగడ పనిచేసిన చోట్ల నించి ఉత్తరాలు చూపించ మంటే ఎక్కడ పుట్టించగలడు ?

పరిపరివిధాల ఆలోచిస్తూ నిలబడ్డ పాస్పొర్తూ దృష్టి ఒక పెద్ద అట్టమీద పడింది. ఎవడో హాస్యగాడిలా ఉన్నాడు. వాడు దాన్ని మోసుకు వూరేగుతున్నాడు. అట్టమీద ఇంగ్లీషులో రాసి ఉంది.

గౌరవనీయులైన విలియం బటల్కర్
గారి
జపానీస్ సాము గరిడీల బృందం
వారి
ఆఖరు ప్రదర్శనం.
అమెరికాకు తరలివెళ్ళే ముందు,
లాంగ్‌నోసెస్ ! లాంగ్‌నోసెస్ !
సాక్షాత్తూ టెంగూ దైవం రక్షణ క్రింది
ఇచ్చే చివరి ప్రదర్శనం.
అద్భుతం ! గొప్ప ఆకర్షణ !

ఈ పదజాలం అంతటిలోను పాస్పొర్తూకు కొట్టొచ్చినట్టు కనబడి అతని ఆకట్టుకున్నది అమెరికా ప్రయాణం అన్న రెండు మాటలు.

"మన క్కావలసిం దదేగదా !" అనుకుంటూ ఆ అట్ట వెంబడే వెళ్ళాడు. తిరిగి, తిరిగి ఆ అట్ట జపానీయుల వాడకే వచ్చింది. ఓ పావుగంట గడిచే సరికి ఒక పెద్ద భవనం ముందు ఆగింది. అక్కడ అంతా పెద్ద పెద్ద పతాకాలతో, తోరణాలతో, రంగు హంగులతో కోలాహలంగా ఉంది. ముందు వెనకా, కుడి ఎడమా లేకుండా, కొట్టొచ్చినట్టు వేసిన ఆ రంగులు, ఆ తరహా అది ఒక గండి, గారడీ దండు విడిసినచోటు అనిపించేలా ఉన్నాయి. అదే గౌ. బటల్కర్‌గారి ప్రదర్శనశాల. అమెరికన్ సర్కస్‌లో బార్నమ్ లాటివాడు ఈ ప్రాంతాల కీయన. ఆయన కంపెనీలో సాముగరిడీలు చేసే వాళ్ళు, గారడీలు చేసేవాళ్ళు, తాళ్ళమీద నడిచే వాళ్ళు ఇంకా అనేక సర్కస్‌విద్యలు ప్రదర్శించే వాళ్ళు, హాస్యగాళ్ళు, విదూషకులు రకరకాలవారు ఎందరు ఉన్నారు.

పాస్పొర్తూ, ఆ భవనం గుమ్మంలో నిలబడి బటల్కర్ గారిని చూడాలన్నాడు. కొద్ది నిముషా లలో ఆయనే వచ్చేశాడు. పాస్పొర్తూ వేషం చూసి జపానువా డనుకుని "ఏం కావాలి ?" అన్నాడాయన.

"మీకు నౌకరు కావాలా ?" అన్నాడు పాస్పొర్తూ.

"నౌకరా ?" బటాల్కర్ మందహాసం చేశాడు. మెత్తగా ఏపుగా ఉన్న గడ్డం నిమురుకున్నాడు.

## జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెం వేసి సేవకుడు పాస్పొర్తుతో బయలుదేరు తాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ ఫాగ్ దొరికాడని, అరెస్టుకు బొంబా యికి వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్ వెంట సూయజునుంచి బొంబాయికి చేర తాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరలేదు. బొంబాయినుంచి కలకత్తాకు రైలుబండిలో ప్రయాణం అవుతాడు ఫాగ్. కోల్బీ వద్ద బండి ఆగిపోగా గత్యంతరం లేక ఏనుగుకొని అలహాబాదు వెళ్ళుతారు. దారిలో బల వంతంగా సహగమనానికి పోతూఉన్న అయూదాను రక్షించి ఆమెతో కల కత్తా చేరుకొంటాడు ఫాగ్. అక్కడ వారిని నిలపడానికి ఫిక్స్ చేసిన యత్నం విఫలమైంది. ఫాగ్ ప్రభృతులు 'రంగూన్' ఓడలో పయనం ప్రారం భించారు. ఆ ఓడలోనే ఉన్నాడు ఫిక్స్. ఫాగ్‌ను అరెస్టుచేయడానికి భోగట్టా సేకరించాలని పాస్పొర్తూను చేరదీశాడు. కాని అంతు చిక్కలేదు. లండన్ విడిచిన38రోజులకు హాంకాంగ్ చేరుకొని, అయూదాతో 'కర్నాటిక్' లో యోకహామా ప్రయాణానికి ఏర్పాటు చేసుకొన్నారు. కాని ఆ ఓడ తప్పిపోయింది. దానిని షాంగ్‌హైలో అందుకునేందుకు ఫాగ్ "టాంకెడియర్" అనే పడవను కుదుర్చు కొని బయలుదేరాడు. పడవ ఫోకీయన్ జలసంధి ప్రవేశించాక తుఫాను వచ్చింది.

# 80 రోజుల్లో భూ ప్రదక్షిణం

"నా దగ్గిర ఇద్దరు నౌకర్లున్నారు విశ్వాసపాత్రులు చెప్పినట్లల్లా విని పని చేసేవారు వచ్చినప్పటినుంచి వదలిపోకుండా చాకిరీ చేస్తున్నారు జీతభత్యా లడగరు. తిండి పడేస్తే నంతే వాళ్లెవరంటావా ? ఇదుగో" అంటూ బలిష్ఠమైన, దృఢమైన తన చేతులు రెండూ జాచాడు దండిగా, కండలు తిరిగిన ఆ చేతులకేసి ఒక క్షణం చూశాడు పాస్పార్టూ వాటిమీద నరాలు బాస్ వయొల్ వాద్యంమీది తీగలలా లావుగా కనిపిస్తున్నాయి

"అయితే నేను అవసరంలే దంటారు"

"అవును"

"అంతా నా శని లెండి .. మీతో అమెరికా పోవచ్చునని ఎంతో ఆశపడ్డాను" అన్నాడు పాస్పార్టూ నిట్టూర్చి

బటల్కార్ అతనికేసి తేరిపార చూశాడు "హరిని ! నువ్వు ఇక్కడివాడివి కావు నువ్వు జపానువాడివైతే నేను కోతినైనంత ఒట్టు ఏమిటీ వేషం ? ఎందు కిలా ముస్తాబయ్యావు ?" అన్నాడు నవ్వి

"బావుంది ఎవడికి చేతనైనట్టు వాడు బట్టలు వేసుకుంటాడు."

"అంతే, అంతే అయితే నువు ఫ్రెంచివాడివి అవునా ?"

"అవును పారిసియన్ని పారిస్‌లోనే ఉంటాను

"ఇంకేం. అయితే నీకు వెకిలి చేష్టలు బాగా చేతనై ఉంటాయి అవునా ?"

తనజాతి పేరెత్తగానే అతను వెకిలిచేష్టలనడం చూసి పాస్పార్టూకు పౌరుషం వేసుకొచ్చింది. చిరాకుపడ్డాడు అవునవును మా ఫ్రెంచివాళ్లకి వెకిలి చేష్టలు చేతనవును గాని, మీ అమెరికన్ల ప్రజ్ఞ ముందు మా దెంతలెండి" అన్నాడు

"మరే మరే సరేగాని నీకు నౌకరు పని కాపోయినా హాస్యగాడి ఉద్యోగం ఇస్తాను చూడు బాబూ. ఫ్రాన్సు వెళ్తామనుకో అక్కడ విదేశీ హాస్యగాళ్లని పెడతాం విదేశాలు వెళ్తే ఫ్రెంచివాళ్లని పెడతాం ఇంతే కీలకం"

"ఓ అలాగా"

"నీకు ఒంట్లో బాగా సత్తా ఉందా. చేత ఉందా ?"

"సత్తాకేం బోలెడుంది. భోజనం దగ్గర మరీను"

"నీకు పాడడం వచ్చు అవునా ?"

"ఆహా" అన్నాడు పాస్పార్టూ. అతను పూర్వ వీధి గాయకులలో కలిసి పాడి కొంత అనుభవం గడించాడు

"పాడడం అంటే నిటారుగా నిలబడి కాదు. తలకిందులా నిలబడి పాడాలి. ఎడమ అరికాలిమీద ఒక బొంగరం గిఁరున తిరుగుతూఉంటుంది. కుడి దానిమీద, కత్తిని మొనమీద మోపి నిలబెట్టారు."

"సెభాష్ దానికేం" అన్నాడు పాస్పార్టూ ఈ విద్యలు కూడా తాను లోగడ గడించిన అనుభవం నెమరువేస్తూ

"అయితే ఇంకేం" అన్నాడు బటల్కార్

పాస్పార్టూ ఆ సర్కస్ కంపెనీలో కొలువుకు కుదిరాడు జపాను జనాభాలో కలిసిపోయాడు. చెప్పిన పనల్లా చెయ్యాలని చెప్పి మరీ తీసుకున్నాడు బటల్కార్. ఏమంత హాయిగా అద్భుతంగా ఉండదు కాని ఒక వారం రోజులు ఓపిక పడితే శాన్ ఫ్రాన్సిస్కో వెళ్లి పడచ్చు

ఆనాటి ఆఖరు ప్రదర్శనం 3 గంటలకే ఆరంభం కావలసి ఉంది వేళ కాగానే భువనభాలను అదరకొట్టి హోరుమనిపించే జపానువాద్య సమ్మేళనం—టాంటాంలు, డమ్ములూ సహా పుంజుకుని ఫెళ్లున మోగసాగింది. పాస్పార్టూకు తొలి ప్రదర్శనంలోనే అన్ని కార్యక్రమాలలోనూ పాల్గొనే పాత్ర ఇవ్వడానికి వేళ చాలదు అందుకని ఆ పూటకి ఒకటే పని యిచ్చారు ప్రదర్శనంలో ఆఖరిది "మానవ గోపురం" టెంగో దేవుడి "లాంగ్ కోసెస్" బృందంవాళ్లు ఒకరిమీద ఒకరు నిలచి పిరమిడ్ నిర్మిస్తారు. ఆ ప్రదర్శనంలో అడుగున నుంచి జబ్బపుష్టి ప్రదర్శించవలసిందని పాస్పార్టూను పురమాయించారు

మూడు అయేసరికి ప్రదర్శనశాల ప్రేక్షకులతో నిండిపోయింది. యూరోపియన్లు, స్థానికులు, జపానీయులు—స్త్రీ పురుష బాల వృద్ధులంతా వచ్చి సన్నటి బల్లమీద సర్దుకు కూర్చున్నారు కొందరు రంగస్థలానికి ఎదురుగా నిర్మించిన ప్రత్యేకమైన బాల్కనీలలో కూర్చున్నారు. కొద్ది సేపటిలో నానా వాద్య సమ్మేళనం ప్రారంభమై క్రమంగా విజృంభించి హోరెత్తించ సాగింది

ప్రదర్శన కార్యక్రమం మామూలుగా ఈ తరహా ప్రదర్శనాలన్నిటా ఉండేదే అయితే నేల విడిచి సాముచేసే విద్యలో జపానువారు ఘనులని చెప్పక తప్పదు ప్రపంచంలో వారిదే అగ్రస్థానం. తాడుమీద నడవడం, నడుస్తూ తమాషాలు చెయ్యడంలో ఆ ఒడుపు, సొగసు అన్యులకు రావు ఒకడు ఒక విసనకర్ర కాసిని కాగితం ముక్కలూ పట్టుకుని పువ్వుల సీతాకోక చిలుకలా తమాషాలన్నీ చేశాడు ఇంకొకడు పైపు ముట్టించి, వాసన కొడుతున్న ఆ పొగతో గాలిలో నీలిరంగు అక్షరాలూ మాటలూ వూదుతూ పోయాడు అందులో ప్రేక్షకులకు అభివందనం, ప్రశంస పొందు పరిచాడు తరువాత వెలుగుతున్న కొవ్వత్తులను ఎగరేస్తూ తమాషాలు చేశాడు ఒక వంక అవి చూస్తూనే అది ఎగిరి తన పెదిమల ముందుగా పడుతున్నప్పుడు వూది వాటిని ఆర్పడం, తిరిగి మరోచేత్తో క్షణం విరామం లేకుండా వెలిగించడం చేసి ప్రేక్షకులను విస్మయ పరిచాడు తర్వాత మొదటివాడు తిరుగుతున్న బొంగరాలతో, బుర్రగింగిరాలు తిరిగిపోయేటంత అద్భుతమైన విద్యలు ప్రదర్శించాడు గుయ్‌మని రొద పెడుతూ ఎటు పడితే అటు వెడుతున్న ఆ బొంగరాలు జీవం స్పందిస్తున్నట్టే తోచింది. ప్రదర్శకుడు, మాంత్రికుడూ, అవి మంత్రముగ్ధ

అయినా జీవులూ అయినట్టనిపించింది. అంతే చైతన్యవంతంగా, అవి పై గొట్టాలమీద, కత్తి అంచులమీద, వెం(డుకల కన్న వెం(డుకవాసి నన్న మనిపించే తీగలమీదా అటూ యిటూ తిరుగుతూ మధ్యలో గాజు కూజాలకు (ప్రదక్షిణాలు చేస్తూ, నిచ్చెన లెక్కి దిగుతూ నలుదెసలా చెదిరి పోతూ, మళ్లీ కొత్త కొత్త మోస్తర్లలో కలిసి పోతూ సర్వజన మనోహరంగా విహరిస్తూ ఉంటే, విద్యలో (ప్రదర్శిస్తున్నది. అవేనేనే నన్న (భమ కలిగింది. అసలు (ప్రదర్శకులు వాటిని పట్టుకు పైకి కెగరేసినా తిరుగుతూనే ఉన్నాయి క(ర చెక్కలతో అటూ యిటూ బంతుల్ని కొట్టినట్టు కొట్టి ఆడినా తిరుగుతూనే ఉన్నాయి. పట్టుకు జేబులో పడేసుకుని కాసేపుంచి పైకి తీసినా తిరుగుతూనే ఉన్నాయి. అలా తిరగ్గా తిరగ్గా వాటిలో ఒక (స్ప్రింగు తన వేళ కాగానే డ్యూటీలోకి వచ్చింది. వెంటనే అవి ఒక పెద్ద చైనీస్ వృక్షంలా మారిపోయాయి.

ఇక అక్కడివారు చేసిన సాము, గరిడీలు ఎంత వర్ణించినా (ప్రయోజనం ఉండదు. నిచ్చెనలు, రాటలు, బంతులు, సీసాలూ, పీపాలూ వుచ్చుకొని వాళ్లు చేసిన విద్యలు కొల్లలు అన్నీ క్షణంలో నగం కూడా తేడా లేకుండా చేశారు అసమానమైన కౌశలం చూపారు. అన్నిటికన్న మిన్న అయినది "లాంగ్ నోసెస్" జట్టు (ప్రదర్శనమే విద్యను యూరప్‌వాసులు ఇంకా చూసి ఎరగరు

ఈ 'లాంగ్ నోసెస్' జట్టు సాక్షాత్తూ టెంగో దేవుడి కటాక్షవర(ప్రసాదితులు వీరు మధ్య యుగపు వీరులలా దుస్తులు ధరించి ముస్తాబు అయి ఆపైన ఎడాపెడా రెండు (బ్రహ్మండమైన రెక్కలు తగిలించుకొంటూరు. ఈ రెక్కల కన్న, ఆ వేషాలకన్న కొట్టొచ్చినట్టు కనబడేవి వాళ్ల ముక్కులే. వాటినిబట్టే వారికి 'లాంగ్ నోసెస్' అని పేరు వచ్చింది. వాళ్ల వదనాలను అలంకరించే ఆ ముక్కు ఆపాటి ఈపాటిది కాదు, వెదురు పాటిది. ఐదారడుగుల పొడుగు పాటిది. కొన్ని మక్కులు పది అడుగుల పొడుగు కూడా ఉన్నాయి. కొన్ని వాళ్ల అసలు ముక్కుకు సూటిగా పోయే ముక్కులు. కొన్ని వంకరటెంకర ముక్కులు కొమ్ములు తిరిగిన ముక్కులు వంకర తిరిగినవి నున్నవిగా ఉన్నా, సూటిగా ఉన్న వాటికి మా(త్రం కణుపు లున్నాయి తాళ్లు పోసి బిగించి కట్టిన ఈ ముక్కుల మీదనే వాళ్లు (బ్రహ్మండమైన విద్యలన్నీ (ప్రదర్శిస్తారు ఈ టెంగూ వర(ప్రసాదులు పన్నెండుమంది వెల్లకిలా పడుకున్నారు. ముక్కులు పైకెత్తి. వారి జతగాళ్లు, మెరుపు తీగల్లా వేషాలు వేసుకుని వచ్చి ఈ ముక్కుల మీదికి ఒక్కసారిగా దుమికి గెంతులు, మొగ్గలు, లంఘనాలు, చూసేవాళ్లని విస్మయంతో తల కిందులు చేసిపారేసే పిల్లి మొగ్గలూ అన్నీ వాటి మీద (ప్రదర్శించారు

చిట్టచివరది "మానవ గోపుర నిర్మాణం." 50 మంది నాసికా(గేసరులు కలసి జగన్నాథ రథం నిర్మించడం. అయితే గోపురాలు వేసే వాళ్లంతా చేసినట్టు భుజాలు భుజాలు పట్టుకు నిలబడే బదులు వీళ్లు ముక్కులు ముక్కులు దన్ను పెట్టుకుని అందుకు ఉద్యమించారు ఈ జట్టులు ఈ జగన్నాథ రథానికి, అట్టడుగున (ప్రాతివదిక వేదికగా నిలబడడం రివాజైన వారితో ఒకడు 'మీ జట్టుండ' నని చెప్పి వెళ్లిపోయాడు. ఆ ఖాళీ భర్తీ చేయడం సామాన్యులవల్ల కాదు రథ భర్త, బెబ్బపుష్టి, వోర్పు ఉన్నవాడు కావాలి పాస్పారూను అందుకు నియోగించాడు బటల్కార్.

పాస్పారూ ఆ వేషం వేసుకునేసరికి తన పడుచుదనపు రోజులు గుర్తుకొచ్చాయి. మనసు దిగులు కమ్మింది. అంతా మధ్యయుగపు హీరో వేషం కట్టారు. రెక్కలికి రెండ రెక్కులు తగిలించారు. ఆరడుగుల పొడుగు ముక్కు తెచ్చి బిగించారు. అది చూడగానే మరీ దిగాలుపడి పోయాడు తనదుస్థితికి కాని తప్పదు ఇది కూడా గుడ్డా పెట్టి ఇంటికి తీసుకెళ్ళే ముక్కు. (ప్రస్తుతం అవసరం గడవడానికి ఈ ముక్కుకు సూటిగాపోవాలి.

పాస్పారూ రంగస్థలం మీదికి వెళ్లి జగన్నాథ రథ వేదికగా నిలబడే తోటివారి పక్కనిలబడ్డాడు అంతా వెల్లకిలా పడుకున్నారు ముక్కులు నిటారుగా నిలబెట్టి. తరువాత రెండో జట్టు జనం వచ్చి ఈ ముక్కుల మీద ఎక్కారు ఆపైన మూడోజట్టు వచ్చి రెండో అంతస్తు, నాలుగో జట్టు మూడో అంతస్తు ఏర్పరచాయి ముక్కు కొనలమీదనే ఇలా కట్టుకుంటూపోయి పోయి రంగ స్థలం పైకప్పు నందుకుంది రథ గోపురం.

ఒక్కమారుగా కరతాళధ్వనులు, హర్షధ్వానాలూ చెలరేగాయి అందుకు తీసిపోకుండా వాద్య సమ్మేళనం విజృంభించింది. అంతా ఉరుములూ, పిడుగులూ పడుతున్నంత ధ్వని అయింది మెరుపు మెరిసినంత కాలంలో పిడుగు పడ్డట్టయి జగన్నాథ రథం గభాలున నేల కూలిపోయింది. పేక మేడలా పడిపోయింది అపుడు చూస్తే అందులో ఒక్క ముక్కు లెక్కకి తక్కువయేది

ఆ ముక్కు పాస్పారూది. అది చెప్పకుండా పెట్టకుండా "(ఫెంచిలీవు" తీసుకు గైరు హాజరవడం దాని తప్పుకాదు. (ఫెంచివాడు దాని తాత్కాలిక యజమాని అయిన పాస్పారూది అతను ఉన్నట్టుండి హఠాత్తుగా కదిలి లేచిపోయి దీపాల వరస దాటి, రెక్కలు వాడకుండానే ఎగిరి, ఎదురుగా ఉన్న బాల్కనీలో వాలి, ఒక (ప్రేక్షకుడి ముందు కూలి,

"అయ్యా ! స్వామీ ! (ప్రభూ !" అంటూ దండాలు పెట్టసాగాడు.

"నువ్వా ! ఇక్కడా ?"

"నేనే నేనే"

"అయితే సరే అబ్బీ తిన్నగా స్టీమరుదగ్గరికి నడు"

నడవడ మేమిటి. పరుగెత్తాడు పాస్పారూ. అతని వెనకే ఫిలియస్‌ఫాగ్, అయూదాలు బయల్దేరారు. వీధిగుమ్మం దగ్గర కొచ్చేసరికి సర్కస్ అధిపతి బటల్కార్ స్వాగతం యిచ్చాడు. చేసిన రసాభాసానికి నష్టపరిహారం యివ్వమని అతని ఉ(ద్రిక్తోపన్యాస సారాంశం. పాస్పారూ ఆగలేదు. ఫాగ్ కూడా ఆగలేదు కాని త్వరగా నడుస్తూనే పట్టెడు నోట్లు తీసి బటల్కార్ వేపు విసిరాడు. అతను శాంతించి అవి ఏరి లెక్కపెట్టుకోవడంలో మునిగిపోయాడు.

కొద్ది నిముషాల తరువాత ఫిలియస్‌ఫాగ్, అయూదాలు, ఆ వెనక భయభక్తులతో 'రెక్కలు కట్టుకుని" అనుసరిస్తున్న భృత్యుడు పాస్పారూ రేవు చేరి అమెరికన్ నౌక ఎక్కిపోయారు.

పాస్పారూ ఆరడుగుల ముక్కుకూడాకూడావచ్చింది

(ఇంకావుంది)

(గతసంచిక తరువాయి)

విసుగులేకుండా నా ప్రయాణం కొనసాగుతూనేవుంది. కొన్ని రాత్రులూ, కొన్ని పగళ్లూ ఆయాసం లేకనే గడిచిపోయాయి. మంచు పడినపుడెల్లా ఆపక్షులే నాపైన రెక్కలను గప్పేవి. రాత్రులలో తమపత్రాలనే అవి నాకు పడకగానూ, ఆచ్ఛాదనం గానూ అమర్చి నా కెంతో సుఖం కలిగించేవి. అంతే కాదు, నా ఆకలిని తీర్చడానికని వాటిలోనుండి వారానికొకటి చొప్పున స్వచ్ఛందంగా తమ ప్రాణాలను ఆహుతి చేసేవి. అందువల్ల నాకు వారం రోజులదాకా ఉదరపోషణ జరుగుతూ వుండేది. నా కోసమని అవి పడిన శ్రమనూ, చేసిన త్యాగమునూ చూచి నా కళ్లు చెమర్చాయని చెప్పనవసరం లేదు.

## 4

సుమారు యిరువదిరోజులు ప్రయాణం చేసి మొట్టమొదటగా ఆ తపోభూమిలో కాలుపెట్టేటప్పటికి నా సంతోషం పరవళ్లుతీసింది. ఎందువల్లోగాని నేనా ఆశ్రమానికి దాపుగా వెడుతున్నకొద్దీ నాలో విచిత్రమైన మార్పులు కలుగనారంభించాయి. మనసులోనూ, శరీరంలోనూ ఒకవిధమైన పెనుతుపాను బయల్దేరింది. ఆ తుపాను తాకిడికి నా సర్వస్వం దూది పింజల మాదిరి ఛిన్నాభిన్నమై, అందులో లయమై పోతున్నట్లనిపించింది. ఇది ఎంతవరకూ పరిణమించిందంటే, నేనా ఆశ్రమప్రాంతం చేరుకుని ఋషికన్యపై దృష్టి నిలిపానో, లేదో, వెంటనే నేనొక శిలాప్రతిమగానూ, నా ఈస్థితికి జాలిపడి కేకపెట్టిన ఋషికన్య స్పృహాహీనగానూ మారిపోయాం. దాంతో నన్ను తమవెంట నడిపించి, అంతదాకా కొనితెచ్చిన ఆ వింతపక్షులు ఏమయ్యాయో నాకదేమీ తెలియలేదు.

బహుశా, తనకూతురు పెట్టిన గావుకేక విని యోగి తన సమాధి నుండి మేల్కొని వుంటాడు. అతడు దివ్యదృష్టిలో జరిగినదంతా తెలుసుకుని వివిధ ఉపచారాల మూలంగా తన ముద్దులపట్టిని సేద దేర్చడమే గాక, నన్ను కూడా తన తపోబలంతో పునరుజ్జీవింపచేశాడు. గాఢనిద్రనుండి మేల్కొన్నవాడిలా కళ్లు నలుచుకుంటూ చుట్టూ కలయజూసేసరికి దేహమంతటా నిడుయోగపట్టెలు దిద్దకుని, మిసిమిరంగుతో ఒప్పారుతున్న మునివరుడూ, ఆయన సన్నిధిలో నా వూహాసుందరీ కన్పించారు.

నాకా సమయాన ఆనందసాగరంలో మునకలువేస్తున్నట్టు అనిపించింది. ఎందుకంటే, ఆ ఋషికన్యను గూర్చి నేనూహించిన దానికంటె వేయిరెట్లు సౌందర్యంగావుంది ఆమె. ఆ సుందరి అవయవాల సొంపూ, శరీరలావణ్యమూ, కన్నులలోని తేజస్సూ......అవన్నీ చెప్పడానికి మాటలు చాలవు. నేను శిలగా మారడాన్నిగురించి ఓం ప్రథమంగా ఆ యువతి ప్రశ్నించినప్పుడు ఎటువంటి వీణానిక్వాణమైనా ఆ కంఠస్వరం ముందు తీసికట్టనని అనిపించింది.

కొద్దిసేపటిలో ఆ ఋషి తిరిగి తన ఏకాంతానికి వెళ్లడం చేత నేనా మునికన్యతోపాటే వుండిపోయాను. జన్మజన్మాంతరాల సంబంధమేదో మా వుభయులమధ్య వున్నదన్నంత సన్నిహితంగా మేము అనేకవిషయాలు మహానందంగా ముచ్చటించుకున్నాం. ఈవిధంగా మూడుజాములు గడిచాయి. అప్పటికి మునిసత్తముడు మళ్లీ ఓసారి మా దగ్గరికి వచ్చాడు.

"నాయనా! నీవు యింతదూరం అనేక ప్రయాసలకోర్చి రాగలగడంతో యీ కన్నియ నీ కోసమే జన్మించిందని నేను గ్రహించాను. ఈ అమ్మాయి అందచందాలు విని దేవతలే యీమెను వరించడానికి ప్రయత్నించారు. అయితే, మేము మనుష్యమాత్రులమనీ, మనుష్యులలోని వాడే యీ మర్త్యబాలను చెట్టబట్టడం వాంఛనీయమనీ దేవతలకు స్పష్టం చేశాను. మనుష్యుల్లో కూడా స్వయంగా ఎన్నో కష్టాలకు తట్టుకుంటూ యింతదూరం రాగలవానికే నా కూతురి నర్పిస్తానని ప్రతిజ్ఞ చేశాను. ఏతదనుసారం యిప్పుడు నీ రాకడ సాధ్యపడింది. అంచేత నీవే యీమెను పొందడానికి అర్హుడవని నా భావం. ఇక ఆలస్యం చేయకుండా ఒకానొక శుభముహూర్తంలో నా పుత్రిని నీ కర్పించి కర్తవ్యం నెరవేర్చుకోదలిచాను. ఇరవైనాలుగు జాములకాలం నీవు మా ఆతిథ్యం స్వీకరించవలసింది. అప్పటికా సుముహూర్తం ప్రవేశిస్తుంది" అని ప్రసన్నవదనంతో చెప్పి ఆ తాపసి వెళ్ళిపోయాడు.

తండ్రి వెళ్ళగానే ఆ యువతి నాకేసి దీనంగా చూస్తూ తనకూ మనసులో ఓ సంశయం ఉందని, దానికి కట్టుబడివుంటేనేగాని నేను తనను పొందటం సంభవం కాజాలదని ఎంతో వ్యథతో చెప్పింది.

ఆమె ఎంత ప్రశాంతంగా ఆ మాటలు పలికినప్పటికీ అది వినడంతనే ఒక్కసారిగా నా [illegible]

హం క్రుంగి, కూలారిపోయింది. గుండెలు దడదడ కొట్టుకున్నాయి. కళ్లు మూతలుపడినట్లయింది. ఇక ఎంతోసేపు భరించలేక ఆమె తల పైకెత్తాను. "సుకుమారీ! ఆ నీ దీక్ష ఏమిటో సత్వరమేచెప్పి నన్ను కృతకృత్యుని చేయవలసిందిగా కోరుతున్నాను. ఇక యిప్పుడు నా సామర్థ్యాన్ని పరీక్షించడమనే సమస్యే అక్కరలేదు. నా హృదయసామ్రాజ్ఞిని 'నాది'గా చేసుకొనుటకు ఎటువంటి పంతమైనాసరే నెరవేర్చడానికి సిద్ధంగా ఉన్నాను" అని అనునయించాను.

నా మాటల్లోని గాంభీర్యమూ, నిశ్చలతా చూసి ఆ యువతి కన్నులు తామరపూవుల్లా విప్పారినాయి. బంగారు కడ్డీల్లాంటి తన రెండుచేతులనూ మహానందంగా నా మెడకు చేరవేసింది. 'చెప్పమంటారా' అన్నట్టు కొంటెగాచూస్తూ యిలా అంది. "ఆర్యపుత్రా! మరేం లేదు. నన్ను వివాహంచేసుకోవాలని నిర్ణయించుకున్నవారు యిక యిక్కణ్ణుంచి తిరిగిపోవాలనే తలంపు పెట్టుకోకూడదు. అలా ఇష్టపడేవారినే నేను నా హృదయంలో నిలుపుకుంటాను. అలా జరుగనినాడు నాకు వివాహమే అక్కరలేదు. నా తండ్రిని యీ దశలో ఏకాకిగా విడిచి నేను జీవించలేను. ఇదే నా దీక్ష. అది తీరనప్పుడు జీవితాంతం కన్యగానే ఉండిపోవడానికి నిశ్చయించుకున్నాను."

తీరా ఆమెపంతం తెలిసి నవ్వాపుకోలేకపోయాను. ఎంచేతంటే, మొదట ఆమె చెబుతూన్నపుడు అదెంత భయంకరంగా ఉంటుందో, దానికొరకు నా జీవితాన్నే పణంగా ఒడ్డవలసి వుంటుందేమో అనుకున్నాను. అందులో ప్రమాదగర్భితమైందిఏమీలేదు. అసలింతకూ ఆవిడను చూసినతరువాత యింటికి తిరిగిపోవాలని కోరుకునే దెవడు? ఆ వాతావరణమూ, అదంతా చూస్తేనే యింక యితర విషయాలేవీ జ్ఞప్తికిరావు.

"ఇది ఏమంత ఘనకార్యం ప్రేయసీ? 'రమ్యప్రేమా న జన్మభూమి అని లోకోక్తి. సూర్యుడు ఎల్లవేళలా పరిభ్రమిస్తూ వుండేదీ, ఇందుబింబంలాగా నీ వదనారవిందం నిత్యం వుదయిస్తూ వుండేదీ అయిన భూమిని మించిన ప్రదేశం వేరే ఏమి వుంటుంది చెప్పూ? నన్ను ఆ మాత్రం విశ్వసించలేవా?"—అన్నాను, ఆలస్యంచేయకుండా.

నేనావిధంగా అనడంతోనే ఆమె తన నవ్వులగారడీని నాపై ప్రయోగించింది.

## 5

మాటల్లోనే ఇరువది నాలుగు జాములూ గడిచాయి. నాలో చిన్ననాటినుండీ పాదుకుపోయిన కోర్కెలు యీడేరే శుభగడియ ఆసన్నమైంది. సరిగా ముహూర్త సమయానికి మహర్షి అక్కడికి విచ్చేశాడు. తోడనే విధిప్రకారము మా శుభకల్యాణమును సుసంపన్నము చేసి, మావైపు తనివిదీర చూస్తూ, ఓసారి నిట్టూర్చి, తిరిగీ తనదారిని తాను వెళ్లిపోయాడు.

మేం నవదంపతులం చేయీ చేయీ కలిపి పట్టుకుని అలా నీహార ప్రదేశంలో స్వేచ్ఛావిహారానికి బయలుదేరాం. నా కొదవిన మహాద్భాగ్యమును తలుచుకొని శచీదేవి సమేతంగా నందనవనంలో విహరిస్తున్న దేవేంద్రుడిలా అప్పుడు నన్ను నేను పోల్చుకున్నాను. హాయిగా సరససల్లాపాలాడుతూ ఎంతోదూరం ముందుకు సాగిపోయాం. ఓ చోట దట్టంగా మంచు కురిసి, పొరలు పొరలుగా పేరుకుపోయివుంది. నాకైతే ఉత్సాహంలో ఏమీ అనిపించలేదు కాని, ఆ ఋషికన్య హిమశైత్యానికి తాళలేక బాధపడుతోందని గ్రహించాను. అందుకు నేను చేయగలిగిందాట్టే లేకపోయినా, ఊరికే, "సఖీ! ఇక్కడే మంచును పెకలించి నీకోసం ఓగుహానిర్మిస్తాను. అందులో వుంటే నీకు శీతబాధ లేకుండాపోతుంది" అన్నాను అలవోకగా.

అన్నానేకాని, నా ప్రేమాలాపనకి కొత్త పెళ్ళిపడుచు ప్రత్యుత్తరం ఏదీ యివ్వలేదు. మౌనంగా ఆకాశంకేసి అదేపనిగా చూడ్డంలో లీనమైపోయింది. ఆమె చూడ్కులు ఆకాశపు టంచులను చీల్చుకుపోయి, ఆవలిదృశ్యాలను దర్శించగలుగుతున్నాయేమో అనుకున్నాను. కుతూహలం పట్టలేక "ఏమిటాలోచిస్తున్నావు ప్రియా?" అనడిగాను—ఆమె ధ్యానభంగం చేస్తూ.

"ఏమీలేదు ఆర్యపుత్రా! ఎటూపాలుపోక, మీ దేశం ఎలా వుంటుందోనని ఊహించుకుంటున్నాను," అంది—మందహాసంగా.

"ఏం, ఎందుకూ?"

"ఎందుకంటే... అది మీ దేశం కాబట్టి"

ఆమె యథాలాపంగా ఆమాట అన్నదేకాని అందువల్ల నా ఆలోచనలు జన్మభూమివైపు హఠాత్తుగా

పరుగుతీశాయి. నా మీది బెంగ వల్ల మా అమ్మ ఎలా వుందో? మా నాయన నా ఎడబాటును ఏవిధంగా సహిస్తున్నాడో?.. ఆ విషయాలన్నీ తలపుకువచ్చి మనసులో కల్లోలం బయల్దేరింది. బలవంతంగా ప్రయత్నించి నా భావాలు బయట పడకుండా అణచిపెట్టాను.

నా భావాలను ఋషికన్యగానీ పసికట్టలేదుగదా అనుకుని భయపడ్డాను. ఉద్రేకంతో శరీరం వేడెక్కి, కన్నులు మూతపడి, తూలి క్రిందపడబోగా నేను వత్తాసి యిచ్చి కౌగిట్లోకి తీసుకున్నాను. కొద్ది క్షణాల్లో యధాప్రకారం తెప్పరిల్లి నా వైపు బిత్తరపడి చూసింది. తిరిగి వెంటనే పదండి. మన కళ్యాణ మంటపం యింకా అలాగే పడివుంది. దానిని విప్పి, ఎక్కడి సరంజామా అక్కడికి చేరవేయాలి" అంది నిదానంగా. ఇరువురమూ ఆనందంగా వెనక్కుతిరిగి ఆశ్రమానికి చేరుకున్నాం.

## 6

మరి మూడుజాములు గడిచాయి. దంపతులం యిద్దరమూ వెళ్ళి ఓ రమ్యమైన ప్రదేశంలో కూచుని సరసోక్తులాడుకొనుటలో మునిగిపోయాం. అప్పటికి తాపసి కాస్త తీరికచేసుకుని మేం వున్న వైపు వచ్చాడు. మేం లేచి ప్రత్యుత్థానం చేశాం. అందుకు ఆయన ముఖం శతపత్ర కుసుమంలా వికసించిపోయింది. బహుశా, మా దాంపత్యం చూసి ఆయనకూ ఒకనాటి తన గార్హస్థ్య జీవితం జ్ఞప్తికివచ్చిందేమో!

మహర్షి తృప్తిగా మందహాసం చేస్తూ మమ్మల్ని సమీపించాడు.

# బాల్యం

బి. పురుషోత్తం

ఒక సారే బ్రతుకున బాల్యం
ఇక నెన్నడు రాదా భాగ్యం
చిన్నారి పొన్నారి కాలం
చీకూ చింత లేని కాలం.

అమ్మకవుంగిటిలో శయనం
అది చేకూర్చే ఆనందం
బెరికి నెరుంగక దిగంబరం
ధరించి తిరిగే దైవత్వం

పక్కింటబ్బికి తోడ బెల్లం
పట్టించి పరుగెత్తివేగం
అమ్మ వెనుక చేరిచి కాయం
తొంగి తొంగి చూచే కాలం

ఉల్లా సీదాగా నిత్యం
ఊరంతా తిరిగడి కాలం
వేళకు భుక్తికి నిజగేహం
వేంచేసెడి మారాజు తనం

కనుడీ వచ్చినది వసంతం
అని వినిపించు కుహూగానం
అనుకరించి కోయిల రోషం
కనిపెట్టే తియ్యని కాలం

కోతి కొమ్మంచుల కాలం
దాగుడు మూతల చెలికారం
గాలిపడగలెత్తే కాలం
గుజ్జన కూళ్లు దినే కాలం

అమ్మా నాయన అనురాగం
కట్టలు తెగి పారినకాలం
అవ్వా తాతల అభిమానం
అందల మెక్కించే కాలం

మరవశక్యమగునే బాల్యం
మరలా లభించ దాభాగ్యం
ఆహా బాల్య మెంత మధురం
హాయి హాయి హాయీ బాల్యం.

ఋషికన్య సిగ్గుపడుతూ వెళ్లి తండ్రి ప్రక్కనే కూర్చుంది. ఆయన ఆప్యాయంగా కూతురుతల నిమురుతూ నాతో యిలా అన్నాడు.

"వత్సా, సోమశేఖరా! ఇంత కాలమూ యీ బాలనుగూర్చిన విచారం నా సాధనకు ఆటంకంగా నిలిచింది. ఇప్పుడు యీమెను నీపరం చేయుటతో జనకుడుగా నా కర్తవ్యం నెరవేర్చుకున్నాను. అంతే కాదు, నాలో ఏర్పడివున్న మమత్వం కూడా నేటితో తెగిపోయింది. ఇక మీరు మీ స్వదేశానికి వెళ్లిపోవడమే కర్తవ్యం."

మునికన్యయ అంతవరకూ తండ్రిచెంతనే తలవాల్చుకుని నుంచునివుంది. తండ్రి మాటలు విని ఆమెలో విపరీతమైనభయం చోరబడింది. నిలువునా వణికిపోతూ ఏమిటో అనాలని ప్రయత్నించింది. కాని అనలేకపోయింది.

నేను విభ్రమ ఆశ్చర్యాలతో ఋషిపాదులను సంబోధిస్తూ అన్నాను. "మేం వెళ్లిపోతే యిక్కడ మీ సేవాశుశ్రూషలు..."

"తపస్సు-శుశ్రూష-రెండూ వ్యతిరేకవిషయాలు నాయనా! తాపసులకు శుశ్రూషతో నిమిత్తంలేదు. ఈ బాల తప్పని సరిగా యింతకాలం యిక్కడ వుంటంవల్ల ఆమె పరిచర్యలు గైకొనేవాణ్ణి. దాంతో నాలో ఈమెపట్ల మమకారం కూడా పెరగసాగింది. ఈమెను ఏలోటూ లేకుండా పెంపు చేయాలనీ, యోగ్యుడైన వరుని కిచ్చి వివాహం చేయవలెననీ ఆలోచించడం నాకు అనివార్యమైంది. నా భాగ్యవశాన అది యిప్పుడు పరిష్కారమైంది కాబట్టి ఆమె యిక యిక్కడ నాసేవలకొరకే ఉండనవసరం లేదు. స్త్రీ అంటే జగన్మాత. ఆమెహృదయం కరుణాపూరితం. అందునుండి సంతతధారగా వర్షంకురుస్తూ భూతలంమీాది అగ్నిజ్వాలలను ఆర్పివేయడం యుక్తమవుతుంది. దీనికొరకే ఈమెను నేను కాపాడి వుంచాను ఇప్పుడు దాని ఉపయోగానికి తరుణం వచ్చింది. ఇక తన హృదయంలోని అమృతపుసోనలను కురిపించి తన గృహప్రదేశాన్ని తృప్తిబరచవలసివున్నది" అంటూ నూతనంగా విశాల జీవితంలో అడుగిడబోతోన్న మాకు వుపదేశించాడు.

"తండ్రీ! మేం మిమ్మల్ని వదలి వెళ్ళక తప్పదా?" — ఋషికన్య వ్యాకులపాటుతో అడిగింది.

తాపసి కుమార్తెవైపు మందహాసరోచిస్సుతో తృప్తిగా చూశాడు. "అవును తల్లీ! నిజానికి అదే మీరు నాకు చేయగల పెద్ద సేవ. ఒక సర్వసంగ పరిత్యాగి గృహస్థులతో కలిసి జీవితం గడుపుట నిషిద్ధం. అంచేతే, యిక మీాదట నాకు ఏకాంతం కావాలని కోరుతున్నాను."

దశాబ్దాలుగా ఒక డక్టరు వద్ద 'చికిత్స' పొందుతున్న 'రోగి' ఒకరోజున ఇలా అన్నాడు, "డక్టరుగారూ మీారింతశ్రద్ధగా మందిస్తున్నందుకు మిమ్మల్ని నా వీలునామాలో చేర్చాను!"

"అలాగా? అయితే ఆ మందుచీటి ఇలా ఇవ్వండి, కొంచెం మార్చాలి.." అని జవాబిచ్చాడు డక్టరుగారు ఆత్రంగా.

నేను అవనత శిరస్కుడనై మహర్షి ఆదేశాన్ని అంగీకరించాను. వెంటనే ఆయన "ఇక జామున్నరకు మీా ప్రయాణానికి అనుకూల ముహూర్తం వుంది. అప్పటివరకూ మీారు తగిన సన్నాహంలో వుండండి. సకాలానికి నేనే తిరిగి వచ్చి మిమ్ముల్ని వీడ్కొలుపుతాను" అని తన ఏకాంతానికి వెళ్లిపోయాడు.

తండ్రి ఎడబాటును తలచుకొని ఋషికన్య తనలోతాను కుమిలిపోసాగినది. గతమంతా వర్తమానమై ఆమెకళ్లముందు వికటాట్టహాసం చేస్తున్నదేమో! ఆమె పరిస్థితి చూచి నాకు జాలివేసింది. "ఇంత విచారం దేనికి సఖీ?" అంటూ ఆమెను ఉపశమింపజేయడానికి ప్రయత్నించాను.

"ఏమీాలేదు. గతకాలపు స్మృతులు చాలా బాధాకరంగా ఉంటాయి సుమా!" అంది జీరగొంతుతో.

ఆమె మాటకు ఆమోదం తెలుపుతూ మళ్లీ అన్నాను. "అవును వర్తమానమేకదా గతంగా మార్పుచెందేది?"

ఋషికన్య దీర్ఘంగా నిట్టూర్చి, "అది నిజమే. కాని నేనేం జేయను? నా హృదయం వియోగావస్థను భరించలేదు" అంది.

నాకేమీా పాలుపోలేదు. ఊరికే "అలా బేలవైపోకు సఖీ?" అన్నాను.

ఆమె నావైపు అదోరకంగా గంభీరంగా చూసింది. "మీా పురుషుల్లో మమకారమనేదేమీా ఉండదు. కాని మీాపట్లనే స్త్రీలు తమ మమత్వం ప్రదర్శించాలి — ఇది విధివైపరీత్యం కాబోలు."

# ఋషి కన్య

"కావచ్చు. కాని సుందరీ! నేను నీ కన్నీటిని చూడలేను."

"అవును. మీరు పురుషులు కదా! మీకు ప్రధానంగా రూపం మాత్రమే వుంటుంది. స్త్రీలనుండి మీరు ఆశించేది కూడా అంతే. అంచేతే పురుషుల్ని నేను మమతా రహితులంటున్నాను... ఈ తపోభూమితో నా కింక ఎటువంటి సంబంధమూ లేదని నాకు తెలుసు. మీరు ఎక్కడవుంటే అదే నా యిల్లూ, నా సంసారం. అందుకోసమే నేను పుట్టాను. అయినా, నా మనసు ఎందుకో యీ స్థలాన్ని వదలడానికి అంగీకరించడం లేదు."

గాంభీర్యంతోపాటు, అభినివేశమూ, ఆశ్రమభూమిపట్ల ఆమెకున్న మమతా తెలిసి నేను నిశ్చేష్టుడనయాను. స్త్రీయొక్క నిజమైన రూపం ఆమె చిరునవ్వులోగాక కన్నీటిలోనే స్పష్టంగా కన్పిస్తుందన్న రహస్యం అప్పుడు నాకు అవగతమైనది.

## 7

జామున్నర గడిచింది. మహర్షి చెప్పిపోయిన ప్రకారం సకాలానికి వచ్చాడు. తండ్రి రావడంతోటే అమ్మాయి అతనిపాదాల మీదపడి రోదించడం ప్రారంభించింది. ఋషి ఆమెను చుబుకం పట్టి లేవనెత్తాడు. 'బిడ్డా! ఎందుకలా వ్యర్థంగా నీ తండ్రిఎడల మమత్వాన్ని బంధించాలనుకుంటావు? నీ వివాహంలో వరకట్నంగా సమర్పించడానికి నా వద్ద అది తప్ప యింకేం లేదు. మీరు యీ మమతను మీతో పాటు తీసుకువెళ్ళండి. మీ స్వదేశంలో మీ కోసం నిరీక్షిస్తున్న వారందరికీ యీ మమతను పంచిపెట్టండి. అదే మీనుండి నేను కోరుతున్న శుశ్రూష" అంటూ ప్రసన్నవదనంతో బోధించాడు ఋషి.

అపరిమితమైన వేదనతో ఋషికన్యకు ఎక్కిళ్ళు పట్టుకున్నాయి. అశ్రుపూరిత నయనాలతోనే ఆమె క్రిందికి వంగి జనకుని పాదారవిందాలను స్పృశించింది. నాకూ పితృతుల్యుడైన ఆ యోగి పుంగవుని విడిచి రావడం భారంగానే తోచింది. అప్రయత్నంగా నా నేత్రాలనుండి టపటపమని నీరు కారసాగింది. నా కన్నీటితోనే ఆ మహర్షి పాదయుగళాన్ని ప్రక్షాళితం చేశాను. ఆయన కరుణాకలితుడై మా వుభయుల వీపులను తట్టుతూ, "వెళ్ళిరండి నాయనా! మీ జీవితం సుఖంగా, సంతోషంగా గడచుగాక!" అని చేయెత్తి ఆశీర్వదించాడు. తోడనే ఆ వీతరాగుని కనుకొలకులనుండి రెండు మమతా కణాలురాలి భూమిమీద పడినాయి.

గుండెను రాయిచేసుకుని, కడసారిగా మహర్షివద్ద సెలవు తీసుకుని త్రోవబట్టాం. మేం అగోచరమైపోయేవరకూ నిశ్చేష్టుడై మాకేసి చూస్తూవున్న ఆ ఋషి అటుపిమ్మట ఏమయ్యాడో యిక ఎప్పటికీ తెలియనేలేదు. ★

# పెంపుడు జంతువులు

( 27 వ పేజీ తరువాయి)

## పిల్లికూనలు

ఒక నెల రోజులవరకూ పిల్లికూనలు తల్లి దగ్గరే పాలు త్రాగుతాయి. ఆ తర్వాత ఆవుపాలు కొద్ది కొద్దిగా అలవాటు చెయ్యవచ్చు. వెచ్చని పాలలో వేలుముంచి పిల్లికూన నోటికి అందించాలని ఒక పుస్తకంలో వ్రాసివుంది. ఎదిగినకొద్దీ 'కాడ్‌లివర్' నూనె చుక్కలు కొన్ని పాలలోకలిపి త్రాగించితే మంచిది. పిల్లి పిల్లలకు పళ్ళు వచ్చే సమయంలోనే మాంసం అలవాటు చెయ్యాలి. క్రమేణా కూరగాయలు కూడా అలవాటు చేస్తే తప్పులేదు. అన్నం ఎలాగూ అలవాటు అవుతుంది!

పిల్లికూనలను ఇష్టం వచ్చినట్లు 'ఎత్తుకో' కూడదు కొంచెం అజాగ్రత్తగాఉంటే వీటి ఎముకలు విరిగి ప్రమాదం కలగటానికి అవకాశం ఉంది. చిన్న పిల్లల్ని వీలైనంతవరకూ వాటి జోలికి రానివ్వకూడదు. పిల్లికూనలకు 'మొహాన్ని' అనవసరంగా ముట్టుకుంటే చిరాకు వేస్తుంది.

### జబ్బులు: అస్వస్థత

(1) పురుగులు : వేసవికాలంలో పిల్లలకు కుక్కలకుపట్టినట్లే పురుగులు పడ్తాయి. కాని కుక్కలకు వాడే మందులు సాధారణంగా పిల్లులకు వాడకూడదు. డాక్టరుకు చూపించే అవకాశం లేకపోతే 'హైడ్రోజన్ పెరాక్సైడ్' (Hydrojen Peroxide)తో ముంచిన దువ్వెనతోదువ్వితే కొంచెం గుణమిస్తుంది. పురుగులను వెంటనే చంపివేయాలి. కిరసనాయిలులో పడేస్తే మంచిది.

(2) చర్మ వ్యాధులు — డాక్టరుకి చూపించడం కన్నా ఉత్తమమయిన పని లేదు. ఇది వీలుపడనప్పుడు వెచ్చని సబ్బు నీళ్ళతో కడిగి పుళ్ళు పడినచోట 'టించర్ అయోడిన్' కొంచెం వ్రాయాలి.

(3) కడుపులో'పాములు' —విరేచనాలూ, డోకులు మొదలయినవి వాటి లక్షణాలు. డాక్టరువద్దకు వెంటనే తీసుకువెళ్ళటం మంచిది

(4) చెవులు:— పిల్లులకు చెవులలో 'గులివి' అప్పుడప్పుడు తీయాలి వెచ్చని నీటితోగాని 'గ్లిజరీన్'తోగాని తడి చేసిన దూదితో శుభ్రంచేసి బోరిక్ పౌడర్ వేస్తే మంచిది. కొన్ని పిల్లులకు తరచూ చెవుల వ్యాధులు వస్తూ ఉంటాయి. అప్పుడు డాక్టర్ సలహా తీసుకోవాలి.

(5) జలుబు:—వీటికి కూడా జలుబు చేస్తుంది. కళ్ళవెంబడి నీరు, ఆయాసం ఇవే వాటి లక్షణాల. ఈ సమయాలలో ద్రవపదార్థాలు ఇచ్చి 'లిక్విడ్ పెరాఫిన్' (Liquid parafin) వంటి విరేచనాలకు మందు ఇస్తే తగ్గుతుంది.

(6) మలబద్ధం, విరేచనాలు —వీటికి మిల్క్ ఆవ్ మెగ్నీషియా (Milk of Magnesia) ఇవ్వవచ్చు. ఇటువంటప్పుడు పాలు ఇవ్వక పోడమే మంచిది.

(7) వమనం :—సరియైన వేళలలో తిండిపడకపోతే పిల్లులు వమనం చేసుకుంటాయి

(8) ఫిట్స్ (Fits) — కొన్ని పిల్లులకు ఇవి వస్తాయి కాని ప్రమాదం ఏమీలేదు వెంటనే కొంచెం చీకటిగాఉండే గదిలోకి తీసుకుపోతే తగ్గుతుంది.

## కొన్ని ప్రమాదాలు

(ఏ) పిల్లుల ఎక్కడినుండి పడినా నాలుగ కాళ్ళమీద పడతాయంటారు. ఇది కొంతవరకు నిజమే అయినా ఎత్తు ప్రదేశంనుంచి పడిన పిల్లులు చని పోతూవుంటాయి. కనీసం ఎముకలైనా విరగవచ్చు

## పెంపుడు జంతువులు

(బి) పెద్దపులికి చెట్లెక్కడం నేర్పలేదన్న పిల్లి చెట్లమీదకుఎక్కి కొన్నెప్పుడు దిగడానికి భయపడుతుంది అన్ని పిల్లులూ చెట్లు ఎక్కి దిగుతూ ఉంటాయను కొనడం పొరపాటు

(సి) చెంబులలో పిల్లి తల ఇరుక్కుని అకమక పడడం చూస్తూఉంటాము ఇది పెద్ద ప్రమాదా లలో ఒకటి. శ్వాస కష్టమయి మరణించే అవకాశం ఉంది. ★



# వనితా వాణి

## మగవారి వ్యసనాలు

12-4-61 ఆంధ్రసచిత్రవారపత్రికలో రచయిత్రి "కె. లీలాశంకర్"గారు వ్రాసిన "మగవారి వ్యసనాలు" చాలా అద్భుతంగా వుంది. ఈ వ్యాసంవల్ల మా యింట్లో, మా వారు, నెలకు 4 సార్లు సినిమాకు పోయే వారల్లా, ఒక్కసారే పోతానని నాతో వాగ్దానం చేశారు. మావారిలో ఇంత మార్పు తెచ్చిన యీ వ్యాసం రచయిత్రిగారికి నా హృదయపూర్వక అభివందనము లర్పిస్తున్నాను.

శ్రీమతి మేడపాటి సత్యవాణి(విశాఖపట్నం)

*　　*　　*

'మగవారి వ్యసనాలు' గురించి కె. లీలాశంకర్ గారు వ్రాసిన వ్యాసము చాలా బాగుంది. ఈ రోజులలోని మగవారి అలవాట్లను చాల బాగ విశదీకరించారు. వారికి నా ధన్యవాదాలు.

వి. నాగలక్ష్మి లలితకుమారి (సోమవరం)

*　　*　　*

"కె. లీలాశంకర్ గారి వ్యాసము సమంజసముగా లేదు. వారితో ఏకీభవించుట కష్టము. వారు మగవారి వ్యసనాలు గురించి తెల్పారుగాని, ఈ రోజుల్లో ఆడువారుచేసే ఖర్చులను ప్రస్తావించలేదు. మగవారికి తెలియకుండా క్లబ్బులకు పోవటం మొదలైన విషయాలను గూర్చి వ్రాయలేదు. నిజానికి ఆడవారు మగవారికంటే ఏ విధంగాను తీసిపోరు.

వల్లూరి సరస్వతి (యర్రవరం)

*　　*　　*

## మాతృత్వం విశిష్టత

5-4-61 తేదీసచిత్రవారపత్రికలో బి. కామేశ్వరీకృష్ణగారు వ్రాసిన 'మానవతీ మధులిప్స' అను వ్యాసము నన్నెంతగానో ఆకర్షించినది. ముద్దులొలుకు తెలుగు పదజాలముతో, మాతృదేవి ఆనందానుభూతుల నొలుకపలిచి స్త్రీకి, మాతృత్వమునకుగల సంబంధమును వివరించారు. వారికి పత్రికద్వారా నా అభినందనలు తెలియజేస్తారని ఆశించుచున్నాను.

టి. భాగ్యలక్ష్మి (విశాఖపట్నం)

*　　*　　*

5-4-61 వారపత్రికలోని బి. కామేశ్వరీకృష్ణగారి వ్యాసం అసంపూర్ణంగా వున్నది. మాతృత్వం లభించిన స్త్రీ పరిపూర్ణతను విప్పి చెప్పటంలో రచయిత్రి కృతకృత్యులయ్యారని చెప్పక తప్పదు. కాని 'సంతానవతిగా స్త్రీకి మనలో ఉన్న ప్రత్యేకత గౌరవం సంతానహీనకు లేదు'ని పేర్కొన్నారు. ఇది వాస్తవమే అయినా, సంతానహీనత వ్యక్తియొక్క ప్రత్యేకతకు, గౌరవమునకు కొలతబద్ద కానేరదు. గొడ్రాలు, పిల్లలులేనిదని సంతానవిహీనలను ఈసడించటం, స్త్రీ జాతిలో కొందరిని అణగ త్రొక్కటమే కాగలదు. సంతానహీనతకు వ్యక్తులుగా వారు బాధ్యులు కారనిగుర్తించి సంఘంలో వారికి గౌరవస్థానమివ్వాలి.

నిమ్మగడ్డ ఆదిలక్ష్మి (పెద అవుటపల్లి)

*　　*　　*

## తాహతుకు మించిన ఆడంబరాలు

29-3-61 తేదీ ఆంధ్రసచిత్ర వారపత్రికలో, మోచర్ల సుబ్బలక్ష్మిగారు వ్రాసిన "వివాహాలలో ఆడవారు, ఆడంబరాలు" చాలాబాగుంది. ఇప్పటికి మనలో చాలామంది, తమ తాహతుకుమించిన అనవసర ఖర్చులు పెళ్ళిళ్ళలో చేసి, నలుగురిలో మెప్పు పొందాలని, ఆరాటపడుతుంటారు. ఇలాటి వారికి ఈ వ్యాసము గుణపాఠమువంటిది. ఇటువంటి వ్యాసములు స్త్రీలకు ఎంతో ముఖ్యం. ఈ వ్యాసము వ్రాసిన మోచర్ల సుబ్బలక్ష్మిగారికి, ప్రచురించిన ఆంధ్రసచిత్ర వారపత్రికకు నాహృదయపూర్వక అభివందనములు.

కే. హెచ్. కోకిల (గుత్తి)

*　　*　　*

5-4-61 నాటి కవరుపేజీలో 'మానవతీ - మధులిప్స' అనేవాక్యం - పత్రిక అందాన్ని ద్విగుణీకృతం చేసిందనుటలో సందేహము లేదు. కానీ ఈనాటి ప్రభుత్వం "గర్భనిరోధం" ప్రణాళికలద్వారా, పంచాయితీ సమితులద్వారా గ్రామాలకు ప్రచారము చేస్తున్నారు. ఇలాంటప్పుడు గలగలలాడే పట్టుచీర ధరించినా కనపడనిఅందం, నలుగురి పిల్లలమధ్య నలుగుతూ కూర్చుంటే తల్లి ముఖంలో కనబడుతుంది. "నాపిల్లలే నానగలు" అనేవాక్యాలు మనస్సులో మెదిలేసరికి ఏకీభవించక తప్పదు. అయితే "పదిమంది పిల్లలతల్లి అయిన భాగ్యజీవినే" అనేవాక్యం ఈనాడు వర్తించదు. ఎందుకంటే, ఆర్థిక ఇబ్బందుల దృష్ట్యా, ఎక్కువ సంతానం అక్కరలేదనీ, ఇద్దరుముగ్గురుంటే చాలునని తలపోస్తున్నారు.

కె. అంపమ్మ (దేవరకదిరి)

★

"సంవత్సరానికి 2% వడ్డీ చొప్పున లక్ష రూపాయలకు నాలునెలల పదమూడురోజుల కెంత వడ్డీ అవుతుంది?" ఈ లెక్కను క్లాసు చివరబెంచిలో సోమసుందరం తప్ప అందరూ మొదలుపెట్టారు. కొంతసేపటి తర్వాత ఉపాధ్యాయుడు తనెందుకు లెక్కచెయ్యడం లేదని సోమసుందరాన్ని అడిగాడు. "2%వడ్డీ మరీ తక్కువ!" అన్నాడు సోమసుందరం.

# స్త్రీలు–చిరునవ్వు

**యస్. సి. జానకి**

**వహా** సరోజక్క ముఖం ఎప్పుడూ చిరునవ్వుతో వెలిగిపోతూ ఉంటుంది! ఆమెతో ఎంతసేపైనా గడిపేయొచ్చు" అంటుం దొక సరళ!

"అబ్బబ్బ! అదేమి నవ్వో బాబు! ఆ, విమలను చూస్తే నాకు ఒళ్లు మండుకొస్తుంది! ప్రతీదానికీ నవ్వేనా!" అని అసహ్య పడుతుం దొక కమల! "ఈడొచ్చిన పిల్లవు! అలా మగాళ్లతో నవ్వుతూ, పేలుతూ మాట్లాడొచ్చటే!" అని దండిస్తుం దొక యిల్లాలు

ఆఫీసర్లో, మంత్రులో అవుతే తప్ప, మగవారి చిరునవ్వులకోసం తాపత్రయ పడేవాళ్లు చాల తక్కువ! కాని, స్త్రీల చిరునవ్వుల లాంటివి కావు! సత్యభామ చిరునవ్వుకోసం, శ్రీకృష్ణు డంతటివాడు. ఎందుకులెండి! ఆ బాధ వర్ణించడం! క్లియోపాత్రా చిరునవ్వుకు సార్వభౌముడే చిత్తయిపోయాడట!

భగవంతుని చిరునవ్వులే పువ్వు లయ్యాయుంటారు! అందుకే కాబోలు, నవ్వులు, పువ్వులు అని కలిపి చెప్పుకొంటాం! పువ్వులలో ఉన్న సుకుమారత, సువాసన నవ్వులలో ప్రతిఫలించాలి. ముంగిలా కూర్చున్నా, పాములా బుసకొట్టినా ఎవ్వరూ హర్షించరు.

అన్నిటికంటే చిరుపాపల గులాబీ నవ్వులు, ముగుదల ముగ్ధహాసము, ఉత్తమమైనవని లాక్షణికుల అభిప్రాయం!

సంసారంలో యీ చిరునవ్వు ప్రాధాన్యం ఎంత వరకు ఉందో, ఆలోచిద్దాం! ఎంత కష్టాన్నయినా చిరునవ్వుతో, ధైర్యంగా ఎదుర్కొనగలగాలి.

గృహిణి చిక్కులను, చిరునవ్వుతో విడదీయాలి. పండుగకు చీర తీసుకొచ్చి భార్య చేతిలో పెడుతూ ఆమె దరహాసము ఆశిస్తాడు భర్త! ఆ క్షణం చాలా విలువైనది! భార్య ఉపేక్షిస్తే లాభంలేదు.

పేరంటానికి వెళ్లినప్పుడు నాలుగు వందలు ఖరీదుచేసే బనారస్ చీర కట్టుకున్నా, ఆ యిల్లాలు వేసిన చాపపైన చిరునవ్వుతో సంతోషంగా కూర్చోనగలగాలి. కుర్చీ వేయలేదని ముఖం ముడుచుకొంటే స్నేహం దెబ్బతింటుంది!

ఇంటికి వచ్చే బంధువులను, అతిథులను చిరునవ్వుతో ఆహ్వానించాలి. "టీ" ఉత్సాహ మిస్తుందో యివ్వదో కానీ, చిరునవ్వు చాలా ఉత్సాహాన్నిస్తుంది. పెళ్లిళ్లలో, శుభకార్యాలలో, వంట పనుల్లో, యింటి పనుల్లో, చేయాల్సి వచ్చినప్పుడు ఆ బాధ్యతలు చిరునవ్వుతో స్వీకరిస్తే అటు అప్పగించిన వాళ్లకూ, యిటు చేసేవాళ్లకూ మనస్సు సంతోషంగా ఉంటుంది పనులు కూడా సవ్యంగా ఉంటాయి ఏదో చేయాల్సి వచ్చిందే అనే ధోరణిలో యాంత్రికంగా పనిచేస్తే అవి కూడా అంతంతమాత్రంగానే ఉంటాయి.

"అతి సర్వత్ర వర్జయేత్" అన్నట్లు అతివలు, చిరునవ్వును మితిగా వాడుకుంటే, పువ్వులలా పరిమళించి అందరికీ ఆనందం కలుగజేస్తారు. గృహిణి చిరునవ్వులే గృహానికి వెలుగు. ★

**ఎప్పుడూ ఇంతే — 81**      **శంకర్**












# రైల్లో పెళ్ళిచూపులు

(35-పేజీ తరువాయి)

నచ్చినట్టే" అనిమొండిగాజవాబిచ్చాడు ప్రభాకరం.

'అలాగంటే ఎలాగా! చేసుకునేవాళ్ళు మీరు. మీరు ఒకరినొకరు చూసుకుంటే కాని ఎలాగా ?"

"ఒకవేళ మీ అమ్మాయికి నన్ను పరీక్ష చెయ్యాలని ఉంటే చెప్పమనండి"

మొత్తానికి ప్రభాకరం మాత్రం పెళ్లి చూపులకి వెళ్లనేలేదు.

*     *     *

నిర్మలతో ప్రభాకరం తల్లి చాలాసేపు మాట్లాడి "చూడమ్మా! మా ప్రభాకరానికి పెళ్లిచూపులంటే కోపం. కూడా అమ్మంటే మీరు చూసిరండి. మీకు నచ్చితే అప్పుడు చూడొచ్చు ... అన్నాడు"

నిర్మల ఏమీ జవాబు చెప్పలేకపోయింది.

లోపలికి పోయిన తర్వాత తల్లితో మాట్లాడుతూ "అన్నయ్యకు నచ్చితే నాకు నచ్చినట్లేనే" అనేసింది.

"అదేమిటే .... వాడికి నచ్చట మేమిటి. అబ్బాయిని చూడకుండా ఎలా చేసుకుంటావే."

"అంతేనమ్మ .... " అంటూ వెళ్లిపోయింది నిర్మల అక్కడనుంచి.

సీతారామయ్యగారికి ఇదేం అర్థంకాలేదు.

ఆఫీసు రూమ్‌లో రమణారావుగారూ, సీతారామయ్యగారూ ఏదో మాట్లాడుకుంటున్నారు.

ఇంతలో మూర్తి ఆ గదిలోకి వెళ్లి "ఇంక మీదే ఆలశ్యమండీ" అన్నాడు.

"అదేమిటోయ్—ప్రభాకరం పెళ్లిచూపులకి రానంటాడు. మీ చెల్లెలు వీకు నచ్చితే తనకు నచ్చినట్లే అంటుంది .... ఎలాగ వీళ్ళ దగ్గరనించి అభిప్రాయాలు రాబట్టడం."

"అభిప్రాయాల కేం ఉందండి. వాళ్లిద్దరూ ఒకర్నొకరు ఇదివరకే చూసుకున్నారు .... వాళ్ల అభిప్రాయా లంటారూ! వాళ్లని ఇద్దర్నీ పూర్తిగా అర్థం చేసుకునే నేనే మీ దగ్గరకు మా నాన్న గారిని పంపించాను ...." అన్నాడు మూర్తి.

"అదేమిట్రా ? వాళ్లిద్దరూ ఒకర్నొకరు ఎప్పుడు చూసుకున్నారు ? నాకు చెప్పనేలేదే...."

"నేను కలకత్తా వెడుతున్నప్పుడు నిర్మల స్టేషన్‌కి వచ్చిందండీ. ఆరోజు నేనూ, ప్రభాకరం ఒకటే కుపేలో ప్రయాణం చేశాం. ఒకర్నొకరికి పరిచయం చేశాను కూడాను. నేను అసలు అందుకనే నిర్మలని ఆరోజు స్టేషన్‌కి రమ్మని వ్రాసింది.'

సీతారామయ్యగారూ, రమణారావుగారు కూడా వెర్రి మొహాలు వేశారు.

"అయితే రైలు కంపార్టుమెంటులోనే పెళ్లిచూపు లయిపోయాయన్నమాట" అన్నారు చివరకు సీతారామయ్యగారు.

పక్క గదిలో వంటరిగా కూర్చున్న నిర్మల ఆ మాటలు విని అన్నయ్య తనకు తగిన వరుణ్ణి అంత సులభంగా తీసుకువచ్చినందుకు ఎలాగైతేనేం తనకి పెళ్లిచూపులబాధ తప్పిపోయిందిఅనుకుంది ★

# సంఘసేవ

(20-వ పేజీ తరువాయి)

ముమ్మరంగా ఆక్రమించడంచేత సూరిపంతులు కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దంగా నిలబడిపోయాడు. సత్తెమ్మ చిరునవ్వు ముఖంతో సూరిపంతులుని గుమ్మంలోనే తచ్చాడుతున్న కాంతమ్మని చూస్తూ నిల్చుంది. నిష్కర్షగా మిగిలిన వాళ్ళతో అందరూ వ్యవహరించినట్లు సత్తెమ్మతో సూరిపంతులు వ్యవహరించలేక పోతున్నాడని కాంతమ్మకు విసుగూ కోపమూ రెండూ వచ్చాయి.

"సరే" అంటూ తిరిగి వెళ్ళబోతూఉంటే "ఓహో పంతులుగారు!"అంటూ ముఖపరిచయంఉన్న ఒక వ్యక్తి పలకరించేడు. అతడు సత్తెమ్మకోసం వచ్చినవాడవడాన్ని ఆ దిక్కుగా తిరిగి "ఇదేమిటమ్మా! చిన్న పిల్లడిని పంపించానసా ఈ రాళ్లపప్పు ఇచ్చేవు" అంటూ అడిగేడు.

"మీకు అవసరం లేకుంటే తిరిగి ఇచ్చేయండి కాని రాళ్ళా బెడ్డలూ అని మాత్రం పేర్లు పెట్టకండి. నా దగ్గర సామానులన్నీ చాలా నాణ్యమైనవి"

"నాణ్యమైనవైతే ఇంకెవరికైనా అమ్ముకో. నాకు మాత్రం అంటకట్టకు" అంటూ తన చేతిలోని పప్పు పొట్లాం సత్తెమ్మకు ఇచ్చేడు.

"నాకేం సరుకు చెల్లకపోదు ఇచ్చెయ్యండి ఇంతకీ నేనేం దుకాణం పెట్టేనా ఏమిటి.మీకు తొందరగా కావాలి కాబట్టి దూరంగావున్న బజారుకి వెళ్ళలేరు కాబట్టి నా చేతనైన సహాయం చేసేను"

"ఎందుకమ్మా ప్రతిదానికీ అన్ని మాటలు. నీ సంఘసేవ సంగతి నాకు తెలీదూ"

ఈ ఆఖరు మాటలు ఆవిడకు వినపడలేదో, విన బడినా లక్ష్యంలేదో తెలియలేదు. సూరిపంతులు నిశ్శబ్దంగా ఏమి జరగబోతుందో అని కుతూహలంగా ఆ ఇద్దరి సంభాషణా విన్నాడు. సత్తెమ్మ పప్పు ఇంట్లోపెట్టి డబ్బు తిరిగి ఇచ్చింది.

"తీసుకోండి మీ డబ్బులు" అంటూ ఒక పావలా కాసు ఆ వ్యక్తి చేతులో పడేసింది. చెల్లతుందో చెల్లదో అని అతడు ఇటూ అటూ తిప్పి చూసుకున్నాడు.

"చెల్లని పావలా ఇచ్చేవేవమ్మా!" అన్నాడు కోపంగా.

"చెల్లదూ? అయ్యో నా కళ్ళుకాల! ఇందాక మీ అబ్బాయి అదే పావలాకాసిస్తే మంచిదే కాబోలు అని డబ్బులపెట్లో పడేసాను"

"నేను విచ్చపావలా ఇచ్చి పంపించలేదే. అన్నీ పయాసైసలు లెక్కపెట్టే కుర్రాడికిచ్చేను."

"చూసేరా పంతులుగారూ ఆ మనిషి బూకటుంపు" అంటూ సూరిపంతులుని మధ్యవర్తిగా తీసుకొచ్చింది.

"ఏమమ్మోయ్! వీళ్ళనీ, వాళ్ళనీ మధ్యవర్తులుగా తీసుకురానక్కర్లేదు. మావాడు ఈ విచ్చ పావలాయే ఇచ్చేడని నీకు అనిపిస్తే ఇది నీదగ్గరే ఉంచుకో" అని పావలాకాసు విసిరికొట్టి వెళ్ళబోయేడు. సత్తెమ్మ క్రిందపడిన పావలాతీసుకుంది· రెండడుగులు వేసిన ఆ వ్యక్తి హఠాత్తుగా తిరిగి సత్తెమ్మని చూస్తూ, "పావలా లాభం వచ్చిందని సంబరంకాదు. శంకరయ్యతోచెప్పి నిన్ను తన్నించక పోతే నా పేరు మారు పేరు అనుకో" అన్నాడు.

ఈ మాటలు విన్నవెంటనే సత్తెమ్మ బెదురు చూపులు చూసింది. "ఉండవయ్యా ఉండు" అంటూ బొడ్డుకొంగులోనుంచి డబ్బులు విప్పి ఇచ్చింది. అతను నవ్వుకుంటూ వెళ్ళిపోయేడు.

ఈ అకస్మాత్సంఘటన ఫలితంగా సత్తెమ్మ ముఖం వివర్ణమవడం సూరిపంతులు చూసేడు. సత్తెమ్మ తనకు కలిగిన కంగారు కప్పిపుచ్చుకుంటూ సూరిపంతులుతో చెప్పింది. "వాడొక పిచ్చి వెధవ' పంతులుగారూ! మా ఆయనతో కలిసి తాగుతాడు. అంచేత వాళ్ళిద్దరికీ స్నేహం. తాగుడుమైకంలో ఏవేవో పోటీలుచెప్పి నన్ను కొట్టిస్తాడు" అంటూ తన అక్కసంతా వెళ్ళగక్కుతూ తిట్టింది ఆ వ్యక్తిని.

సత్తెమ్మ తన విషయంలోనే కాకుండా ప్రతి వ్యక్తితోనూ ఒకేవిధంగా ప్రవర్తిస్తుందనీ, డబ్బు కోసరం ఏ గడ్డి కరవడానికేనా వెనుకాడదనీ, ఆమె రక్తంలోని ప్రతి అణువూ ఇతరుల అనవకాశ పరిస్థితులని అనువుగా తీసుకొని దోచుకోవడానికే ఎదురు చూస్తుందనీ సూరిపంతులు గ్రహించుకున్నాడు. "సత్తెమ్మకు పక్కా బెదురు శంకరయ్యే' అని తెలిసినందువలన ఇన్నాళ్ళవరకూ శంకరయ్యతో ముభావంగా ఉండడం, పిల్చినా పలకరింపులతోనే మాటలు పూర్తిచేసి దూర దూరంగా తిరగడం ఇవన్నీ తన తప్పే అని తన తెలివితక్కువదనానికి విసుగుకున్నాడు.శంకరయ్యతో స్నేహంచేస్తే సత్తెమ్మ అంత నిరాఘాటంగా ఇబ్బంది పెట్టకపోనేమో! ఆవిడ దుష్కృత్యం మూలంగా కంటనీరు పెట్టని రోజేలేదు కాంతమ్మకు! సత్తెమ్మపీడ ఏవిధంగానైనా నివారించుకోవాలి' అని నిశ్చయించుకుంటూ సూరిపంతులు ఇంట్లో కొచ్చేడు.

> ఒక ఊరికి వచ్చే రైలు రోజూ ఆలస్యంగా వచ్చేది. ఒక రోజు ఆరైలు రైట్ టైమ్‌కే వచ్చింది. వెంటనే ఆ ఊరివాళ్లు ఆ యింజను డ్రైవర్ మెడలో దండలు వేసి ప్రశంసించారు. ఆ తర్వాత డ్రైవరు మాట్లాడుతూ "నిన్న ఉదయం రావలసిన రైలు ఈ వేళ వచ్చింది. అందుచేత మీ గౌరవానికి నేతగను" అని మెళ్లో దండ తీశేశాడు.
>
> ఆర్.వి. గోపాలరావు(విశాఖపట్టణం)

## 2

రెండే రెండు రోజులు వరసగా రెండు రూపాయలు తన వాంఛితం కోసరం ఖర్చు చేసుకోమని సూరిపంతులు శంకరయ్య కివ్వడం జరిగేసరికి అప్పటికే ఇద్దరి మధ్యా ఉన్న పరిచయం స్నేహంగా మారింది. తాగుడు నిషాలో ఉన్నప్పుడు తప్ప మిగిలిన అన్ని వేళలలోనూ అవకాశం ఉన్నప్పుడల్లా శంకరయ్య సూరిపంతులుతోనే ఉండేవాడు. చిన్నప్పుడు నేర్చుకున్న రామాయణంలోని పద్యాలు చదివి సూరిపంతులు బోధపరుస్తూఉంటే తగు మాత్రం కూడా చదువులేని శంకరయ్య ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యేవాడు. బంధువులకీ స్నేహితులకీ ఉత్తరాలు రాయవలసి వచ్చినా సూరిపంతులుతోచెప్పి రాయించుకొనేవాడు. తన కుటుంబపు అంతరంగిక విషయాలు కూడా చెప్పేవాడు. ఒకనాడు మాటల్లో "పంతులుగారూ! మీ అంత తెలివైనవాడు మరెవడూ లేడండీ" అన్నాడు శంకరయ్య.

"ఏం అలా అన్నారు?"

"చూసేరా! నా భార్యా ఉందా. ఒట్టి దగాకోరు మనిషి. దానికి రాతా చదువూ రెండూ వచ్చు. అయితేనేం. ఎంతసేపూ పద్దులు రాసుకుంటూ వస్తుంది. కాని స్నానం చేసుకుని రామకోటి రాసుకోవే—చేసిన పాపమైనా పోతుంది' అంటే దాని మనస్సు అటువైపే వెళ్ళదు."

"వ్యవహారం పద్దులు రాసుకోకపోతే రాబట్ట వలసిన డబ్బు ఎలా జ్ఞాపకం ఉంటుంది."

"డబ్బు! డబ్బు!!మీకూ అదే పిచ్చి ఉన్నట్లుందే! మీరు కూడా ఆ ఆడభూతాన్ని వెనకేసుకొస్తారేం పంతులుగారూ"

సూరిపంతులు కొంచెం కొంచెం గ్రహించు కుంటున్నాడు. సత్తెమ్మ మంచిదే అని అన్నప్పుడల్లా శంకరయ్యకి కోపం ఎక్కువవుతూ ఉండేది. కాని ఆవిడ గురించి ఏమీ చెడుగా అనేవాడుకాదు. సత్తెమ్మగూర్చి కొత్త విషయాలు తెలుసుకోవాలన్న కోరిక సూరిపంతులకి హెచ్చు కాజొచ్చింది. అందువలన ప్రయోజనం కూడ ఉండవచ్చు అని సూరిపంతులు భావన.

"ఆవిడ మంచి మనిషేనండి" శంకరయ్యకి కోపం రావాలనే అలా అన్నాడు

"పాపాత్మురాలు పంతులుగారూ మహా పాపాత్మురాలు! ఒకసారి నాకే ద్రోహం తలపెట్టింది" అంటూ విచారంలోపడి ఆలోచిస్తూ ఉండిపోయేడు.

"మీ మనస్సు గాయపెట్టినట్లున్నాను శంకరయ్యగారూ! నన్ను మన్నించండి!"

"అబ్బే మీదికాదు తప్పు. అదంతా నా గ్రహపాటు. నేను చెడ్డవాణ్ణి. తాగుతాను. ఎందుకు తాగుతాను? ముప్ఫైఐదేళ్ళ కాయకష్టంచేసి ఎంక్రీ డిపార్టుమెంటులో ఫిట్టరుగా రిటైరయ్యాను. నేను పని చేసి చేసి అలసిపోవడం మూలంగా సాయంత్రం పూట తాగుతేనేగాని నాకు హాయి కనిపించేదికాదు. ఆవిధంగా తాగుడికి అలవాటుపడ్డాను. మొదట్లో మోతాదుగానే ఉండేది రాను రానూ ఎక్కువయింది. దానికంతటికీ సత్తే కారణం నేను దానికి మొగుడినే అంటారా నా డబ్బు తెగతింది తినితిని కొవ్వు బలిసిపోవడాన్ని మంచీ చెడూ మరిచిపోయింది. నా

ంట్లో కారంజల్లి ఇష్టం వచ్చినట్లు వేషం వేయబోయింది అదేమొదలు 'నాకు తాగుడు ఎక్కువవడం దానికి నావలన తాపులు ఎక్కువవడం అదేమొదలు ఆ వెధవ నా గుమ్మం ఎక్కలేదంటే నమ్మండి!''

శంకరయ్య చెప్పిన విషయాలు బోధపర్చుకోలేక సూరిపంతులు కొంచెం తికమకపడ్డాడు. మధ్యలో అన్న 'వెధవ' ఎవరా అని వూహించుకుంటూ 'ఈ చెప్పినదంతా నిజమా, సత్తెమ్మ జీవితంలో ఇన్ని అగాధాలు ఇమిడిఉన్నాయా' అని ఆలోచిస్తూ అన్నాడు

''కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది ఈ సంగతులన్నీ నా కెందుకు చెప్తారు?''

''అదెందుకో పంతులుగారూ! మీతో మాట్లాడుతూఉంటే, అన్ని సంగతులు చెప్పెయ్యాలనుంటుంది. మీరు చాలామంచి వాళ్లు కాబట్టే చెప్తున్నాను నిజంగా మీరు బీడీ కూడా కాల్చరని తెలిసిన తర్వాత నా జీవితంలో మీలాంటివాళ్ళని మొట్టమొదటిసారిగా చూసేననే చెప్పాలి''

''ఆ! అదీ ఒక మంచి పనేనా ఏమిటి?''

''వినండి. ఇంకా వినండి. చెప్తున్నాను నేను రిటైరయ్యాక నా సెటిల్మెంట్ డబ్బు అంతా కలుపుకుని మూడువేల రెండువందల నలభై ఏడు రూపాయలు వచ్చేయి ఐదు రూపాయలు కాబోలు ఆ డబ్బు తీసుకుని వచ్చిన కేషియరు బంట్రోతుకి నా చేత్తోనే నిచ్చేను మిగిలిన సొమ్మంతా మాసత్తి తనపేర బేంకులోవేయింపించింది 'నాగతి ఏంకానే?' అంటే 'నువ్వు ముసిలాడివి నాకు ముసలితనం వచ్చిందా ఏమిటి? నా సరదాలు తీరద్దూ! అంటూ' ముదరగించింది సరిలే పోనిమ్మని, ఆ డబ్బంతా దానిపేర బేంకులో వేసేను ముసిలి మొగుడు పడుచుపెళ్లాం ఉంటే ఇదే చికాకు పెద్ద చిక్కొను. ఆ డబ్బులో వడ్డీ వ్యాపారాలు చేస్తున్నాది. అలాగే బుద్ధిగా ఉండకూడదూ? నా కోసరం మట్టుకూ అర్ధ రూపాయి ఇచ్చి తాగమనీది కూడా!''

''అయితే మీ కా సమస్య సులువుగానే తెగిందన్న మాట!''

''అయ్యా పంతులుగారూ! మీరు ఒట్టి వెర్రిబాగులవాళ్ళలా ఉన్నారే. ఆడదాని మనస్సు గ్రహించుకోలేరు. అందులో మా సత్తి మనస్సు గ్రహించడం బ్రహ్మతరంకాదు''

ఈ సంగతి మాత్రం సూరిపంతులుకి నిజమే అనిపించింది జవాబేమీ ఇవ్వకుండానే నవ్వేడు. కథ రక్తి కడుతున్నదని, చెప్పవలసిన ముఖ్య విషయం కాంతమ్మ కూడా అక్కడే తిరుగుతూ ఉండడాన్ని సందేహించి శంకరయ్య చెప్పకుండా ఉన్నాడని గ్రహించేడు. అందుచేత భార్యనిపిల్చి ''నాకూ శంకరయ్యకీ రెండు కప్పుల కాఫీ పెట్టుమీ'' అని ఆమెను వంటింట్లోకి పంపించేడు ఇటు శంకరయ్య ముఖంగా తిరిగి ''ఆడదాని నోట్లో నువ్వు గింజ కూడా నానదంటారు. ఏమాటా కడుపులో పెట్టుకుని గుట్టుగా ఉండలేనిదీ ఆడదే! అందుకే మా కాంతాన్ని మన మాటలు వినకుండా చేయాలని కాఫీ నెపమ్మీద పంపించేను'' అన్నాడు సూరిపంతులు ఈ ఉపాయానికి శంకరయ్య ముగ్ధుడయ్యాడు అసలు సంగతి కాంతమ్మ రాకుండానే చెప్పాలి' అనుకుంటూ శంకరయ్య మళ్ళా మొదలు పెట్టేడు ''నన్ను తాగమని డబ్బు లిచ్చేది. నేను ఇంట్లో లేకపోవడం

# సంఘ సేవ

చూసి ''కాంతమ్మ వస్తున్నాదేమో అని అటు చూసి, రాలేదని నిర్ధారణ చేసుకుని ''డ్రైవరు ఆదినారాయణ లేడండీ! వాడితో మరగడం మొదలు పెట్టింది. సూచా వాచా ఈ సంగతి నాకు తెలిసింది, కాని, ముసిలిమొగుడు పడుచుపెళ్ళాం ఉన్న చోట ఇలాంటి సంగతులు లేస్తాయికదా అని అది ఒక పుకారుక్రింద జమకట్టి లక్ష్యం చెయ్యలేదు ఒకనాడుమాత్రం మా సత్తి, ఆ ఆదినారాయణా బేంకులో డబ్బు తీసుకుని లేచిపోదామనుకున్నారు ఆ కుట్ర నాకు తెలిసిపోయింది అయ్యా! ఎలా తెలిసింది ఎవరు చెప్పేరు అని మాత్రం అడగకండి. తెలిసిందే తడవుగా సత్తెమ్మని పులుసులోకి ఎముక కూడా లేకుండా చావకొట్టేను ఆవెధవని ఒదిలిపెట్టేనా అనుకుంటున్నారు? వాడికి నా స్నేహితుల సహాయంతో తోలు ఒలిపించేననుకోండి. అంతే!

> ఒక ఉపాధ్యాయుడు తన తెలివితేటలు విద్యార్థులకు చూపించాలని ''దారం పొడుగెంత?'' అని ఒక ప్రశ్న వేసాడు. దీనికి ఒక తెలివిగల కుర్రాడు ''సార్ సరిగ్గా దారం మధ్యనుండి ఏ కొనకైనా గల దూరాన్ని రెండుతో హెచ్చిస్తే దారం పొడుగువస్తుంది.'' అని సమాధాన మిచ్చాడు.
>
> నాగేశ్వరరావుబాబీ (విజయవాడ-1)

రెండు రోజులలో ఈవూరినుంచి బదిలీ చేయించుకుని వాళ్తేరు పోయేడు వాడికి పోయీకాలం కాకపోతే చక్కని భార్య, ఇద్దరు పిల్లలూ ఉండికూడా ఈ పనేమిటి చెప్పండి నాకొకటే సంతోషం మా సత్తి బాగుపడినా బాగుపడకపోయినా, ఆ ఆదినారాయణ బాగుపడ్డాడుకదా అని'' అంటూ శంకరయ్య ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టేడు

ఇంతలో కాంతమ్మ కాఫీ తెచ్చింది ఇద్దరికీను. శంకరయ్యా, సూరిపంతులూ మెల్లి మెల్లిగా ఊదుకుంటూ తాగుతున్నారు కాఫీ

''ఇవన్నీ మీ గుండెలలో పెట్టుకోవాలి పంతులుగారూ మా కుటుంబ రహస్యాలు'' అంటూ మళ్లా కాఫీ తాగడంలో నిమగ్నుడయ్యాడు శంకరయ్య.

కాఫీ తాగడం పూర్తిచేసిన సూరిపంతులు కప్పు కిందపెడుతూ ''ఎంత మాటన్నారు నమ్మిన వాళ్ళని మోసం చెయ్యడం నా జన్మకిలేదు'' అన్నాడు

''నాకు తెలీదూ?'' అంటూ శంకరయ్య కూడా కప్పు కింద పెట్టేడు

శంకరయ్య ఒట్టి బోళామనిషి, దాపరికం లేనివాడూను.ఇటువంటి శంకరయ్యకి ద్రోహంఏవిధంగా చేయాలనిపించిందా అని సత్తెమ్మనిగూర్చి తలపోస్తూ సూరిపంతులు ఆశ్చర్యపోయేడు సత్తెమ్మ ప్రవర్తన తన గుండెలను కోస్తూఉండబట్టే ఆ బాధ తగ్గడానికని సూరిపంతులుకి చెప్పి ఊరటపొందేడు శంకరయ్య ''మాసత్తి గురించి నేనే చెప్పడం మీకు నమ్మకం కుదరలేనట్లుంది'' అన్నాడు శంకరయ్య.

''మీకు మీ వాళ్ళనుగూర్చి అబద్ధం చెప్పవలసిన పనేమిటుందీ?'' సమాధానాన్ని స్ఫురింపచేసే ఈ ప్రశ్న సూరిపంతులు వెయ్యడం శంకరయ్యకు తృప్తి కలిగించింది

''నాకింక కావలసిందేముంది పంతులుగారూ! ఎలాగో ఒకలాగ ఈ వార్ధక్యం గడిపి చావడమేకదూ! సాధారణంగా కాయకష్టంచేసి బతికినవాళ్లు రిటైరయినదే తడవుగా చచ్చిపోతారు. నేనుమాత్రం ఇంకా బతికే ఉన్నాను. అందుకే నాకీ విచారం.''

''శివుని ఆజ్ఞలేనిదే చీమకూడా కుట్టదు. మనం అనుకుంటే చావొస్తుందా, బతకాలంటే బతుకుతామా!''

''మంచిమాటన్నారు నా మనసుకి నచ్చిన మాట.''

ఇంతలో కాంతమ్మ ఏదో పనుండి అక్కడకొచ్చింది. ఆప్యాయంగా శంకరయ్య ఆవిడనుచూసేడు.

''మీ కాంతమ్మను చూస్తూఉంటే నా పెద్ద కూతురు జ్ఞాపకం వస్తుంది'' అంటూ కళ్లు చెమ్మ చేసుకున్నాడు. సూరిపంతులు విన్నాడు. ''నా మొదటి భార్య పదేళ్ల క్రిందట పోయింది. అప్పటికి నాకో కుమార్తె ఉండేది. ఎనిమిదేళ్ళుండేవి పెద్దకళ్ళు, తెల్లని శరీరం, అచ్చు తల్లే అనుకొండి ఈలోగా మావాళ్లు! నాకీ దెయ్యాన్ని కట్టబెట్టేరు, నా ఆస్తి పోతుందని, నా వయసు మళ్లిపోలేదనీ కబుర్లు చెప్తూ సత్తిని కట్టుకున్నతర్వాత నాకన్నీ కష్టాలే! మరొక్క సంవత్సరంలోపుగానే నా కూతురికి—నా మాణిక్యాల తల్లికి—మశూచి వచ్చింది. అప్పుడు సత్తితో శతపోరు పెట్టేను—అమ్మవారికి ఉపారాలు తియ్యమని, మేకపోతుని బలివేస్తామని మొక్కమని—'నా కూతురా ఏమిటి? నేనలా చెయ్యను పో' అంది. అంతకన్న కఠినులు ప్రపంచంలో ఉంటారా పంతులుగారూ! సరైన సంరక్షణలేక నా కూతురు 'నాన్నా నాన్నా' అంటూ చచ్చిపోయింది'' అంటూ వలవల ఏడ్చేడు శంకరయ్య సూరిపంతులుకూడా కళ్ళంట నీళ్ళు తెచ్చుకున్నాడు

చాల ఆలస్యమైందంటూ శంకరయ్య లేచాడు సూరిపంతులు ఒక రూపాయితీసి శంకరయ్య జేబులో కుక్కేడు ''వద్దు పంతులుగారూ! వద్దు. మీ సొమ్ము కష్టార్జితం నా కక్కర్లేదు'' అంటున్నా సూరిపంతులు తీసుకోమని బలవంతం చేసేడు శంకరయ్య చేతులెత్తి దండం పెడుతూ, ''ఇది నా కష్టార్జితం అని కడిగిపారేసేమందుకి పెట్టుబడి. మీ ధర్మమా అని కొన్నాళ్లనుండి హాయిగా ఉంటున్నాను'' అంటూ శంకరయ్య కల్లుదుకాణాల దారిలో పడ్డాడు

సత్తెమ్మ జీవిత చరిత్ర నెమరువేసుకుంటూ సూరిపంతులు మంచమ్మీద చేరపడ్డాడు. ''తనకు తెలిసిన పరమరహస్యాన్ని ఉపయోగించి సత్తెమ్మను దండిస్తే! ఛ! ఛ!! అలాంటి అవినీతికరమైన పని చెయ్యకూడదు. అలాగే ప్రవర్తిస్తే

తనకూ సత్తెమ్మకూ ఉన్న తేడా ఏమిటి ఆమె తిన్నఇంటివాసాలు లెక్కపెడితే, తాను నమ్మిన శంకరయ్యకు మోసం చేసినవాడవుతాడు అంతటితో ఆగిపోతుందా ఆ పెంట పెరుగుతుంది. కొండంత పెరిగాక విరిగి తనమీదే పడితే, అందులో కాంతమ్మ నలిగిపోతే "సూరిపంతులుకి ఆలోచిస్తున్న కొలదీ భయం ఎక్కువయింది. సత్తెమ్మ బాధ తప్పించుకోవడానికి ఏ మార్గమూ అగుపించకుండా పోయింది శంకరయ్యతో స్నేహం సత్తెమ్మ బాధని తప్పించుకోవడానికే చేసినా, ఇప్పుడు శంకరయ్యని అవిధంగా ఉపయోగించుకోవడానికి మనస్కొప్పుకోకుండా ఉంది. శంకరయ్యవలన కూడా ఆర్థికంగా తనకు ఇబ్బంది కలుగుతున్నా, ఆయన కల్మషంలేనివాడు ఈవిధంగా న్యాయాన్యాయాలు ధర్మాధర్మాలు నిర్ణయించడంలో సూరిపంతులు బుర్ర పాడుచేసుకుంటున్నాడు పూసగుచ్చినట్లు అన్ని వివరాలు చెప్పినా, కాంతమ్మ సరైన ఉపాయం సూచించలేకపోయింది.

ఇటు సత్తెమ్మకూడా నానా హైరాన పడుతూంది. శంకరయ్యతో స్నేహం చెయ్యడంవలన తన గుట్టుమట్లన్నీ శంకరయ్య సూరిపంతులుతో చెప్తాడని, ఆ విషయాలని ఆధారంగా చేసుకుని తనకు హానిచెయ్యగలడని ఏనాడో ఊహించింది. అందుచేత శంకరయ్యకీ సూరిపంతులుకీ గల స్నేహం విరవడానికని అన్ని ప్రయత్నాలూ చేసింది చిన్న చిన్న ఫిర్యాదులు చేసింది పంతులుతో స్నేహం మంచిదికాదని బోధపర్చింది కాని శంకరయ్య కవేమీ పట్టనట్లూరుకున్నాడు. ఒకనాడు, ఆఖరు ప్రయత్నంగా, పెద్ద తరహా ఫిర్యాదే చేసింది "నువ్వెప్పుడూ కల్లుపాకలోనే వుంటావు నా గతి ఏమవుతుందో నీ కక్కర్లేదు" అంటూ

"అదేమిటి! నీనోటంట అలాంటి మాట లెప్పుడూ రాలేదే?"

"నువ్వెప్పుడూ తాగి నిషామీద ఉంటే ఎప్పుడు చెప్పుమంటావు" నా బాధ నీకు కావాలా ఏమేనా? నీ తాగుడూ, నీ సూరిపంతులూ తప్ప."

"పంతులుగారిమీద ఎందుకే విరుచుకుని పడతావు. నువ్వు పడుతూన్న ఆ యమబాధ ఏమిటో కాస్త చెప్పరాదూ?"

"పంతులుగారు! మర్యాద కూడాను ఆ మనిషికి."

"మాటలు తిన్నగా రానియ్యవే అనవసరంగా ఎందుకలా పేరుస్తావు"

"ఆ పంతులు నావేపే ఎప్పుడూ చూస్తూ ఉంటాడు."

"అబ్బో! పతివ్రతలాగ మాట్లాడుతున్నావే"

"నీ కన్నీ వేళాకోళాలే పాలు తీసుకున్నప్పుడు చేతికి చెయ్యి తగిలించాలనే తొందర పడతాడు"

'పగలల్లా ఆఫీసులో ఉంటాడు రాత్రి కాంతమ్మతో ముచ్చటలాడుకుంటాడు మరి నిన్నెప్పుడు చూస్తున్నాడంటావు"

"చూడటానికి ప్రత్యేకించి టైము కావాలా ఏమిటి"

"ఓహో! నువ్వు పచ్చని పంతులు సంసారాన్ని పాడుచెయ్యాలని చూస్తున్నావన్నమాట!!"

"ఛీ నీతో మాటలేమిటి" అంటూ సత్తెమ్మ ఇంట్లోకి వెళ్తూ, శంకరయ్యకి వినపడేలాగ "నీకా కాంతమ్మ ఏదో మందుపెట్టింది అందుకే కట్టుకున్న పెళ్లాం కూడా నీకు అక్కర్లేకపోతున్నాది" అంది. ఈ మాటలకి శంకరయ్య రౌద్రాకారుడయ్యాడు కాని తమాయించుకున్నాడు కాంతమ్మను చూస్తే తన కూతురు జ్ఞాపకం వస్తుంది. అందుచేతనే కాంతమ్మను ఏమన్నా సహించడు సత్తెమ్మకు ఏ ఉపాయం తోచక తికమక పడుతూంది

యథాప్రకారం శంకరయ్య మళ్లా "పంతులుగారూ" అని పిలుస్తూ గుమ్మంలో కూర్చున్నాడు. శంకరయ్య చాల సంతోషంగా ఉన్నాడు. పంతులు తన వేపు చూస్తున్నాడని సత్తెమ్మ చెప్పిన మాటలు జ్ఞాపకం తెచ్చుకుంటూ నవ్వుకున్నాడు సూరిపంతులు కూడా వచ్చి కూర్చున్నాడు సూరిపంతులు చాలా విచారంగా, నీరసంగా ఉన్నాడు అది శంకరయ్య చూసి

"అదేం. నీరసంగా ఉన్నట్లున్నారు. ఒంట్లో బాగులేదా" అన్నాడు

"అబ్బే! అప్పుడప్పు డలా ఉంటుంది. అంతేకాని మరే చికాకూ లేదు"

"మీకు హుషారెక్కేమాట చెప్తాను వినండి"

"చెప్పండి"

శంకరయ్య ముందే నవ్వేడు.

"మా సత్తిని మీరు చూస్తున్నారటండోయ్. నాకు ఫిర్యాదు చేసింది."

"ఎంతమాటన్నారు. శంకరయ్యగారూ! ఆవిడ" అని ఇంకా పూర్తి చెయ్యకముందే కాంతమ్మ ఇవతలికొచ్చింది కాంతమ్మకీ అన్నిసంగతులూ తెలిసేయి. కాని భర్తని కాదని తనెందుకు ముందుకు రావడం అని ఊరుకుంది సూరిపంతులు ధర్మాధర్మాలు న్యాయాన్యాయాలు అని తలబాదుకుంటూ ఉంటే "తనకు మాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము" అని చిన్నప్పుడే తెలుసుకున్న సామెత పాడిచి, చెయ్యవలసిన పని నిర్ణయించమంది కాని సూరిపంతులు వెనుకంజ వేసేడు 'ఆలస్యాదమృతం విషం' అన్న ఆర్యోక్తి నిజం అయింది ఇప్పుడు సత్తెమ్మకు తన కాపురం మంట కలపాలన్న దుష్ట సంకల్పం పుట్టింది అని అనుమానం తోచింది అందుకే ముందూ వెనకా ఆలోచించకుండానే ఇవతలికొచ్చింది "ఆయన చూడలేదండీ నేను, నేనూ అలా చూసేను ఎవరో కొత్తమనిషి మీ ఇంటికొస్తే ఆడదానికుండే కుతూహలంకొద్దీ ఎవరా అని చూసేను అందు కావిడ కోపం తెచ్చుకుందేమో ఫెడీలుమని తలుపులు వేసుకుంటూ ఆ కొత్త మనిషి ఆవిడ లోపలికెళ్లేరు సత్తెమ్మగారి తమ్ముడేమో అనుకున్నాను" అంది కాంతమ్మ శంకరయ్య ముఖంలో నెత్తురు చుక్క కూడా లేదు. "ఆ మనిషిని 'ఆదీ' అని కాబోలు పిల్చింది సత్తెమ్మగారు" అని కాంతమ్మ ఇంట్లోకెళ్లింది

శంకరయ్య శరీరమెల్లా తేళ్లూ, జెర్రులూ ప్రాకుతున్నట్లయింది మరొక్క క్షణం కూడా నిలబడలేకపోయేడు ఆ వచ్చినవాడు ఆదినారాయణే అని దృఢనిశ్చయంఅయిపోయింది. 'కాంతమ్మ అబద్ధం ఆడదు తనకు కూతురు వంటిది ఈసారి సత్తికి తగిన బుద్ధి చెప్పాలి' అనుకుంటూ లేచేడు శంకరయ్య సూరిపంతులు వైపు చూడకుండానే గుమ్మం దిగేడు సూరిపంతులు తొందర తొందరగా లోపలికెళ్ళి "కాంతం! ఎంతపని చేసేవు అన్యాయంగా ఆ సంగతిచెప్పి, శంకరయ్యగారి మనస్సు పాడుచేసేవు. అతనిప్పుడు తప్ప తాగి ఆ సత్తెమ్మని ఏంచేస్తాడో ఏమిటో. మనం కూడా ఆ కుళ్ళ పెళవలవిషయాల్లో ఇరుక్కోవలసి వస్తుంది" అన్నాడు.

"ఇలా పిల్లిలా ఒదిగి బతికేకన్న ఆర్భాటంగా నింద పడటమే మేలు ఎన్నాళ్లని ఆ సత్తెమ్మకి నేను సలాము పెట్టడం?"

"అయితే అదా చెయ్యవలసింది?"

కాంతమ్మ మరేం మాట్లాడలేదు. వేగంగా పక్క తెముల్చుకుని ఏమి ఉపద్రవ జరగబోతుందో, తప్ప తాగి వచ్చిన శంకరయ్య ఏమి రభస చేస్తాడో అని బెంగతో మంచమ్మీద కూర్చున్నా రిద్దరూను. అర్ధరాత్రి కావస్తూన్నా ఏ భయంకర దృశ్యం అగుపించకపోవడాన్ని శంకరయ్య తిరిగి వచ్చినట్లు కూడా తెలియకపోవడాన్ని, కాంతమ్మే ముందు నిద్రపోయింది తర్వాత సూరిపంతులు నిద్రపోయేడు.

## 3

తెల్లవారి ఏడున్నరయినా పాలు పట్టుకుని సత్తెమ్మ రాకపోయేసరికి, రాత్రికి రాత్రి శంకరయ్య సత్తెమ్మని చంపీసేడేమిటిచెప్మా అని భయపడ్డాడు. లేచి చూసేసరికి శంకరయ్యే స్వయంగా పాలు పిండుతున్నాడు బితుకు బితుకుగా శంకరయ్యకు ఎదురుగా నిలబడ్డాడు

'నమస్కారమండీ పంతులుగారూ! మా సత్తి ఆదినారాయణతో లేచిపోయింది. కాంతమ్మ చెప్పిన మాటలు నిజమే వాడికి కలకత్తా బదిలీ అయిందట! పోతూ పోతూ దార్లోనేకదా సత్తి కూడా ఉందని నిన్నను చూడటానికని ఒచ్చేడు వాడివెంట వెళ్ళిపోయింది ఎప్పుడు వెళ్ళిందో ఎలా వెళ్ళిందో ఏమీ తెలియదు నేను తిరిగొచ్చేసరికి తలుపు లన్నీ బారుగా తీసేసి ఉన్నాయి ఏవో దాని బట్టలూ, నగలూ తప్ప మిగిలినవన్నీ జాగ్రత్తగా ఉన్నాయి. ఏమిటో దానికలా దుర్బుద్ధి రాసిపెట్టేడు" అని శంకరయ్య పాలు పిండడంలో నిమగ్నుడయ్యాడు. మరొకడితో లేచిపోయిన తన భార్య గురించి అంత నిర్లిప్తంగా ఉండడం ఒక్క శంకరయ్యకే తెలుసు! శంకరయ్య కల్మషంలేని మనిషి !!!

ఈ హఠాత్పరిణామానికి కొంచెం కలవరపడ్డాడు సూరిపంతులు తర్వాత కొంత శాంతి లభించింది "హమ్మయ్య" అనుకున్నాడు సత్తెమ్మ బాధ అన్నాళ్లకేనా వదిలినందుకు అందరికన్నా ఎక్కువగా కాంతమ్మ సంతోషించింది ఆ వెంటనే దారిని పోతున్న పాలవాడిని పిల్చి చిక్కటి పాలు వాడుకగా ఇమ్మని నిర్ణయించుకున్నారు కాంతమ్మ సంసారం కుదటపడింది 



చిత్రకారుడు—గుమ్మలూరు రామకృష్ణ
(హైదరాబాద్)








# సన్నిహిత బంధు వర్గంలో వివాహాలు

(23 వ పేజీ తరువాయి)

దృష్టిలో ఉంచుకొని చేయాలి. వివాహం అతి పవిత్రమైన మహా బాధ్యత, మనం చేసే నిర్ణయాలు మూడు ముళ్ళు పడడంతోనే ఆగిపోవు. అనేక జీవితాలను శాసించకలవి అవుతాయి వైవాహిక జీవితం ఆనందదాయకం అయి, మన పిల్లల భవిష్యత్తు సఫలీకృతం కావడానికి మనం శక్తివంచన లేకుండా అన్ని అంశాలను ఆలోచించి సత్యాసత్యాలను దూరదృష్టితో వివేచన చేయగలిగి ఉండాలి నేను ప్రస్తావించిన అంశాలు, నిజంగా ఈ సందర్భంలో ఆలోచింపవలసిన వానిలో బహు తక్కువ. ఇంకా ఎన్నో విషయాలను మనం ఆలోచించుకొనవలసి ఉంటుంది ఆర్థిక, సాంఘిక విద్యా విషయాలను అనేక ఆంతరంగికమైన కుటుంబ పరిస్థితులను కూడా విచారింపవలసియుంటుంది వీటి నన్నింటిని కూలంకషంగా చర్చించిన మీదటనే మనం ఒక నిశ్చితమైన నిర్ణయానికి రావటాడానికి వీలు పడుతుంది ఈవిధమైన, సమగ్రమైన విచారణ చేయకుండా తాత్కాలికమైన ఉద్రేకాలకు, ఆవేశాలకు వశులమై, మన పవిత్రమైన బాధ్యతను మరచిపోయి సంబంధాలను స్థిరపరచడం వలన తరువాత మనం దుఃఖపడడమే కాక, రెండు నిండు జీవితాలను బలి కొన్నవార మవుతాము ఇటువంటి సంకుచిత భావాల వలన భంగపడిన అనేక వైవాహికజీవితాలను మనం చూస్తూనే ఉంటాము తిరిగి అదే తప్పును మనం చేయరాదు. కాబట్టి నా అభిప్రాయం ప్రకారం వివాహ సంబంధాన్ని స్థిరపరచడంలో అనేక విషయాలను సమగ్రంగా పరిశీలించవలెనని, ఏవిషయానికి ఎంత ప్రాధాన్యత నీయాలో అంత యిచ్చి ఒక నిశ్చయానికి రావాలి. ఏ అంశాన్ని నిర్లక్ష్యం చేయడం గాని, అతిగా భావించి, దాన్నే ఆధారంగా చేసుకొని ఇతర విషయాలను విస్మరించడం కాని చేయరాదు ఈ దృష్టితో చూస్తే సన్నిహిత బంధుత్వం అనేది తప్పక ఆదరణీయమే అయినప్పటికి, మనం యోచింపవలసిన అనేక అంశాలలో అది కేవలం ఒక అంశం మాత్రమే నని తెలుస్తుంది. కేవలం బంధుత్వాన్ని ప్రాతిపదికగా పెట్టుకొని, మిగిలిన ముఖ్య విషయాలను విస్మరించి సంబంధాన్ని స్థిరపరచడం సమంజసం కాదు ★



'భక్తజయదేవ'లో నాగేశ్వరరావు, రేలంగి మొదలయినవారు



# రమణీయ సాహితీ రమణ 'భక్తజయదేవ'

ఎప్పుడూ సాంఘికపు తిరగాయలవే రుచి చూస్తున్నవారికి మహాపురుషుల జీవిత గాథలు వరమాన్నమే. అలాంటి చిత్రమే లలితకళా నికేతన్‌వారి 'భక్త జయదేవ'. ఉత్తమ సాహిత్యోద్భవానికే అవతరించిన మహాకవులు కాళిదాస జయదేవాదులు కారణజన్ములనే సత్యాన్ని నిరూపించే ఈ చిత్రాన్ని ఈ నెల 13 న ప్రత్యేకప్రతినిధులకు చూపించారు.

చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన జయదేవుడు (నాగేశ్వరరావు) గురుదేవులయింట పెరుగుతూ విద్యాభ్యాసం చేస్తుంటాడు. అతనికి కూర్చిన మిత్రుడు పరాశరుడు (రేలంగి). ఇద్దరు ఒక కంచంలో తిని ఒక మంచంలో పండి పెరిగినవాళ్ళు. చిన్నతనంలోనే జయదేవుడు బాలగోపాలుని లీలావిలాసపరవశుడై, గీతాలు రచించ ప్రారంభిస్తాడు. శృతి వధూసీమంతవీధుల విహరించే పరంధాముని శృంగారలీలావర్ణనగా వర్ణించరాదని గురువు మందలిస్తాడు. అలకతో ఇంటినుంచి వెళ్ళిపోయిన జయదేవుడు గోవింద నామామృతపానపరవశులౌతున్న ఒక భక్తబృందం (మూలంలో గోవర్ధనస్వామి ఆశ్రమం అని) ఆశ్రమానికి చేర్తాడు. ఈతనిలో ఉప్పొంగే భక్తిభావాన్ని, తన్మయత్వాన్ని చూచి గురువు (నాగయ్య) రాధారమణ మంత్రాన్ని ఉపదేశిస్తాడు. జయదేవుణ్ణి వెతుక్కుంటూ వచ్చి గురువుతో (నాగయ్యతో) తాడో పేడో తేల్చుకుని జయదేవుణ్ణి దక్కి ఇంటికి తీసుకుపోదామని వచ్చిన పరాశరుడు (రేలంగి) కూడా తన సహవాసితోపాటు అంతేవాసిగా ఉండిపోతాడు.

తల్లిదండ్రులను కోల్పోయి రంగసాని (కమలాబాయి) అనే వేశ్య యింటో పెరిగిన పద్మదళాయతనేత్ర పద్మావతిని (అంజలీదేవి) వివశుడైన సేనిదన్న్యుడు కాముకేతు (ముక్కామల) పెళ్ళాడ బలవంతం చేయటంతో వాడి కథ అడ్డంతిరిగి పద్మావతి జయదేవుడుండే ఆశ్రమంలో ఆశ్రయం సంపాదించుకుంటుంది. క్రమంగా పద్మావతీ జయదేవులు ఆశ్రమ సహవాసంతో రాధారమణ సేవలో ఒకరికొకరు దగ్గరవుతారు. గురువు వారిని ఆశ్రమం వదిలి(గృహస్థ) ఆశ్రమ స్వీకారం చెయ్యమని ఆదేశిస్తాడు. క్రమంగాపద్మావతీచరణచారణతో జయదేవుని భావ పరవశహృదయం భాషారూపంలోకి కరిగి గీతగోవిందానికి నాంది అవుతుంది. జయదేవుని పాటకు పద్మావతి ఆట నవ్య నాటక భావాలతో కొత్త పాటకు బాట ఏర్పరుస్తుంది.

జయదేవుడుంటున్న పట్నాన్ని పాలించే ఒక (రవ) పెన్ని మహారాజ పురుషోత్తముడు (సి. ఎస్. ఆర్) తాను జగన్నాథుని మీద వ్రాసిన గీతాలు అధికి పులిహోర, దధ్యోదనం పెట్టి యువా ప్రచారం చేయాలనుకుంటే పులిహోర ఖర్చే తప్ప ప్రయత్నం ఫలించదు. జయదేవుని, తన కవిత్వాలతో శ్రేష్ఠతను నిరూపించుకోటానికి జగన్నాథుని ఆలయంలో ఉంచటం జగన్నాథుడు జయదేవుని గ్రంథ శ్రేష్ఠతను నిరూపించటంతోటి పురుషోత్తముడు గీతగోవిందానికి దాసోహ మనటం వగైరా కథ అందరికీ తెలిసిందే. పురుషోత్తముని సత్కారం అందుకొని ఇంటికి వస్తున్న జయదేవుడి ధనాన్ని దొంగలు కాముకేతువు ప్రోత్సాహంతో తస్కరించి, జయదేవుణ్ణి గాయపర్చటం జరుగుతుంది.

ఎందుకో ఆ దారంట పోతున్న మహారాజ

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

సుమారు రు. 3.61 కోట్లు విలువచేసే జింక్, టిన్, లెడ్‌వంటి లోహాలకు కాంట్రాక్టులు కుదిరాయి

రష్యా, పోలెండ్, స్వీడన్, ఫిన్‌లాండ్, నార్వే దేశాలనుంచి 47,200 టన్నుల న్యూస్‌ప్రింట్ దిగుమతికి ఒప్పందాలు చేసుకున్నారు. స్వీడన్, ఫిన్‌లాండ్, నార్వే దేశాలనుంచి 19,265 టన్నుల న్యూస్‌ప్రింట్ దిగుమతి అయింది. చకొస్లొవకియా, హంగరీ దేశాలకున్న రూపాయిల కాతాల, క్రింద ఈ సరుకుకు ఖరీదు చెల్లించటం జరిగింది. ఇందుమూలంగా రు. 80—90 లక్షలు విలువచేసే విదేసీ మారకం ఆదా అయింది. అంతేకాక, వస్తు మార్పిడి పద్ధతిక్రింద 955 టన్నుల న్యూస్‌ప్రింట్ రీళ్ళు దిగుమతి అయ్యాయి.

ఇటలీ దేశానికి చెందిన గోగిస్ కంపెనీ (మిలాన్) తో కుదుర్చుకున్న ఒప్పందాన్ని అనుసరించి సుమారు కోటి రూపాయలు విలువచేసే కృత్రిమ సిల్కు దిగుమతికి ఏర్పాట్లు జరిగాయి ఈ నూలును టెక్స్‌టైల్ కమీషనర్ సూచనల మేరకు పంచబడింది.

దేశంలో పెద్దపెద్ద టైర్లు, ట్యూబులు కొరత విరివిగా ఉన్నందువల్ల ప్రభుత్వ ఉత్తరువుల ప్రకారము పోలెండ్, చైనా రష్యా, ఇటలీ, జపాన్, చకొస్లొవకియా దేశాలనుంచి సుమారు 54 వేల జతల టైర్లను ప్రభుత్వ వాణిజ్య సంస్థ దిగుమతి చేసుకున్నది. ఈ టైళ్ళ విలువ (ట్యూబులు ఫ్లాంపులు సహా) సుమారు రు 1.3 కోట్లు. వీటిని ప్రభుత్వ రవాణా సంస్థలకు, రవాణాశాఖ అధికారుల వద్ద రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్లు పొందిన మోటారు వాహనాల యజమానులకు, ప్రభుత్వ వాణిజ్య సంస్థకు ఖనిజాలు సరఫరాచేసే లారీల యజమానులకు విక్రయించారు ఈ దిగుమతులవల్ల దేశంలో టైర్ల ధరలు పెరుగకుండా నిరోధించే వీలు కలిగింది. 1961 సంవత్సరంలో అదనంగా 1,20,000 టైర్లు దిగుమతి చేసుకోవలసిందిగా ప్రభుత్వ వాణిజ్య సంస్థను ప్రభుత్వం ఆదేశించింది.

సుమారు రు 38 లక్షలు విలువచేసే ఫోటోగ్రాఫిక్ పరికరాలను దిగుమతి చేసుకొని వినియోగదారులకు, ప్రభుత్వశాఖలకు అందజేశారు ఆ విధంగానే రు. 57.5 లక్షలు విలువచేసే ముడి ఫిలిమ్స్, రు 26 లక్షలు విలువచేసే ఎక్స్—రే ఫిలిమ్స్ దిగుమతి చేసుకొని, వినియోగదారులకు, ప్రభుత్వ శాఖలకు పంచిపెట్టారు.

కేంద్ర ప్రభుత్వ ప్రింటింగ్ స్టేషనరీశాఖ అవసరాల నిమిత్తం రు 80 లక్షలు విలువచేసే కాగితం వస్తు మార్పిడి పద్ధతిమీద మాంగనీస్ పంపి, దిగుమతి చేసుకున్నారు. వినియోగదారుల అవసరాలకుగాను రు 11 లక్షలు విలువచేసే టిష్యూ క్రేప్ మొదలైన రకాల కాగితం రూపాయి కాతాల క్రింద దిగుమతికి ఏర్పాట్లు జరిగాయి. ★

లకు ఎగ్జిబిషన్‌లో అన్ని సెక్షన్లు తాను దగ్గరవుండి చూపించసాగాడు రామం. బోటనీ సెక్షనులో అడుగు పెడుతూన్న అత్తయ్య "మీ బాపూ బొమ్మ ఏక్కడ వుందోయ్!" అంది నవ్వుతూ నెమ్మదిగా. సుశీల అప్పటికే కాలేజీ వాతావరణాన్ని అర్థం చేసుకుంది కనుక అత్తయ్య మాటల్లోని భావం అర్థంకాక పోయినా తర్వాత తెల్సుకుందామన్నట్లూరుకుంది. రామం పేలవంగా నవ్వాడు

వాళ్ళు ఆ గదిలో అడుగుపెట్టడం చూసిన వెంటనే రమణిని బలవంతంగా కూడా తీసుకొని గేటుదాటి వెళ్ళిపోయింది శశికళ అది రామం, అత్తయ్య కూడా గుర్తించారు రామం బాధపడ్డాడు. అత్తయ్య అర్థంకాక తెల్లబోయి ఎగ్జిబిషన్‌లోని వస్తువుల చూసే పనిలో పడిపోయింది రామం చాల నిరుత్సాహపడిపోయాడు

తర్వాత రెండు గంటలసేపు వెదకినా శశికళ కనిపించలేదు—నాల్గుగంటలకి మీటింగ్. వందల కొద్దీ జనులతో కాలేజీ 'గ్రౌండ్సు' నిండిపోయాయి రంగు రంగుల చీరలు ధరించిన స్త్రీలతో కాలేజీ ప్రాంగణమంతా కన్నుల పండుగగా వుంది ఆ జన సమూహంలో శశికళ ఎక్కడని కన్పిస్తుంది రామానికి?

కాలేజీ 'సెంటెనరీ సెలబ్రేషన్స్' ఆనందంగా, ఆహ్లాదంగా, ఉత్సాహంగా జరిగాయి కాని రామానికి మాత్రం ఉత్సవాలు జరిగిన మూడు రోజులూ నిరుత్సాహంగానే ఉంది శశికళ ఎప్పుడో కాని కనిపించేదేకాదు కనిపించినా ముఖం తిప్పుకునేది ఒంటరిగా కల్సుకోడానికి వీలు చిక్కలేదు యింటికివెళ్ళి కల్సుకుందామంటే రాత్రి తొమ్మిది గంటల వరకు ఉత్సవాలు పూర్తయ్యేవికావు. అదీగాక అంత రాత్రప్పుడు వెడితే ఆమె తల్లిదండ్రులు ఏమైనా అనుకుంటారేమోనని సంకోచం ఇట్లా మూడు రోజులూ మూడు యుగాలుగా గడిచాయి

* * *

ఆ మరునాడు కూడా కాలేజీకి శలవు. ఆవేళ ఎట్లాగైనా శశికళను కల్సుకోవాలనుకున్నాడు రామం

కాని పది గంటలకి మామయ్య ఏదో పెళ్ళి శుభలేఖ తీసుకొని వచ్చాడు. అది ఆఫీసుకువచ్చి రెండు రోజులయిందిట. ఆయన క్యాంపు వెళ్ళటం మూలాన అందలేదు. ఆరాత్రే ఒంటిగంటకు పెళ్ళి. వెంటనే అత్తయ్యను, సుశీలను ప్రయాణం కమ్మన్నాడు మామయ్య. రామం ట్రిగనామెట్రీ ప్రాబ్లెమ్స్ చేసుకుంటున్నాడు.

"ఏరా రామం! డ్రెస్ చేసుకోవేం?" అన్నాడు మామయ్య బూట్లు తొడుక్కుంటూ

"నేనెందుకులే మామయ్యా! మీ రెళ్ళండి" అన్నాడు తలెత్తకుండానే.

"ఏడిశావు లేవోయ్ సన్యాసీ! ఈ రాత్రి లోపుగా నువ్వేం పడపొడిచెయ్యవులే! రేపు మధ్యాహ్నానికల్లా తిరిగి వచ్చేద్దాం! త్వరగా లే!" అన్నాడు మామయ్య

ఆయన మాట తీసివేయలేకపోయాడు పైగా యీ లోపల సుశీలవచ్చి అతని చేతుల్లోని పెన్ను, పుస్తకం లాక్కుంది నవ్వుతూ —

గోదావరి స్టేషను చేరుకునేసరికి పదకొండు వ్వరయింది రామం ప్రభృతులకు. అక్కడే భాస్కర్ కలిసాడు. ఇద్దరూ ఆశ్చర్యంగా పలకరించుకున్నారు. ఇదరూ అదే పెళ్ళికి వెడుతున్నా

# కలహాంతరిత

(10 వ పేజీ తరువాయి)

మని తెల్సుకున్నారు

"మరి నువ్వీ పెళ్ళికి వెడతానని చెప్పలేదే మిరా!" అని అడిగాడు రామం.

"పెళ్ళికొడుకు మాకు దగ్గరివాడే! వాడు నా క్లాసుమేటు కూడా. స్కూలుఫైనలులో...... ... వాడు స్వయంగా వచ్చి చెప్పివెళ్ళాడు కనుక నేను ముందే మర్చిపోయాను. ఇందాకా ఏదో సినిమా సమీక్ష చదువుతూంటే అకస్మాత్తుగా గుర్తుకు వచ్చింది వెంటనే యిట్లాగే కట్టుబట్టలతో బయలుదేరాను మీ మామయ్యకు శుభలేఖ ఎంత అందంగా అందిందో నాకు ఆ విషయం అంత బేషుగ్గా జ్ఞాపకం వచ్చింది" అని నవ్వాడు భాస్కర్.

తర్వాత ఏవేవో కబుర్లు తిన్నారు కడుపు నిండా . వాళ్ళా వూరు చేరుకునేసరికి సాయంత్రం మూడున్నరయింది. రామం, వాళ్ళ అత్తయ్య, మామయ్య, సుశీల ఆడపెళ్ళివారిలోను, భాస్కర్ మొగపెళ్ళివారిలోను కల్సిపోయారు

పందిరంతా పెళ్ళివారితో కలకల్లాడుతోంది. ఇంకా చుట్టాలు దిగుతూనే వున్నారు. పిల్లల అల్లర్లు, పెద్దల ముచ్చట్లు, పనివాళ్ళ సరాచకాలు, పెళ్ళిపెద్దల పురమాయింపులు, బ్రాహ్మణుల హడావిడి, రక రకాల శబ్దాలతో కోలాహలంగా వుంది, ఫస్టు రిలీజునాడు సినిమా హాల్లో రొదలా

ఆగడబిడను భరించలేక దొడ్లో మల్లెపందిర వుంటే దానిక్రిందకు చేరాడు రామం. అక్కడ మంచమొకటివుంటే దానిమీద పడుకొని రైల్లో కొన్న వార పత్రిక తిరగ వేస్తున్నాడు. అయినా అతనికేమీ చదవ బుద్ధికాలేదు. అట్లా పావుగంట గడిచింది.

". ...ఇదిగో! అన్నయ్య యిక్కడున్నాడు " అంటూన్న సుశీల కంఠం వినిపించి పైకి లేచాడు రామం. భాస్కర్‌ను తీసుకువచ్చిన సుశీల లేడిలా గెంతుతూ వెళ్ళిపోయింది భాస్కర్ ముఖంలోని చిరునవ్వుకు రామం ఉత్తేజితుడయ్యాడు

"ఒరేయ్! గుండెలు గట్టిగాపట్టుకో—జారి పోకుండా! నేనొక శుభవార్త చెప్తాను అందుకనే యీ ఆడపెళ్ళివారిల్లంతా హనుమంతుడు లంకలో సీతాదేవికోసం వెదకినట్లు కలయ దిరిగి ముందు ముఖపరిచయమున్న మీ సుశీలను పట్టుకొని నీ జాడ తెల్సుకున్నాను . ." అన్నాడు భాస్కర్ నవ్వుతూ.

"అబ్బ! నీ సోది కట్టిపెట్టి అసలు విషయం చెబ్దూ! నన్ను సీతాదేవితో పోల్చావు. ఇంకా నయమే ఏ శూర్పణఖతోనో పోల్చావుకాదు" అన్నాడు రామం నిట్టూరుస్తూ.

"నీ బామ్మ కూడా యీ పెళ్ళికి వచ్చిందిరా! ఆ శుభవార్త చెప్పటానికే యింత ఉరుకు పరుగులతో వచ్చినది"

"ఆ! నిజంగానే?" నిజంగానే ఆశ్చర్యపోయాడు రామం.

"నేను ప్రత్యక్ష దైవం—భాస్కర దేవుడిని. అనృతము వక్కాణించెదనా? నాకెక్కడ లేనిదీ తెలియునన్న అంశము జగద్విదితము"

"అబ్బ! కాసేపు నీ గ్రాంధికం కట్టిపెట్టరా నాయనా? ఇంతకీ శశికళ యిక్కడికి రావటం నిజమా అబద్ధమా! నన్ను ఆటాడించకురా?" ప్రాధేయ పూర్వకంగా అన్నాడు రామం

"నిజం! మునిసిపాలిటీ దోమలమీద ఒట్టు!..... నేను మగపెళ్ళివారి ఆహ్వానితుడినికదా అని విడిదికే వెళ్ళాను అక్కడ శశికళను చూడగానే కొయ్య బారిపోయాను ఆమెను నీద్వారా నే నెరుగుదును కాని ఆమె నన్నెరుగదుకదా! వాళ్ళమ్మ, నాన్న, మొగపెళ్ళివారికి దగ్గరివాళ్ళేనటలే! ఇట్లా అనుకోని సంఘటనలు వింత అనుభవాలకు దారి తీస్తాయి"

"అయితే ఈ రాత్రి శశిని ఒంటరిగా కల్సుకోటానికి ప్రయత్నిస్తాను"

"అది సర్వోత్తమం ఎందుకంటే కళ్ళు పండుగ చేసుకొని ఒళ్ళు గట్టిపర్చుకోటానికి చక్కని అవకాశం"

"ఏడిశావులే! ఏమైనాసరే. తెల్లవారేసరికి శశిని నాకు సుముఖురాలుగా చేసుకొని తీరతాను"

"నేను అట్లా చేయలేవని పందెం వెయ్యనులే! ఇప్పటికే యిందాకా ఆడిన రెండాటలలోను జేబులో సగం ఖాళీ అయ్యాయి"

"ఇక్కడికి వచ్చినా పేకాటపిచ్చి నిన్ను వదల్లేదు"

"అసలు పిచ్చెక్కనివాడు మానవుడేకాదు అందులో ముఖ్యంగా జూదం నూటికి నూరుపాళ్ళు సకల ధర్మ సమన్వితమైన పిచ్చి. అది ఆవహింప జేసుకున్నవా డదృష్టవంతుడు. ముఖ్యంగా పేకాట రానివాళ్ళకు నూతన జూద విద్యారంభానికి చక్కని అవకాశా లిటువంటి పెళ్ళిపందిర్లలోనే కదా! పెళ్ళిళ్ళల్లో నిజంగా వేడుక చూద్దామని వచ్చేవారు యీ పేకాటాడడానికి వచ్చేవాళ్ళల్లో నాల్గవంతైనా ఉంటారంటావా?"

"ఇక నీ ఉపన్యాసం కట్టిపెట్టు. చీకట్లు ముసర బోతున్నాయి పోదాం పద"

"నేను తిన్నగా విడిదికే వెళ్ళిపోతాను ఆడపెళ్ళివారి తరఫున భోజనాల పిలుపుకి వస్తావుగా! అప్పుడు కలుద్దాములే! అది సరేకాని నీకు ఆ అమ్మాయి—అంటే . సుశీల వివరాలు తెల్సుగా! . . ." అని నసిగాడు భాస్కర్

రామం మరుక్షణంలో చిన్నగా నవ్వాడు. "అయితే అబ్బాయి కన్ను పడిందన్నమాట! వివరాలుకేం! చెప్తాను. పెళ్ళిచూపులు యేర్పాటు చేసెయ్యమంటావా?....." రామం సుశీల వివరా

గజదొంగ నొకతనిని కొరత వేశారు. ప్రాణాలింకా ఉనా, యనగా ఒక పెద్దమనిషి వెళ్ళి అతనిశిరః నిమిరాడు. "ఫర్వా లేదండీ, త్వరలో పోతాను!" అన్నాడు దొంగ కృతజ్ఞతతో. "అబ్బే, అది కాదు, ఇంకా కొరతకొయ్య మాడుపొడుచుకు రాలేదేమా, అని చూస్తున్నా!" అని సమాధాన మిచ్చాడు పెద్దమనిషి.

అన్నిచెప్పి, "నీకు నచ్చితే చెప్పరా! వెధవ మొహ మాటం నువ్వూను ." అన్నాడు.

భాస్కర్ నవ్వి "నాకేది యిష్టమో నీకు తెలియ దుట్రా!" అన్నాడు.

తర్వాత భాస్కర్ వెళ్ళిపోయాడు. మధ్య వాకిలి దాటుతుంటే సుశీల తల్లి కన్పించింది రామానికి. ఆమెను పిల్చి మల్లెపందిర దగ్గరకు తీసుకువచ్చాడు. అప్పటికి చీకటి పడింది. పెళ్ళి పందిట్లో గ్యాసు లైట్లు దేదీవ్యమానంగా వెలిగిపోతున్నాయి

"పెద్దమ్మా! సుశీలకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారటగా!" అన్నాడు రామం.

"అవును నాయనా! ఇంకా ఏదీ సరియైనది దొరకందే!" అంది ఆవిడ.

"అయితే నా ఎరుకలో ఒక సంబంధం వుంది" అని భాస్కర్ తల్లి దండ్రుల వివరాలు చెప్పి "అతడు నాకు ప్రాణ స్నేహితుడు. సుశీల కన్ని విధాలా తగిన వాడు. ముందు మీరు పెద్దలంతా కూడబలుక్కోండి. నేను వాడిని, సుశీలను ఒప్పిస్తాను" అన్నాడు వర్మగర్భంగానే.

ఆమె సరేనని వెళ్ళిపోయింది. భాస్కర్‌ముందే సుముఖుడైనట్లు చెప్పటం అంతమంచిదికాదని వూరుకున్నాడు రామం.

—మొగపెళ్ళివారిని భోజనాలకు పిలవడానికి వెళ్ళేవారితో వెడదామనుకున్నాడు రామం. కాని ఇంతలో శశికళ తండ్రి సుబ్బారావు పెళ్ళి పందిట్లో ఎవరో ముసలాయనతో మాట్లాడుతూ అతన్ని పిలిచాడు. వాళ్ళ మాటల్నిబట్టి తనకు శశి కళనిచ్చి పెళ్ళి చెయ్యటానికి సుబ్బారావు సుముఖుడైనట్లే గుర్తించాడు. ఆ ముసలాయన ఏవేవో ప్రశ్నలు వేసాడు రామాన్ని. అతని నమ్రతభావం తనకు నచ్చినట్లేకనిపించాడా ముసలాయన.

ఇంతలో పెళ్ళికూతురు పినతండ్రి పందిట్లో పెట్రొమాక్స్ లైటుకి గాలి కొడుతూండగా ఎత్తుగా వచ్చిన మంటకు పైనున్న కండువా అంటుకుంది. ఆయన కంగారుగా ఎగిరి గంతేశాడు. దానితో మరింత మంటలు పైకిలేచి కండువా ఆయన ఒళ్ళు కాల్చింది. అది క్షణంలో గుర్తించిన రామం రెండంగల్లో ఆయన్ని సమీపించి కండువా లాగేసి విస్తళ్ళ ముందువేసే బల్లని దానిపై పడవేసాడు. వెంటనే మంటలారిపోయాయి మరుక్షణం లోపలికివెళ్ళి కొబ్బరి నూనె తీసుకువచ్చి ఆయన భుజంపై కాలినచోట రాసాడు. ఆయన కృతజ్ఞతగా చూసాడు రామం వైపు ఆ మాత్రం గడబిడకే అక్కడ జనం చుట్టూ మూగారు. అంతా రామం సమయజ్ఞతకు కళ్ళతోనే అభినందించారు.

"మీరు విశ్రాంతి తీసుకోండి" అని ఆయన్ను బలవంతంగా వాలుకుర్చీలో కూర్చుండజేశాడు రామం ఇంతలో పెళ్ళివారు బ్యాండుమేళం ముందురాగా ఆడ పెళ్ళివారింట్లో అడుగుపెట్టారు.

అత్తయ్యనడిగి తాను కూడ పట్టుపంచె తీసుకొని కట్టుకొని వడ్డనకు తయారయ్యాడు రామం. అప్పటికి మగపెళ్ళివారు విస్తళ్లముందు ఆసీనులయ్యారు.

వడ్డనలు సాగుతున్నాయి అప్పడాలు, వడియాలు ఉంచిన బుట్ట చేత్తో పుచ్చుకొని రామం వడ్డించసాగాడు ఆడవాళ్ళ వైపుకి వచ్చాడు చిట్టచివరన కూర్చున్నాడు భాస్కర్ అప్పటికికాని, రామం అతన్ని చూడలేదు. ఇద్దరూ నవ్వుకున్నారు. భాస్కర్ సంజ్ఞ చేయటంతో ఆడ వాళ్ళల్లో మధ్యగా కూర్చున్న శశికళను చూశాడు రామం. ఆమె తెల్లబోతున్న ముఖంచూసి చిన్నగా నవ్వుకున్నాడు.

"ఏమిటండీ! అప్పడాలన్నీ యిట్లా ముందుగానే ముక్కలు చేసేశారు....మేము మొగపెళ్ళివారమన్నమాట మర్చిపోకండి" అన్నాడు భాస్కర్ కోపం తెచ్చుకున్నట్లు ముఖంపెట్టి.

"సిత్తం! సిత్తం! తమరప్పడాలుపళంగానే తినేత్తారని మాకు తెలవలేదండి. ఏమగపెళ్ళివారయినా ఒకప్పుడు ఆడపెళ్ళివారు కూడా కాక తప్పదన్న మాట మరవకండి" అన్నాడు రామం నవ్వుతూ. అతని మాటలు విన్నవాళ్ళంతా పకపక నవ్వారు.

ఇట్లా చలోక్తులతో జరిగిపోయాయి భోజనాలు. కాని శశికళ తన దృష్టి ఆమెపై పడేసరికి ముఖం త్రిప్పుకోవటం అతనికి తీరని సమస్యే అయింది.

రాత్రి పదకొండున్నరకి అందరి భోజనాలు పూర్తయ్యాయి. అప్పుడు వధూవరులను పీటల మీద కూర్చోపెట్టే ప్రయత్నంలో పడ్డారు బ్రాహ్మణులు. పెళ్ళితంతు సాగిపోతోంది సూత్రధారణ, తలంబ్రాలుపోత అయిపోయాయి. అప్పటికి ఒంటిగంటన్నరయింది.

సూత్రధారణప్పుడు, తలంబ్రాలు జరిగేటప్పుడు అప్రయత్నంగా శశికళా రామంల కళ్ళు కలుసుకున్నాయి. కాని శుక్లపక్ష తదియనాటి చంద్రుని లాగునే చేసుకుంది శశి తన ముఖాన్ని రామం మనస్సు పరిపరి విధాల పోయింది.

ఇంతలో శశికళకు దగ్గరలోవున్న పందిరి స్తంభాని కానుకుని నుంచున్న సుశీల రామం దృష్టిలో పడింది ప్రక్కనేవున్న భాస్కర్‌ను చూసేసరికి చటుక్కున ఒక ఆలోచన కల్గిందతనికి. "ఒరేయ్! సుశీలను చాటుగాపిల్చి నీవంటే యిష్టమో కాదో తెల్సుకుంటాను" అన్నాడు. భాస్కర్ ముఖం వికసించింది . ...చదివింపులు సాగిపోతున్నాయి.

సుశీలను దూరంనుంచి పేరుపెట్టి పిల్చాడు నెమ్మదిగా.. . ఆ పిలుపులోని ప్రత్యేకతను గుర్తించినది శశికళా సుశీల లిద్దరే! మరెవ్వరికి పట్టినట్లు లేదు

క్రీగంట శశిని చూసి, "నీతో మాట్లాడాలి. ఇట్రారా?" అని సుశీలను తీసుకొని ఇంట్లోంచి దొడ్డివైపుకు బయలుదేరాడు రామం తిన్నగా మల్లెపందిర దగ్గరకు చేరుకున్నారు.

"సుశీ! ఇందాకా నే నిక్కడున్నానని చెప్పి తీసుకు వచ్చావే—ఆ అబ్బాయి సంబంధమే పెద్దమ్మ, పెద్దనాన్న నీకు చెయ్యాలనుకుంటున్నారు. తెలుసా! మరి నీ యిష్టాయిష్టాలు అడగక్కర్లేదూ!" అన్నాడు రామం చిరునవ్వుతో మల్లెల తీగెల మధ్య నుంచి వెన్నెల వారిమీద పడుతోంది రామం మాటల్లోనిభావం సుశీల అమాయకహృదయం అర్థం చేసుకోలేదు. కాని సిగ్గుతో మల్లెమొగ్గయిపోయింది

"మాట్లాడవేం? సుశీ! ఆ అబ్బాయి బి. కాం. చదువుతున్నాడు అన్ని వివరాలు నాన్నకి, అమ్మకి తెల్సునసుకో! మరి నీ కిష్టమో కాదో తెల్సుకోరు ఈ పెద్దవాళ్ళెప్పుడూ అంతే! "

"పెద్దవాళ్ళెప్పుడూ మన మంచికోసమే ప్రయత్నిస్తారని ఎందుకనుకోకూడదు?"

"ఓహో! అయితే భాస్కర్ నీకు నచ్చాడన్నమాట! అమ్మదొంగా!ముందేనిశ్చయించుకున్నావా?"

"పో అన్నయ్యా!......" అంటూ తుర్రున పారిపోయింది సుశీల.

రామం గాఢంగా నిట్టూర్చాడు. అతనికి సగం బరువు తీరినట్లు అనిపించింది. సుశీలా భాస్కర్‌ల వివాహం జరగటంలో తన కృషి ఫలిస్తుందని ధైర్యంగా అనుకున్నాడు. ఐదు నిమిషాలవరకు అట్లాగేవుండి వెళ్ళిపోదామని పైకి లేచాడు

అప్పుడే పందిర తీగలు కదలిన చప్పుడైంది. రామం దృష్టి అటు తిరిగింది. శశికళ అతని దగ్గరగా వచ్చి చేతులు కట్టుకొని "రాం! నన్ను క్షమించండి" అంది. వెన్నెల వెలుగులో మెరిసే ఆమె కళ్ళలోని నీళ్ళు అతనిని కంగారు పెట్టాయి. అతనిలో ఆందోళన ఆనందం సమ్మిళితమైపోయాయి.

"శశి! ఏమిటిది? ఎందుకీ కన్నీరు? ఏం తప్పు చేశావని నిన్ను క్షమించటం?"

"మీరు సుశీలతో రిక్షాలో వెళ్ళటం రాజమండ్రిలో చూసి అపోహపడ్డాను. నా అనుమానానికి తోడుగా మీరు వరుసగా రెండు రోజులు ఎక్కడ చూసినా సుశీలతో కనిపించారు. సినిమా హాల్లో కూడ అట్లాగే అవటంతో మీ హృదయం వేరొకరి సొత్తైమోనని కించపడి యీ క్షణంవరకు బాధ పడ్డాను."

రామం చిన్నగా నవ్వాడు. "అదా కథ! అందుకనే రమణితో "ఆయన కిప్పుడు మనం కన్పిస్తామా!...' అని అన్నావన్నమాట! మీ మాటలు నా మిత్రుడు భాస్కర్ విని నాతో చెప్పాడులే! అయితే వాడన్నట్లు కలహాంతరితనై నాపై అపోహ పడ్డావన్నమాట! అంతేకాదు...ఆడది యీర్ష్య పడిందంటే ఆమె ప్రియు డదృష్టవంతుడే.....అన్న మాట నిరూపించావు నువ్వు మామాటలు అయీర్ష్య చేతనే చాటుగా విన్నావు. ఇట్లా మన హృదయాలు తిరిగి కలుస్తాయో లేదోనని భయపడ్డాను. నువ్వు కలహాంతరితవే కాదు. ఈర్ష్య కషాయితవు కూడా! అందుకనే మా భాస్కర్ నిన్ను ప్రబంధ నాయిక అన్నాడు . .ఆ మాట నే నొప్పేసుకున్నాను బా. .మ్మా!"

"అట్లాగా తాతగారూ!" అంటూ అతని గుండెల్లో తలదాచుకుంది శశి తన బుగ్గ లతని పెదవుల్ని చేరగా. రాకాశశి వారిపై వెన్నెల మల్లెపూల వర్షం కురిపించాడు. ★




అరె ! మీరు ఝుణఝుణధ్వనితో బాధ పడుతున్నారు ! చాలా ప్రమాదం !!

## దక్షిణాఫ్రికా

(13 వ పేజీ తరవాయి)

తెగకు చెందినవాడు. వయసు 60 సంవత్సరాలకు పైబడి ఉంటుంది. ఉపాధ్యాయవృత్తి ననుసరిస్తున్నారు ఒకసారి భారతదేశానికి కూడా వచ్చారు. 1952—53 లో ఆఫ్రికన్ కాంగ్రెసుకు అధ్యక్షులయ్యారు లుతూలీ చాలా సాధుస్వభావం కలవాడని శ్రీ జాన్ గుంథర్ వ్రాశారు. 1935 లో కొందరు జూలూలు ఈయనను తమకు నాయకునిగా ఉండమని కోరగా, ప్రభుత్వం కూడా సమ్మతించింది. కాని రాజకీయ చైతన్యాన్ని కలిగిస్తున్నాడని ఆ పదవి నుండి తొలగించివేశారు.

డాక్టర్ జామా కూడా ఒకప్పుడు ఆఫ్రికన్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా పని చేశారు ఈయన ఒక చిత్రమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినట్లు శ్రీ గుంథర్ వ్రాశారు. బోయెర్ (బూర్( యుద్ధంలో ఓడిపోయిన ఆఫ్రికానర్లు బ్రిటిష్‌వారిపైన కోపం నల్లవారి మీద చూపిస్తున్నారని డాక్టర్ జామా అన్నారుట డాక్టర్ జామా వలెనే డాక్టర్ మొరోకా కూడా వైద్యులు. ఈయనా ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెసు అధ్యక్షులే. ఆఫ్రికన్ తెగల నాయకు లెందరో శ్వేతజాతివారివద్ద లంచాలు పుచ్చుకుని తమవారికే ద్రోహం చేస్తున్నారని వారి అభిప్రాయం. ఇటువంటి నాయకులే జాతీయోద్యమానికి అడ్డు వస్తున్నారనే ఊహ ఈయనకు ఉన్నట్లు తోస్తుంది.

### భారతీయులు

వీరిలో అధిక సంఖ్యాకులు హిందువులు. వారిని 'ఇండియన్ల'నడం మంచిది. దేశం మొత్తంమీద ఉన్న ఇండియన్లలో సుమారు 80% నాటాల్ రాష్ట్రంలోనే ఉన్నారు. ఒకవిధంగా యూరోపియన్లకు ఆఫ్రికన్లకంటె వీరంటేనే ద్వేషం. (వీరిని అనరాగా తీసుకుని నెహ్రూ దక్షిణాఫ్రికాను స్వాధీనం చేసుకొనడానికి ప్రయత్నిస్తున్నారని కొందరు ఆఫ్రికానర్లు అంటారు.)

'దక్షిణాఫ్రికా జాతీయ కాంగ్రెస్' (ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్) 1898 లో మహాత్మా గాంధి స్థాపించారు. దక్షిణాఫ్రికాలోనే మహాత్ముడు మూడు మాట్లు జైలుకు వెళ్లారు. గాంధీజీ దక్షిణాఫ్రికాను 1914 లో వదిలి మన దేశానికి వచ్చారు.

ప్రస్తుతం ఈ కాంగ్రెస్ నాయకులలో ప్రముఖుడు డాక్టర్ వై. ఎం. దాదూ. ఈయనను కమ్యూనిస్టనే నేరంపైన నిర్బంధించారు. వీరుకాక శ్రీ మణిలాల్ గాంధీ కూడా దక్షిణాఫ్రికాలో జాతీయ నాయకులలో ఒకరుగా ఉండేవారు.

దక్షిణాఫ్రికాలో ఇండియన్లు పేదవారు కాదు. బలవంతంపైన గాని దక్షిణాఫ్రికాను వదిలి వెళ్లరు. 

# గళ్లనుడికట్టు-49

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | ■ | 5 | | 6 |
| | ■ | | ■ | | ■ | | ■ | | ■ | |
| ■ | 7 | | 8 | | ■ | 9 | 10 | | 11 | ■ |
| 12 | | ■ | | ■ | ■ | ■ | | ■ | 13 | 14 |
| | ■ | 15 | | 16 | ■ | 17 | | 18 | ■ | |
| ■ | 19 | | ■ | 20 | | | ■ | 21 | | ■ |
| 22 | ■ | 23 | 24 | | ■ | 25 | 26 | | ■ | 27 |
| 28 | 29 | ■ | | ■ | ■ | ■ | | ■ | 30 | |
| ■ | 31 | 32 | | 33 | ■ | 34 | | 35 | | ■ |
| 36 | ■ | | ■ | | ■ | | ■ | | ■ | 37 |
| 38 | | | ■ | 39 | | | ■ | 40 | | |

## అడ్డం

1 ప్రక్కగా తుపాను అవు! వెతికి చూసి.
3. సత్యములో భాగం గురువు మొదటి భాగంతో కలిసి దీర్ఘమెలా అవుతుంది.
5. ఎలక్షన్!
7. ఆనుముక్క గుణములో మంచిది.
9. చూసి చేయితో కలిపి దయకలుగనీయండి.
12. వ్—వ్—మాటలు సరిగ్గా రావా? ఎందుకు?
13. వాడి వాగుడికి అంతం లేకపోతే దేవాలయానికి తీసుకురండి.
15 జీతం.
17. దివాకరుడు, అధికభాగం ఘనీభవించే గుణం సూచించాలి.
19 దేశంవంటి తోట!
20 కొన్ని చావుల గుణం సూచించే మూడక్షరాల మాట.
21. పేటిక.
23 చూడని.
25 ఆ గంపలవారి పుడకలలో ఒక వంటకం వెదకండి చూద్దాం!
28 అటువంటి గుడిసె ముందు తొలికే తిను బండారం.
30. రేఖవంటి గ్రంథం!
31. ఆరోహణ.
34 కవికరములోని సమూహవిశేషము!
38. పాతకము.
39 అతను పుట్టి దొంకలవాడు.
40 నిద్ర.

## నిలువు

1. తల.
2 సువాసన ద్రవ్యం.
3. క్షేత్రము.
4 నిద్రలో వినపడని శబ్దం
5 మూషికం.
6. తిరికలో ఉన్న పెద్ద జంతువు.
7. కొడవలితో కొన్ని సమయాలలో కనిపిస్తుంది.
8. చిందర వందరయిపోయిన కపోలమా ?
10. నిప్పు నిది కప్పుతుందంటారు.
11. పిరంగు తమ్మయ్య వర్ణం!
12. జిత్తులమారి.
14 తల్లక్రిందులయిన వేగం.
15. వేడుకోకపోతే అక్షరం కొట్టి తమాషా చెయ్యండి!
16 ద్వైసంధివ నిజాలలో ఒక అవు
17. ఇది చెరువవుతుందంటారు.
18. క్రిందినుంచి పైకి బుట్ట కొలతను చూపెట్టేది
22. ప్రథమ పురుష బహు వచనానికి చెందినది సముద్రంలో వెతకాలి!
24 చిందర వందరయిపోయిన సస్యవిశేషం 'పేరు' జ్ఞాపకం చేసుకోవండి!
26 కత్తులలో పిరాణి.
27. పురాతన ?
29. పూవపాటివారిలో సగం గుచ్చేది ఏది ?
30. సంగీతము సగం ఇల్లు!
32. పట్టేది!
33 —నిద్ర, అంటారు.
34 ఈ అధారాల వర్గము!
35. రాత్రి.
36. ఓ పాప! తల్లక్రిందులయినచో నీకు పట్టక ఏమి చేయగలిగెదవు ?
37. సగం అరయుము!

## 48-వ గళ్లనుడికట్టుకు జవాబు



శకునములందు నమ్మకము గలవానికి ఒక కుక్క ఎదురయ్యెను.

కాపు:— (బ్రాహ్మణునివద్దకు పోయి) అయ్యా! కుక్క ఎడమ నుండి కుడికిపోయిన మంచిదా లేక కుడినుండి ఎడమకు పోయిన మంచిదా అని అడిగెను.

బ్రాహ్మణుడు:— మీాద పడి కరవకపోయిన మంచిది అని చెప్పెను.

రత్నశేఖర్ (జగత్యాల.)

## పడవల్లాంటి పేలు

ఒక రచయిత తన రచనలను ఎన్నిసార్లు ప్రచురణార్థం పత్రికలకు పంపించినా అవి పత్రికల్లో కానరానందున విసుగెత్తి తనే బయలుదేరి వెళ్లాడు ఎడిటర్ దగ్గరకు తన రచనతో సహా...

ఎడిటర్ :—ఏమండీ ఈ కథలోని పిల్ల జుత్తు నల్లగా నిగనిగలాడుతూ నల్లత్రాచు పాములా ఉందని వ్రాశారు. ఈ వర్ణనలో క్రొత్తదనము ఏముందండీ? ప్రతివాళ్లూ ఇలాగే వ్రాస్తారు.

రచయిత:—అలాగాండీ! అయితే ఏమని వర్ణించమన్నారు? ఆమె జుత్తు సెలయేరులా వుంది. దానిలో పేలు పడవల్లా అటూ ఇటూ పయనించుతున్నాయి! అనా? అలా వ్రాస్తేపోనీ అది క్రొత్త వర్ణనవుతుందా? అప్పుడైనా నా కథ ప్రచురిస్తారా? ఏమండీ,

ఎడిటర్:—వద్దులెండి. అలావద్దు. అదిసరే, ఆమె కళ్లు పువ్వుల్లా ఉన్నాయి అని వ్రాశారు. ఏమి పువ్వులవి? ఆ పువ్వులకూ ఆమె కళ్ళకూ పోలికేమిటి?

రచయిత:—అదేమిటండీ, పోలికేమిటి అంటారూ? ఎందరి కళ్ళు పూలేసి కనుపించకుండా పోలేదు!

ఎడిటర్ :— ఓహో, ఆ సంబంధమా...సరేలెండి. ఐతే ఆమె పళ్ళు తెల్లగా మల్లె పువ్వుల్లా ఉన్నాయన్నారు. ఎవరిపళ్ళు మాత్రం నల్లగా ఉంటాయని మీ ఉద్దేశ్యం?

రచయిత :—అరె ఎందుకుండవండీ నల్లగా? భలేవారే మీరు; దానికి సాక్ష్యం కావాలంటే నాపన్నులే, ఇవిగో చూడండిఎలాఉన్నాయో...ఊఁ...

ఏమండీ మీరు నాకథలోని లోపాల్ని గురించి అడిగిన ప్రతి ప్రశ్నకూ సావధానంగా సమాధానాలివ్వటమే కాకుండా సాక్ష్యాలు కూడ చూపారు కదా, ఇక నా కథ మీ పత్రికలో కనిపించుతుందంటారా?

ఎడిటర్:_ఆ...కనిపించకేం బాగా కనిపిస్తుంది. వచ్చేవారం పత్రికకొని పూర్తిగా పువ్వులేసిన కళ్ళతో చూడండి.. ఇకపొండి...

డి. వి. రామరత్నం (బందరు)




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor : S. Sambhu Prasad.




అలంకరణ

చిత్రకారుడు—శ్రీ ఎమ్. శంకర్రావు (అనకాపల్లి)